# చతుర

ఆగస్ట్ 2001
రూ.7/-



## రాలని పువ్వు

ఎన్.ప్రభాకరరెడ్డి

# చతుర ప్రపంచం

## వింత అలవాట్లు

ప్రముఖ రచయితలు కొందరిని పరిశీలిస్తే వారిలో తమాషా ప్రవర్తనలు, వింత అల వాట్లు ఉన్నట్టు తేలింది. ఆ సమయంలో వారి ప్రవర్తన అచ్చంగా చిన్న పిల్లలను తల పించేదిగా ఉంటుంది.

లార్డ్ బైరన్ కవికి రాత్రిపూట దుష్టశక్తులు తన పైన దండయాత్ర జరుపుతాయేమోనని భయం. అందుకే రాత్రిపూట మంచం దగ్గర పిస్టళ్లను పెట్టుకునే వాడు. ఇక మధ్యరాత్రి లేచి గదంతా కలియతి రుగుతూ గాలిలోకి పిస్టలును చూపుతూ అక్కడ ఎవరో ఉన్న ట్టూ, తాను వారిని బెదిరిస్తున్నట్టూ ప్రవర్తించేవాడు.

షెల్లీకి చాలా వింత అలవాట్లు ఉన్నాయి. ప్రపంచ శాంతి కోసం అంతా ప్రయత్నించాలంటూ కాగితాల మీద రాసి దాన్ని సీసాలో పెట్టి సముద్రంలో విసిరే వాడు. అలాగే కాగితం పడవలను చేసి నీళ్ల ల్లోకి వదలడమన్నా ఆయనకు చాలా ఇష్టం. అందుకుగాను కాగితాలేమీ దొరకకపోతే డాలరు నోటులతోనే పడవలు చేసేవాడు.

ఫ్రాన్సిస్ బేకన్‌కు వర్షంలో తడవడ మన్నా, ఆ సమయంలో టాపులేని జీపులో చక్కర్లు కొట్టడమన్నా తగని సరదా.

జాన్‌జోనీ అనే కవికి ఓ విచిత్ర అలవా టుంది. ఎప్పటికైనా అంతా చనిపోవాల్సిందే నన్న విషయాన్ని రోజూ గుర్తు చేసుకునే వాడు. ఇందుకోసం ఆయన తన పడకగదిలో ఓ శవాల పెట్టెను పెట్టుకుని రోజూ కొంత సేపు దానిలో పడుకుని బతికుండగానే చావు తాలూకు అనుభూతిని అనుభవించేవాడా యన.

డాక్టర్ జాన్సన్‌కు ఓ వింత అలవాటుం డేది. రోడ్డుమీద నడిచేటప్పుడు వీధి స్తంభా లన్నింటినీ స్పృశించితే కానీ ముందుకు కది లేవాడు కాదు. ఒకవేళ పరధ్యాన్నంగా ఉండి మరిచిపోతే మళ్లీ వెనక్కి వచ్చి ఆ స్తంభాన్ని తాకి వెళ్లాల్సిందే.




చివరగా టాల్‌స్టాయ్ గురించి చెప్పుకో వాలి. ఆయనకెందుకో తాను పక్షిలా గాలి లోకి ఎగరగలనన్న నమ్మకం కలిగింది. అంతే ఓ రోజు రెండో అంతస్థునుంచి గాలి లోకి ఎగిరేందుకు ప్రయత్నించి కాళ్లు, చేతులు విరగ్గొట్టుకున్నాడు.

## విచిత్ర సంఘటన

సైన్స్ క్కూడా అందని వింతలూ, విడ్డూరాలూ కొన్ని ప్రపంచంలో జరుగుతూ ఉంటాయి. అగ్ని ప్రమాదాల గురించి మనం వింటూనే ఉంటాము. చిన్న సిగరెట్ పీక కూడా ఆర్ప కుండా, చూడకుండా పడేస్తే పొరపాటున దేన్నికైనా అంటుకున్నా ఎంతైనా దహనకాండ జరగవచ్చు.

ఫ్లోరిడాలో 1951 జూలై 1న ఒక విచిత్ర విషాద సంఘటన జరిగింది. 67 సంవత్స రాల మేరీ రీజర్ అనే ఆవిడ అప్పటిదాకా తన ఇంటి యజమానురాలైన ఫ్యాన్సీ కార్పెంటర్ తో పిచ్చాపాటీ మాట్లాడి మెల్లగా లోపలకి వెళ్లి ఈజీ చెయిర్‌లో పడుకుని నిద్రపోయింది. తెల్లవారుఝామున 5 గంటలకు ఆ ఇంటి ఓనర్‌కు ఏదో కాలిన వాసన వచ్చింది. వెంటనే లేచి అటూఇటూ చూసి గ్యారేజి లోకి వెళ్లి పరిశీలిస్తే అందులోని వాటర్‌పంప్ బాగా వేడెక్కింది. వెంటనే ఆ పంపును ఆఫ్‌చేసి ఇంట్లోకెళ్లి పడుకుంది. 8 గంటలకు టెలిగ్రాం అన్న కేకతో మెళుకువ వచ్చిన ఆవిడ లేచి వెళ్లి తలుపుతీసి చూసింది.

అది తనింట్లో అద్దెకుంటున్న మేరీ రీజర్ కోసం వచ్చిన టెలిగ్రాం. తనే సంతకం చేసి తీసుకుని రీజర్ ఫ్లాట్‌కు వెళ్లింది ఇంటి యజమానురాలు. తలుపు ఎంత కొట్టినా లోపలి నుంచి జవాబు రాకపోతే ఆవిడ తనే తెరుద్దామని తలుపు నాబ్‌మీద చెయ్యిపెట్టింది. అంతే! చెయ్యి కాలిపోయింది. ఆవిడ ఖంగారుపడి వెంటనే వీధిలోకి పరుగెత్తి దారిన పోతున్న ఇద్దరు వ్యక్తులను తీసుకువచ్చింది. వారు అతికష్టం మీద తలుపు తెరిచి లోపలకెళ్లి చూస్తే మేరీ రీజర్ కూర్చునే కుర్చీలో పిడికెడు బూడిద, కాసిని ఎముకలు కనిపించాయి. గోడలు పొగచూరినట్లు, ఒకటిరెండు కిటికీ అద్దాలు బీటలు తీసినట్లు కనిపించాయి. బాత్‌రూమ్ లోని ప్లాస్టిక్ మగ్‌లు వేడికి కరిగిపోయి ఉన్నాయి. ప్లాస్టిక్ స్విచ్ కూడా కరిగిపోయి ఉంది.




గడియారం 4.20 కి ఆగిపోయి ఉంది. ఇదంతా ఎలా జరిగింది? అన్నది ఎవరికీ అంతుపట్టలేదు.

ఎక్స్‌పర్ట్‌లు 2500 డిగ్రీల సెల్సియస్ వద్ద మాత్రమే శరీరమంతా అలా మాడి మసైపో గలదని తేల్చారు. అంత ఉష్ణోగ్రత అక్కడ జనించడానికి పిడుగు లాంటిది కూడా ఏదీ పడలేదు.

అయితే చాలామంది శాస్త్రవేత్తలు ఈ విషయంలో ఏకాభిప్రాయానికొచ్చి చెప్పిందేమంటే మనిషి శరీరంలోనుండే ఆ కరెంటు ఉత్పత్త యిందనీ.... అది చాలా అరుదనీ....

దాన్ని స్పాంటేనియస్ హ్యూమన్ కంబస్టన్ అంటారు. అప్పుడప్పుడది మనిషి ధరించిన వస్త్రాలను కూడా కాల్చకుండా కేవలం మనిషి శరీరాన్ని మాత్రమే బూడిద చేయగలదట. మరికొందరు మాత్రం దీన్ని పూర్తిగా ఒప్పుకోలేదు. దీనిమీద ఇంకా పరిశోధనలు కొనసాగుతూనే ఉన్నాయి.

---

## నిద్రపోను

**అ**నేవారు కూడా ఒకరున్నారంటే మనకు ఆశ్చర్యంగా ఉంటుందికదూ! కానీ ఈ విచిత్ర విశ్వంలో ఇలాంటి వింతలెన్నో ఉన్నాయి. సరే అసలు విషయమేమంటే వియత్నాంలో ఉంటున్న ఓ మహిళ గత ముప్ఫై అయిదేళ్లనుంచీ నిద్రన్నది ఎరగదు. అదేమైనా జబ్బా అని అనుమానం వస్తుంటుంది. అలా అనుకునే అక్కడి డాక్టర్లు కూడా ఈమెని రకరకాల పరీక్షలు చేసి ఆమెకేం జబ్బు లేదని తేల్చారు. దాంతోపాటు అన్నేళ్లుగా కంటిమీద కునుకు లేకుండా ఎలా మేనేజ్ చేస్తోందో తెలుసుకోవడానికి ఆమె మీద అధ్యయనం జరిపితే బాగుండునని కూడా అనుకుంటున్నారు.

కొంచెం వివరంగా చెప్పుకుంటే....

అనగనగా ఓ అమ్మాయి. ఆ అమ్మాయి పేరు గుమేన్‌తీతూ. ఈమె వియత్నాంలో ఉంటోంది. సంసారం ఆనందంగా జరుగుతున్న సమయంలో 1967 లో ఈమె భర్త మరణించాడు. అప్పటినుంచి గుమేన్‌తీతూ నిద్ర అన్నది ఎరగదు. ఒక్కక్షణం ఆదమరిచి నిద్రపోయినా భర్త సంపాదించిపెట్టిన కాస్తో కూస్తో సొమ్మంతా దోచేస్తారేమోనని భయం.

'నీకు నిద్రెందుకు పట్టదు?' అని అడిగామా మీదపడి కరిచేంత కోపంగా చూస్తుంది మనవంక. దొంగ వెధవలు ఎక్కడ కొంప దోచేస్తారో అని భయపడి చస్తుంటే నిద్రెలా పడుతుందని గొణుగుతుంది.

ఇక లాభం లేదని డాక్టర్లు ట్రాంక్విలైజర్లు కూడా ఇచ్చి చూశారు. అబ్బే లాభం లేకపోయింది. దాంతో ఇదో స్పెషల్ కేసేమోనని డాక్టర్లకి అనుమానం వచ్చి గుమేన్‌తీతూని అధ్యయనం చేస్తే బాగుండుననుకుంటున్నారు.




మరి అప్పుడు ఎన్ని విచిత్రాలు బయట పడతాయో!?

అంతా బాగానేఉంది కానీ ఆమెని ఇక్కడకు పిలిపించి నిద్రముఖాలకు క్లాసు తీసుకోమంటే బాగుంటుందేమో!?

◆

# చతుర కతలు

## ముద్దుగుమ్మ

ఆ రోజు రోజూ కన్నా ముందుగా కాలేజీ నుండి ఇంటికి చేరుకున్నాను. పుస్తకాలు షెల్ఫ్‌లో పెట్టేసి సాయంత్రం వెళ్లాల్సిన పెళ్లికోసం ముస్తాబు మొదలెట్టాను. డ్రస్సింగ్ టేబుల్ ముందు తల దువ్వుకుంటున్న నన్ను సంబోధిస్తూ, "నువ్వు వెళ్లేది ఆ రాంబ్రహ్మంగారి అబ్బాయి పెళ్లికేనా?" అన్నారు నాన్న.



"ఔను... ఏం?" అని సందేహంగా అడిగాను.

"అసలే పెళ్లి కావల్సిన వాడివి. వెళ్లేది పెళ్లికి. ఇప్పుడు కూడా ఆ ముసలాడి గెటప్ ఏంటీ? మాట్లాడితే సంస్కృతి, ఆచారం అంటూ అరవై ఏళ్ల ముసలాడిలా ఆ లాల్చీ పైజామా! చక్కగా జీన్స్‌ప్యాంట్ టీషర్ట్ వేసుకోవచ్చుగదా! పెళ్లి కొచ్చేవాళ్లల్లో ఎవరి కళ్లు ఎలాంటివో. సంబంధాలు కుదిరేది ఇలాంటి సందర్భాల్లోనే" అంటూ ఆయన అనుభవం అంతా వర్ణించారు.

"ఇలా పెళ్లికి వెళ్లొద్దంటే మానేస్తాగాని ఆ డ్రస్సులు నాకు పనికిరావ్?" అన్నా కాస్త చిరుకోపంతోనే.

"పోనీలెండి ముచ్చటపడి కుట్టించుకున్నాడు, ఆ లాల్చీ మల్లెపువ్వులా ఎంత ముద్దొస్తోందో" అంది అమ్మ మెచ్చుకోలుగా.

"నేను చెప్పేది వాడికోసమే. వాడు ఏ డ్రెస్సేసుకుంటే నాకేం! ఏదో కుర్రాడు పెళ్లి కావల్సినవాడు. నలుగురిలా ఫ్యాషన్‌గా వుండాలన్నాను" అన్నారు నాన్న సర్దుకో లుగా.

"డ్రస్సుల అలంకరణలతోటే మనుషుల వయసులు మారిపోతాయా? ముసలాళ్లు నెరసిన తలలకు రంగులేసుకుని మోడ్రన్ డ్రస్సులేసుకున్నంత మాత్రాన యువకులైపో తారా? " అన్నాను అమ్మ నా పక్షమే అన్న నమ్మకంతో.

"బాబూ! బుద్ధి పొరపాటై అన్నాను. లాల్చీతోపాటు పంచెకట్టుకుని వెళ్లు నాకేం! నువ్వొక్కడివే ఇలాంటి డ్రస్సులేసుకుంటే తెలుగు సంస్కృతి వుంటుంది. మరి నువ్వొ క్కడివే సంస్కృతీ సంరక్షకుడివి. మేమంతా పరాయివాళ్లం" అంటూ వీధిలోకి వెళ్లిపో యారు ఎకసెక్కెం బాణాలు సంధించి.

ఏదిఏమైనా నాకంటూ వున్న కొన్ని సొంత భావాలను చంపుకోలేక అలాగే బయలుదేరాను.

పెళ్లివారిల్లు రంగురంగుల విద్యుత్ దీపాల కాంతులతో మెరిసిపోతోంది. కళ్యా ణమండపం కొత్త గెటప్‌లో అలంకరిం చారు. వీడియో కెమేరామాన్ వచ్చి షూటిం గ్‌కి అనుకూలంగా లేదనడంతో ఆయన చెప్పిన మోడల్‌లో సెట్ చేయడానికి మండపం అంతా విప్పేస్తున్నారు. ఒకపక్క అర్థంకాని సాహిత్యంతో సంగీతం కలిసి పాటలాంటి శబ్దాలు స్పీకర్స్‌లోంచి గుమ్మె త్తుతున్నాయి. అబ్బాయిలూ, అమ్మాయిలూ వారివారి డ్రస్సుల్లో మెరిసిపోతూ అక్కడ అదనపు కాంతిని ఆరబోస్తున్నారు.

కాలక్షేపానికి కబుర్లాడుకోవడానికి తెలిసిన వారు ఎవరూ ఖాళీగా కనిపించడంలేదు. కాస్త దూరంగా కొబ్బరి చెట్టునీడలో ఎవరో వ్యక్తి నన్నే ప్రత్యేకంగా చూస్తున్నట్లు కని పించి అటువైపు కదిలాయి నా కాళ్లు. అక్కడ ఖాళీగా వున్న కుర్చీలు చూపిస్తూ కూర్చోండన్నట్లు ఆహ్వానించింది ఆ కొత్త మొహం.

ఎవరో కొత్త వ్యక్తి అనుకుంటూనే అక్కడ కూర్చున్నా. పరిచయాలు కాకుండానే నా సొంత ధోరణిలో "చూశారా? జనరేషన్ లోని మార్పు? వెధవ ఫ్యాషన్లు వాళ్లూనూ. ఇలా మోడ్రన్ డ్రస్సులేసుకుంటేనే అభివృద్ధి చెందినట్లా. కనీసం ఇలాంటి పెళ్లిళ్ల, పండ గలప్పుడైనా మన సాంప్రదాయ దుస్తులు ధరించుకోవచ్చుగదా? " అన్నాను నాలో అప్పటినుండి ఉప్పొంగుతున్న ఆవేశభా వాల్ని అదుపు చేసుకోలేక.

"ఔను, మీరన్నది నిజమే" అన్నట్లు ఆ కొత్త మొహంలో నవ్వులు కనిపించాయి ఆ మసక వెలుతురులో హితం.

నా భావాలను ఏకీభవిస్తున్న విధంగా అనిపించి కాస్త దగ్గరగా జరిగి "ఆ అమ్మా యిని చూశారా! ఆ జుట్టు, ఆ డ్రెస్సూ చూస్తుంటే ఆడోమగో కూడా అర్థం కావడం లేదు" అన్నాను కాస్త బాధగా.

"ఔను నిజమే కానీ మీరనుకున్నట్టు అమ్మాయికాదు అబ్బాయి. అతను మా అబ్బాయే" అని ఆ కొత్త వ్యక్తినుండి నవ్వుతూ సమాధానం వచ్చింది.

"అయ్యో! అలాగా మన్నించండి తెలియక అలా అన్నాను. ఏమనుకోకండి" అన్నాను కాస్త బిడియపు భయంతో.

"దాందేముంది, పొరపాటు ఎవరికైనా జరుగుతుందిలేండి!" అంటూ సౌమ్యంగా సమాధానం రావడంతో కాస్త ఊపిరిపీల్చు కొని,

"అయితే మీరు అతని నాన్నా? " అన్నాను అమాయకం నిండిన మొహంతో.

"కాదండీ... నేను వాడి మమ్మీని" అంటూ నా అమాయకత్వం తట్టుకోలేక అక్కడినుండి వెళ్లిపోయింది ఆ కొత్త మొహం.

**– అమ్మిన శ్రీనివాస రాజు**

# "పరిష్కారం"

ఆఫీసరు ఆనందరావు బెల్లునొక్కి ప్యూను పుల్లయ్య రాగానే అన్నాడు "గుమాస్తా గుర్నాధంని పిల్చుకొనిరా"

గుమస్తా గుర్నాధం లోనికివస్తూ అన్నాడు. "సార్! పిలిచారట"

"ఔను ఆ ఫైలు చూడు! ఏమిటి ఈ నోటు రాయటం? తలకాయ ఉందా?"

"సార్! అది..."

"ఏమిటి ఆ నసగడం?"

"ఉన్న ఫ్యాక్ట్సు అన్నీ ఒక్కటీ వదలకుండా రాశాను సార్!"

"ఫ్యాక్ట్సు రాస్తే పని అయిపోయిందా?"

"మన దగ్గర ఉన్న ప్రొపోజల్స్ అన్నీ చూపించాను సార్" "ఏడ్చినట్లే ఉంది. ప్రొపోజల్స్ అన్నీ ఇంక్లూడ్ చేస్తే సరిపోయిందా? ఏ ప్రొపోజల్ బాగుంది, ఏది బాగోలేదు, ఎందుకు బాగాలేదు? వివరణ ఇచ్చావా?"

"అది హెడ్‌క్లర్కుగారు సూచిస్తే బాగుంటుందనిపించింది సార్!"

"అది సరే! తగలడ్డట్టే ఉంది. పోయి హెడ్‌క్లర్క్‌ని పంపించు".

హెడ్‌క్లర్కు హనుమంతరావు వచ్చినా ఆనందరావు ఫైలు చూస్తూ తల పైకెత్తలేదు. అతను చిన్నగా దగ్గి పక్కన నిలబడ్డాడు. అతన్ని కూర్చోమనకుండానే ఆనందరావు అన్నాడు.

"ఏమయ్యా! హనుమంతరావ్, హెడ్‌క్లర్కుగా ఎన్నాళ్లనుంచీ పనిచేస్తున్నావు?"

"ఏమయ్యింది సార్?"

"ముందు నా ప్రశ్నకి సమాధానం చెప్పు"

"సార్ రేపు ఏప్రిల్ 15కి ఎనిమిదేండ్లు పూర్తవుతాయి"

"ముందునుంచీ ఇలాగా చేస్తున్నావా? ఫైల్స్‌ని పుటప్ చేసేది ఇలాగేనా? గుడ్డిగా ఇనీషియల్స్ వేస్తే సరిపోతుందా? ఇందుకేనా ఇంత జీతం ఇచ్చి హెడ్‌క్లర్కుగా వేసింది?"

హనుమంతరావుకు ఏం జవాబు ఇవ్వాలో తోచిందికాదు. కాసేపు ఆలోచించి అన్నాడు.

"సూపర్నెంటుగారికి ఎంతో అనుభవం సార్! ఆయన సర్వీసులో ఇటువంటి కేసులు లెక్కలేనన్నివి చూసుంటారు, సార్! అందుకని వారు వివరంగా డిస్కస్ చేస్తారని ఫైలు సూపర్నెంటుగారి ద్వారా పంపాను సార్!"

"సరే! పోయి సూపర్నెంటుని పంపించు"

సూపర్నెంటు సూర్యనారాయణ వచ్చి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుందామా, వద్దా అని తటపటాయిస్తున్నాడు. కూర్చోమని సంజ్ఞ చేస్తూ ఆనందరావు అన్నాడు.

"ఏమండీ, సూర్యనారాయణగారూ! ఫైలు పంపించే విధానం ఇదేనా? మీదంటూ ఒక అభిప్రాయం తెలియజెయ్యొద్దా?"

"ఏ ఫైలండీ! జగన్నాధపట్నం మండలంలో జూనియర్ కాలేజి ఫైలా సార్!"

"ఔనండీ, దాని గురించే!"

"చూడండి సార్! మన హెడ్‌క్లర్కు మరీ బాధ్యత లేకుండా వ్యవహరిస్తున్నాడండీ! అన్ని ఫైళ్లు నా ద్వారా పంపిస్తున్నాడండి. ఫైళ్ల డిస్పోజల్‌లో ఇప్పుడు లెవెల్ జంపింగ్ వచ్చిందా అండి? కొన్ని ఫైల్స్ అయినా తన లెవెల్లో ఫైనల్ రిమార్క్సు రాసి డైరెక్టుగా మీకు పుటప్ చేయొచ్చుగదా! అన్నీ నేను కూడా A to Z దాకా చదవాలంటే కుదురుతుందా అండి? పనిబారంతో కొన్ని ఫైళ్లలో ఇనీషియల్స్ వేసి పంపక తప్పటం లేదు"

"ఇక మీరు వెళ్లొచ్చు" అసహనంగా అన్నాడు ఆనందరావు.

ఆనందరావు ఆలోచించాడు, కింది ఉద్యోగుల్లాగా ఊరికే ఇనీషియల్స్ వేసి డైరెక్టర్‌కి ఫైలు పంపితే బావుండదు. తన కంట్రిబ్యూషన్ చూపించాలి. జగన్నాధపట్నం మండ

లంలో కోపరేటివ్ సెక్టారులో కొత్తగా జూనియర్ కాలేజి తెరవడానికి మూడు ప్రపోజల్స్ వచ్చాయి. మూడు సొసైటీల తాలూకు ప్రపోజల్స్ పూర్తి వివరాలతో గుమాస్తా గుర్నాధం మూడు పేరాల్లో సూచించాడు. ఆనందరావు ఒక ఎర్రకలం తీసుకొని ఆ మూడు పేరాల పక్కగా గీతలు గీసి `A', `B', `C' అని మార్కు చేశాడు. A, B, C ప్రపోజల్స్ మూడు బాగా ఉన్నాయని, బాగా పరిశీలించిన మీదట ఏ ప్రపోజల్ ఆమోదించినా ఆక్షేపణ ఉండదని తన



అభిప్రాయాన్ని రికార్డు చేసి, ఫైలుని డైరెక్టర్‌కి మార్కు చేశాడు. ఫైలుని డైరెక్టరుకి పంపే ఫైళ్లన్ని ట్రేలో వేస్తూ ఒక డిఫికల్ట్ ఫైల్ డిస్పోజాఫ్ చేశానన్న తృప్తితో సిగరెట్టు వెలిగించాడు ఆనందరావు. ఏ సొసైటీకి రికమెండ్ చేస్తే ఏం కొంప మునుగుతుందో? డైరెక్టు రిక్రూట్‌మెంట్ ఆఫీసర్లు ఏం చేసినా చెల్లుతుంది. అందుకనే తాను ఫైలును అలా పంపించాడు ఆనందరావు తన తెలివికి తానే మురిసిపోతూ.

ఒక నెలరోజులు ఆ ఫైలు డైరెక్టర్ రమాకాంత్ టేబుల్‌మీద విశ్రాంతి తీసుకొంది. మెరిట్‌మీద ఎవరు డెసిషన్స్ తీసుకొంటున్నారు గనుక అనుకున్నాడు రమాకాంత్. ఇన్నాళ్లు ఎదురుచూసినా తమ ప్రిఫరెన్సు తెలియచేస్తూ మంత్రి దగ్గరనుండిగాని, ఆయన సెక్రటరీ దగ్గరగాని, పి.ఏ.నుండి గాని వర్తమానం రాలేదు. వస్తే అందుకు అనుగుణంగా రికమెండ్ చేయొచ్చు అంత వరకు ఫైలు తన దగ్గర ఉంచుకుంటే బాగుండదు. ఫైలు వెనక్కి పంపించాడు రమాకాంత్ బాగా ఆలోచించి.

నెలరోజుల తర్వాత వచ్చిన ఫైలును చూసి ఏ సొసైటీ ప్రపోజల్ ఖరార్ అయిందో చూద్దామని కుతూహలంగా నోటుషీటు తిప్పాడు ఆనందరావు.

"ప్లీజ్ స్పీక్" అన్న రిమార్కుతో ఆ ఫైలు తనకి మార్కుచేసి ఉంది. ఆ సాయంత్రానికి అదేమాదిరి రిమార్కుతో ఆ ఫైలు గుర్నాధం బల్లమీదకి చేరింది. మళ్లీ పిలిచినప్పుడు మాట్లాడవచ్చులే అనుకున్నాడు గుర్నాధం.

– శ్రీ మాయ

సంపుటి: 24 సంచిక-7 283వ సంచిక
ఆగస్ట్: 2001

కూటికి పేదరాలయినా గుణానికి మాత్రం పేదకాదామె. కూలిపనితో బ్రతుకుతున్నా డబ్బుకోసం ఎలాంటి నీచమైన పనులకూ తల ఒగ్గలేదామె. పొట్టకోసం... పట్టెడన్నం కోసం... రెక్కలు ముక్కలు చేసుకునే ఆమెపై అత్యాచార ప్రయత్నాలెన్నో జరిగాయి. పని ఇచ్చిన వాళ్ళు పనిచేయించుకోవడమే కాక తమకు శారీరక సుఖాన్ని కూడా ఇవ్వాలన్న షరతు పెట్టేవారు.

ఎక్కడికి వెళ్లినా ఎదురవుతున్న ఈ భయంకర సమస్యను ఆమె ఎలా ఎదుర్కోగలిగింది? ఇటువంటి స్త్రీల సమస్యలకు ప్రతిస్పందించి మేలు చేయబోయిన ఓ యువ జర్నలిస్టుకు ఎదురయిన సమస్యలెలాంటివి?

మనసులను కరిగించే మరపురాని సంఘటనలను మన ముందుంచిన

**ఎన్.ప్రభాకరరెడ్డి** రచన

**'రాలని పువ్వు'** ఈనెల చతుర సమగ్ర నవల.



బొండుమల్లి పువ్వులా బొద్దుగావున్న ఆమె బుగ్గను ముద్దెట్టుకోవాలన్న తపనతో నులివెచ్చని కిరణాలు తూరుపు కొండల్లో నుండి పరుగెత్తుకొస్తున్నాయి.

పయ్యెదలాగాలని పిల్లగాలొకటి అవకాశం కోసం చూస్తూ చక్కర్లుకొడుతోంది.

ఆమె చకచకా నడుస్తోంది.

మెత్తటి ఆమె పాదాల స్పర్శకు చక్కిలిగిలికి లోనవుతూ పులకింతలు పోతున్నట్లుంది రహదారి.

కుడిచేయి లాగుతుంటే బక్కెట్టును ఎడమచేతికి మార్చుకుంది.

ఉత్సాహంగా ఎగురుతోన్న పైటనులాగి బొడ్డున చెక్కింది.

నడకలో వేగం పెరిగింది.

గుడిగంటల శబ్దం తెరలుతెరలుగా వినిపిస్తోంది. దూరంగా గోవిందరాజులస్వామి గుడిగోపురం కనిపిస్తోంది. తలెత్తి చూసి మనసులోనే దేవుడికి మొక్కుకుంది.

దూరంగా జనం గుమికూడి వుండడం కనిపించింది. అదేనేమో నాలుగ్గాళ్ల మండపం అనుకుంది.

నడక మందగించింది. నెమ్మదిగా గుంపును సమీపించింది. అందరూ కొత్తే!

కొంచెం పక్కగా నిలుచుంది.

ఎవరికి వాళ్లు పక్కవాళ్లతో జోరుగా మాట్లాడుతున్నారు. అప్పుడప్పుడూ ఘాటైన దగ్గులు, గుప్పుగుప్పున లేస్తున్న బీడీ పొగలు. వెకిలి నవ్వులు... గునపాలు, పారలు, పెయింట్ డబ్బాలు, బ్రష్‌లు... ఒక్కొక్కరి దగ్గర ఒక్కోరకం.

అందరి చేతుల్లోనూ అన్నం బక్కెట్లు, భుజాలమీద కండువాలు.

అందరూ ఎవరికోసమో ఎదురుచూస్తూ వున్నారు.

వున్నట్లుండి అక్కడున్నవారిలో చలనమొచ్చింది. అందరికళ్లూ గాంధీరోడ్‌కేసి చూస్తుంటే ఆమె కూడా తల తిప్పి చూసింది.

ట్రాక్టర్ వస్తోంది. అది డబడబా శబ్దం చేస్తూ వచ్చి నాలుగు కాళ్ల మండపం వద్ద ఆగింది.

రాజారెడ్డి దిగాడు.

మనిషి పొట్టిగా వున్నా దిమ్మటంలాగా వున్నాడు. మొహంలోని కరుకుదనం మొరటు వ్యక్తని చెబుతోంది.

"ఏం రాజన్నా లేటు" ఎవరో పలకరించారు.

"మాటలు మళ్లా... ముందు పనికాడికి పోవాల" అంటూ తనకు కావలసిన మనుషుల్ని ఎంపిక చేసుకునే ప్రయత్నంలో పడ్డాడు.

"నువ్వురా... నువ్వురా" అంటూ ఓ పదిహేనుమంది మగవాళ్లను ఎంపిక చేశాడు. ఎంపికైన వాళ్లందరూ గబగబా వెళ్లి ట్రాక్టర్ ఎక్కి కూర్చున్నారు. అతను ఆడవాళ్లవైపు తిరిగాడు.

ఆడవాళ్ల కళ్లంతా అతనిపైనే వున్నాయి. ఎవర్ని పిలుస్తాడో తెలియక అందరూ టెన్షన్‌గా చూస్తున్నారు. ఒకరిద్దరు మాత్రం తమనే పిలుస్తాడని ధీమాగా వున్నారు.

అతను అందర్నీ ఒకసారి పరికించాడు. అతని దృష్టి వారగా నిలుచున్న ఒకామెపై పడింది.

వూపిరిబిగబట్టిందామె! పిలుస్తాడా?

ఒక్కక్షణం అలాగే చూసి "నువ్వురా" అన్నాడు.

ఆనందం ఎగజిమ్మింది. వెళ్లి ట్రాక్టర్ ట్రాలీ ఎక్కి కూర్చుంది.

"ఏం రాజన్నో... పనొస్తుందో రాదో తెలియకుండానే బండెక్కించేస్తున్నావు" అంది తులశమ్మ వ్యంగ్యంగా నవ్వుతూ.

తులశమ్మ వయసు ముప్పై, ముప్పైఅయిదు మధ్య వుంటుంది.

ఎప్పుడు చూసినా గలగలా మాట్లాడుతూనే వుంటుంది. నుదుట పెద్ద సైజు బొట్టుబిళ్ల ఆమెలో ప్రత్యేక ఆకర్షణ.

"ఎవర్ని పిలుచుకున్నా నిన్ను పిలవ

కుండా పోనుగానీ పద బండెక్కు" అన్నాడు రాజారెడ్డి నవ్వుతూ.

ఆమె వెళ్ళి ట్రాక్టరెక్కింది. మరో ఐదుమందిని పిలిచి బండెక్కించాక రాజారెడ్డి కూడా వెళ్ళి ట్రాక్టరెక్కాడు.

ట్రాక్టరు కదిలింది.

మిగిలిపోయిన వాళ్లందరూ చూపులు తిప్పి మరో ట్రాక్టర్ కోసం నిరీక్షణలో పడ్డారు.

తారు రోడ్డుమీద వెళుతున్నా ట్రాలీ పెద్దగా శబ్దం చేస్తూనే వుంది. కుదుపులకు ట్రాలీలో వాళ్లు ఎగిరెగిరి పడుతున్నారు.

ఆమె చక్కముక్కాలు వేసుకుని ఒక వారగా కూర్చుని అంచును గట్టిగా పట్టుకుని వుంది. పక్కనే తులశమ్మ. వెనగ్గా మిగతా వాళ్లు. డ్రైవర్ వెనుక చెక్కపై కూర్చునివున్న రాజారెడ్డి తులశమ్మకేసి చూస్తూ కన్నుగీటాడు ఎవరూ చూడకుండా.

అర్థమయ్యిందన్నట్లుగా నవ్వింది తులశమ్మ.

మగవాళ్లంతా తనకేసి వింతగా చూస్తుంటే బిడియంగా వుంది ఆ కొత్తామెకు. వంచిన తల ఎత్తలేదు.

"కొత్తగా వచ్చినావా" అంది తులశమ్మ ఆమెను మాటల్లోకి దించుతూ.

"వూ"

"మనమిప్పుడు ఏం పనికి పోతున్నామో తెలుసునా? "

"వూహూ"

"ఏం పనికి పోతున్నామో తెలియకనే పనికి వస్తున్నావా? " ఆశ్చర్యపోయింది తులశమ్మ.

చేయడానికి ఏ పనైతేనేం? అని కాబోలు ఆమె ఏమీ మాట్లాడలేదు.

"మనిషికి అంత సిగ్గయితే ఎట్టమ్మా? కొంచెం తలెత్తి, నోరు విప్పి మాట్లాడు"

బెరుగ్గానే తలెత్తింది.

"నీ పేరు? "

చెప్పింది.

"ఈ వూరేనా? "

"కాదు, చిత్తూరు దగ్గర పల్లె"

"బంగారట్లా పల్లెనొదులుకొని ఈ తిరుపతిలో బతుకుదామని వచ్చినావా? " తులశమ్మ గొంతులో సానుభూతి ధ్వనించింది.

"ఇంతకీ నీకు అన్ని పనులూ వస్తాయా? "

వస్తాయన్నట్లుగా తలూపింది.

పదిహేను నిమిషాల ప్రయాణం తరువాత ట్రాక్టర్ ఆగింది.

"దిగండి దిగండి" అంటూ అరిచాడు రాజారెడ్డి.

అందరూ కిందికి దిగారు.

రాజారెడ్డి నేరుగా టీకొట్లోకి దూరాడు. సిగరెట్టు నోట్లో పెట్టి అంటించాడు. గుప్పుగుప్పున పొగ వదులుతూ టీకి ఆర్డర్ చేశాడు.

కూలీలందరూ టీ అంగడివద్దకు వచ్చారు.

తలా ఒక గ్లాసు తీసుకున్నారు. తులశమ్మ టీగ్లాసు ఎత్తుకుని వచ్చి ఆమెకిచ్చింది.

"ఆయనుండాడు చూడు. ఆయన పేరు రాజారెడ్డి. కాంట్రాక్టరు. చాలా మంచివాడు. పనిలోకి దిగేముందు అందరికీ టీ ఇప్పిస్తాడు. మధ్యాహ్నం అన్నం తిన్న తరువాత ఆడవాళ్లకు వక్కాకు, మగవాళ్లకు బీడీలు... సాయంత్రం మళ్లీ టీ ఇస్తాడు. ఏ రోజు కూలీ ఆ రోజే ఇచ్చేస్తాడు. నాకు తెలిసి ఇంకే కాంట్రాక్టరూ ఈ మాదిరిగా చేయరు. అందుకే అందరూ రాజారెడ్డి దగ్గర పని చేయాలని కోరుకుంటారు" అంది తులశమ్మ.

తను లేచిన టైం బావుంది. కాబట్టే తనకు రాజారెడ్డి లాంటోళ్ల దగ్గర పని దొరికింది అనుకుంది ఆమె.

టీ తాగడం అవుతూనే అందరూ పక్కనే వున్న సందులోకి నడిచారు. అక్కడ మూడంతస్థుల ఇంటి నిర్మాణం జరుగుతోంది. రెండో అంతస్థుకు గోడలు కట్టాల్సి వుంది. మూడో అంతస్థుకు మోల్డింగ్

పోయాల్సివుంది.

"ఇదే మనం చేయాల్సిన చోటు" చెప్పింది తులశమ్మ.

పనిలోకి దిగారు అందరూ.

ఇద్దరు సిమెంటు, గులకరాయి, ఇసుక తెచ్చి మిషన్‌లో వేస్తున్నారు. ఆ మిశ్ర మాన్ని మరో ఇద్దరు టకారుల్లో పోస్తుంటే వరుసగా నిలబడివున్న మిగతావాళ్ళంతా చకచకా ఆ టకార్లను చేతులు మారుస్తూ మేస్త్రీ దగ్గరకు చేరుస్తున్నారు.

పని కొత్తే, అయినా పని దొరికిందన్న సంతోషంలో 'ఆమె' హుషారుగా పనిచేయ సాగింది.

రాజారెడ్డి అటూ ఇటూ తిరుగుతూ, కూలీలను హెచ్చరిస్తున్నాడు. అప్పుడప్పుడూ ఆడ వాళ్ళ దగ్గర నిలబడి పరాచికాలు ఆడుతు న్నాడు.

క్రమంగా పొద్దు పైకెక్కసాగింది.

వక్కాకు వేసుకోడానికీ, బీడీలు తాగడాని కని కొంతసేపు పని ఆపారు. బాగా దాహం వేస్తుంటే 'నీళ్ళెక్కడున్నా'యని తులశమ్మనడి గింది ఆమె.

"ఆ మెట్ల దగ్గరుంటాయి పో" అంది తులశమ్మ బొడ్డులోనుండి వక్కాకు తిత్తి తీస్తూ.

మెట్లవైపు నడిచింది ఆమె.

మెట్ల పక్కగా చిన్న టేబుల్ ఉంది. దాని పైన వాటర్ బాటిల్ వుంది. దాన్నెత్తుకుని తాగుతూ వుంది.

"అయ్యో! ఎంత పనిచేశావ్. ఆ నీళ్లు తాక్కూడదు" అన్న మాటలు వినబడ్డాయి. తత్తరపడి బాటిల్ దించేసి నోట్లో వున్న నీళ్లను గబుక్కున మింగింది. పొలమా రింది. నెత్తిమీద చేత్తో తట్టుకుంటూ ఆ మాటలు వినిపించినవైపు చూసింది.

తనతోపాటే పని చేస్తూ వున్న మరొకామె మెట్లపై నిల్చొనివుంది. తనని నేరస్థురాల్ని చూసినట్లు చూస్తోంది.

"ఆ నీళ్లు కాంట్రాక్టర్ వాళ్లు తాగేందుకు పెట్టినవి. మనకు ఆ పక్కన బిందె పెట్టారు చూడు. వాళ్ల నీళ్లు మనం తాగితే రాజారె డ్డన్న ఒప్పుకోడు. ఆయనకు కోపంవస్తే ముందూవెనుకా చూడకుండా తిడతాడు. అట్లా నీళ్లు తాగే వాళ్లను మళ్లీ ఎప్పుడూ పనిలోకి తీసుకోడు" అంది.

ఒక్కసారిగా భయం వేసింది ఆమెకు.

అసలే తను కొత్త. తెలియకుండా చేసే సింది. ఇప్పుడు ఆయనకు కోపంవస్తే రేప టినుండి పనికి పిలుస్తాడో లేడో ఇంతకీ ఇప్పుడు ఎన్ని తిట్లు తినాల్సి వుందో.

అంతలో రాజారెడ్డి రానేవచ్చాడు.

ప్రైప్రాణాలు పైనే పోయాయి ఆమెకు.

అతను రావడం రావడంతోనే "ఏం ఇంకా ఇక్కడే నిల్చుని వున్నారు. పోయి పని చూడండి" అంటూ హడావిడిగా లోపలికి వెళ్లిపోయాడు.

హమ్మయ్యా అని వూపిరి పీల్చుకుంది.

చకచకా వెళ్లి పనిలోకి దిగింది. పని వూపందుకుంది. పెద్ద శబ్దంతో మిషన్ సిమెంటు, గులకరాళ్లను కలుపుతోంది. టకార్లు రయ్యి రయ్యిన చేతులు మారుతు న్నాయి. తాపీమేస్త్రీలు జోరుగా పని చేస్తు న్నారు. ఎత్తు సరిచూసుకుంటూ వెనక్కి జరుగుతున్నారు.

ఇంతలో తులశమ్మకు పిలుపొచ్చింది. తులశమ్మ చెమట తుడుచుకుంటూ ఆఫీసు లోకి వెళ్లింది. కడుతున్న ఇంటిలోనే కింది అంతస్థులో నాలుగు గోడలూ కట్టివున్న ఒక గదిని అక్కడ ఆఫీసుగా వాడుతున్నారు. తలుపులు, కిటికీల స్థానాల్లో కర్టెన్లు కట్టివు న్నారు.

అయిదు నిమిషాల తరువాత జుట్టు సవ రించుకుంటూ ముసిముసి నవ్వులు నవ్వు కుంటూ తిరిగొచ్చింది తులశమ్మ.

ఏదో అర్థమయినట్లు అనిపించింది. అయినా మనకెందుకులే అని పనిమీద దృష్టి పెట్టింది ఆమె.

తులశమ్మ వచ్చీరావడంతోనే "నిన్ను

రాజారెడ్డి రమ్మంటున్నాడు" అని చెప్పింది. ఉలిక్కిపడింది ఆమె.

"నన్నా? " గొంతు కూడదీసుకుంటూ అడిగింది.

"అవును, నిన్నే!"

ఏదో అపశకునంగా అనిపించింది.

"ఎందుకు? " అడిగింది.

"ఏమో నాకేం తెలుసు. పోయి ఆయన్నే అడుగు" వ్యంగ్యంగా అంది తులశమ్మ.

కొంపతీసి నీళ్లు తాగినందుకు పిలిపిస్తున్నాడా?

ఎవరు చెప్పుంటారు?

తులశమ్మా... మరెవరయినానా?

ఎట్లా తిడతాడో?

బిక్కుబిక్కుమంటూనే ఆఫీసుకేసి నడిచింది. ఆఫీసు దగ్గరయ్యేకొద్దీ నడక మందగించిపోతోంది. గుమ్మం దగ్గర ఒక క్షణం ఆగింది. పోదామా? వద్దా? పోకతప్పదు. తిడితే తిట్టనీలే. తెలియక చేశానని చెబితే సరి. ధైర్యం తెచ్చుకునే ప్రయత్నం చేస్తూ లోపలికి అడుగుపెట్టింది.

ఆమెను చూడ్డంతోనే "రా...రా" అన్నాడు రాజారెడ్డి నవ్వుతూ.

అతను కుర్చీలో కూర్చుని, ముందున్న టేబుల్ మీద చేతులు పెట్టుకుని వున్నాడు. నెమ్మదిగా అడుగులేస్తూ టేబుల్ ముందు కెళ్లి నిలుచుంది.

"కూర్చో"

వెళ్లి అతనికి దగ్గరగావున్న కుర్చీలో కూర్చుంది.

అతను రిజిష్టర్ తెరిచాడు.

"నీ పేరు? "

చెప్పింది

"ఇంతకు ముందెప్పుడూ నిన్ను చూడలేదు కొత్తా? "

"ఊc"

అతని చూపులు ఆమె శరీరాన్నంతా తడుముతున్నాయి.

ముళ్లమీద కూర్చున్నట్లుంది ఆమెకి.

"ఎక్కడ వుంటున్నావు? "

"జీవకోన" మాటలు కూడదీసుకుంటూ చెప్పింది.

"అంతదూరం నుండి నాలుగుకాళ్ల మండపం వరకు నడిచొస్తున్నావా? " అతని గొంతులో జాలీ, సానుభూతి ధ్వనించింది.

ఏమీ మాట్లాడలేదు ఆమె.

లోనికి వచ్చినప్పటినుండి ఆమె తలవంచుకునే వుండడం చూసి "నీ మాదిరిగా సిగ్గుపడేవాళ్లంటే నాకు చాలా ఇష్టంగానీ పని చేసేటప్పుడు కూలోళ్లు ఇట్లా సిగ్గుపడితే మాత్రం. నా కొంపలంటుకుంటాయ్" అని చెప్పి పకపకా నవ్వాడతను అదేదో పెద్ద జోక్ అన్నట్లు.

ఆమె నవ్వలేదు.

అతనే సంభాషణ కొనసాగిస్తూ "ఎంతవరకు చదువుకున్నావు? " అన్నాడు.

కూలోళ్లు ఎంతవరకు చదువుకున్నారో ఈయనకెందుకు. అయినా అడిగాడు కాబట్టి ఏడువరకు అని చెప్పేస్తే పోలా అనుకుని నోరు తెరవబోయింది.

అంతలోనే "అయితే అందర్లాగే నువ్వూ చదువుకోలేదన్నమాట" అన్నాడు, అతను ఏదో కనిపెట్టేసినట్లు ఉత్సాహపడిపోతూ.

ఇక నోరు తెరవలేదు ఆమె.

"ఇక్కడ సంతకం పెట్టాలి. నీకు చదువు రాదు కాబట్టి వేలుముద్ర వేద్దువుగానీ రా!" అన్నాడు.

కూలీ పనిచేసేవాళ్ల చేత సంతకం పెట్టించుకుంటారా? బహుశా పట్టణంలో ఇలానే చేస్తారేమో అనుకుంటూ లేచి నిలబడింది.

ఇంకుప్యాడ్ తెరచి అందులో వేలు అద్దబోతుంటే "ఈ చేయికాదు ఆ చేయి" అంటూ అతనే చొరవగా ఆమె చేయిపట్టుకున్నాడు.

ఆమె చేతివేళ్లను రుద్దుతూ ఆమె కళ్లలోకి చూశాడు. ఆమెకు ఏదో భయం వెన్నుపాము వెంబడి సరసరాపాకింది. చేతిని ఇంకు ప్యాడ్ పైకి తెచ్చి ఆమె బొటనవేలిని

గట్టిగా అదిమాడు. అతనికి కావలసిన చోట పేపర్‌పై వేలిముద్ర వేసుకున్నాడు.

వేలిముద్ర వేసేసినా ఆమె చేయి అతని చేతిలోనే వుంది. వదిలేస్తాడేమోనని ఎదురు చూస్తూ వుంది.

ఆమెలో వ్యతిరేకత కనిపించకపోవడంతో అతనికి ధైర్యం వచ్చింది.

అయితే ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో తెలియదు. "నువ్వు బలే గట్టిగా వున్నావు. అందుకే నిన్ను చూస్తూనే పనిలోకి పిలుచుకున్నా" అంటూ బాగా చనువున్న వ్యక్తిలా ఆమెను మరింత దగ్గరకు లాక్కుని జబ్బుమీద చరిచాడు.

ఆమెకు వళ్లంతా పురుగులు పాకినట్లు అనిపించింది. చేయి లాక్కోవాలని జూసింది. అతని పట్టు మరింత బిగిసింది.

ఆమెలో భయం పెరిగిపోయింది.

"నువ్వు - చాలా అందంగా వుండావు. నీలాంటి ఆడది కూలీపని చేస్తావుందంటే నా గుండె బరువెక్కిపోతావుంది. అయినా తల రాతను ఎవరూ మార్చలేరుకదా! ఏం చేద్దాం చెప్పు. నాకు చేతనైనంత సహాయం నీకు చేస్తాను. అదే వీలైనంత తక్కువ పని, సుళువైన పనినే నీకు చెబుతాను. అట్లా నిన్ను సుఖపెడతాను. బదులుగా నువ్వు నన్ను సుఖపెట్టాలి. సరేనా" అంటూ రెండు చేతులతో ఆమెను తన బాహువుల్లోకి బలంగా లాక్కున్నాడు.

ఆమెకు కోపం, దుఃఖం, అసహ్యం అన్నీ ఒక్కసారిగా కలిగాయి. "వదులు వదులు" అని బలంగా గుంజుకోసాగింది.

ఆమెను మరింత గట్టిగా కౌగిలించుకుంటూ "ఎందుకు బెట్టుచేస్తావు. అందరూ ముందు ఇట్లానే గుంజుకుంటారు. నాలుగు రోజులుపోతే నన్ను పిలవలేదే అని వెంటబడతారు" అంటూ ఆమె పెదాలపై ముద్దుపెట్టుకునే ప్రయత్నం చేశాడు.

ఆమె మొహాన్ని పక్కకు తిప్పేసి తన చేతులతో అతని ముఖాన్ని దూరంగా నెట్టి పట్టుకుంది.

"పతివ్రత ఫోజులు పెట్టొద్దు. కూలికొచ్చే వాళ్లందరూ ఎట్లాంటోళ్లో నాకు తెలియదా. ఈ పొద్దు నీతో పనికి వచ్చిన వాళ్లందరూ నా దగ్గర పడుకున్నవాళ్లే. పడుకోవలసిన వాళ్లే. వాళ్ళేమైనా అనుకుంటారని సిగ్గుపడద్దు. ఒకవేళ వాళ్లేమైనా అంటే నేను చూసుకుంటాను" అంటూ ఆమె చేతులను వెనక్కి అదిమిపెట్టేసి ఆమెను నేలమీద పడుకోబెట్టేందుకు ప్రయత్నించసాగాడు.

అతని బలంముందు తను అబలగా మారిపోతోంది. వంట్లో వణుకు ప్రారంభమైంది. నిస్సహాయస్థితి. అయినా బయటపడాలి. తనను తాను రక్షించుకోవాలి. కోపం, అసహ్యం మనసంతా నిండిపోతోంది. అతను అప్పటికే చొచ్చుకుపోతున్నాడు. అందిన చోటల్లా ముద్దులు ఆత్రంగా కురిపిస్తున్నాడు. చేతులు ఎక్కడెక్కడో తడుముతున్నాయి. తానేమి చేస్తున్నదో తనకే తెలియనంత పిచ్చికోపంలో అతని చేయిని నోటికి దొరకబుచ్చుకుని గట్టిగా కొరికింది.

అతను పెట్టిన గావుకేకతో కొత్తగా కడుతున్న ఆ భవనం దద్దరిల్లిపోయింది.

ఆమె పేరు గంగావతి!

★ ★ ★

బాలభానుడు తప్పటడుగులు వేస్తున్నాడు. మంచు సూర్యుడిరాకను లెక్కచేయకుండా సోనసోనగా కురుస్తూనే వుంది. రాత్రంతా కురిసిన మంచుకు తడిసిన చెట్లు తపస్సు చేసుకుంటున్న మునుల్లా వున్నాయి. రంగులే రాగాలుగా గానాలాపన చేస్తున్నాయి రకరకాల పూలు. ఉద్యానవనాలు అప్పుడప్పుడే నిద్రనుండి బయటపడుతున్నట్లున్నాయి.

నియాన్‌లైట్ల వెలుగులో బంగారు గోపురం ధగద్ధగాయమానంగా వెలిగిపోతోంది. పిల్లతెమ్మెరలు వైకుంఠపుర వైభవాన్ని చూసి మైమరచి వీధులెంబడి నృత్యాన్ని చేస్తున్నాయి.

"కమలాకుచ చూచుక కుంకుమతో నియ తారుణి తాతుల నీలతనో" శ్రీనివాసుడి సుప్రభాతం మైక్‌లలో శ్రావ్యంగా వినబడు తోంది.

బృందావనాలకు నెలవు, ఆపద మొక్కుల వాడి కొలువులో సుప్రభాతం వినడం ఓ గొప్ప అనుభూతి.

గుడిగంటల శబ్దంతో గిరులు పులకింత లుపోతున్నాయి.

ఇప్పుడు క్యూలోకి వెళితే రాత్రికైనా దర్శనం అవుతుందో లేదోననుకుంటూ సత్రా ల్లోంచి, అద్దెగదుల్లోంచి యాత్రీకులు బయ టపడుతున్నారు.

చలికి వణికిపోతూ వైకుంఠద్వారంవైపు పరుగులు తీస్తున్నారు. కాకా హోటల్లో ఇడ్లీ పాత్రలు పొగలు కక్కుతున్నాయి. సర్వర్లు కేకలేసి యాత్రీకుల్ని పిలుస్తున్నారు. టీ కొట్లన్నీ బిజీగా వున్నాయి. సుప్రభాతం ముగిసింది.

మామూలుగా అయితే సుప్రభాతం ముగుస్తూనే స్తోత్రాలు కానీ మంగళవాయి ద్యాలు కానీ, పూజ మంత్రాలు కానీ వేస్తారు. లేదంటే 'భక్తులకు విజ్ఞప్తి. ఇది పుణ్యక్షేత్రం. ఇది విహారయాత్రా స్థలం కాదు. ఇక్కడ మాంసం భుజింపరాదు. మద్యం సేవించరాదు, ధూమపానం చేయ రాదు' అంటూ సూచనలను వినిపిస్తారు. కానీ ఆరోజు ఆనవాయితీ తప్పింది.

ఎన్నో ఏళ్ళుగా ఒక క్రమపద్ధతికి అలవా టుపడిన స్థానికులందరూ ఆ పరిణామానికి విస్తుపోయారు.

ఇదేమిటా అని ఆశ్చర్యపోయిందేమో గాలి కూడా స్థంభించింది.

"అంతా కలికాలం. కాకపోతే వెంకటేశ్వ రుడి సన్నిధిలో కూడా ఇలాంటి సంఘట నలా? " ఒకతను అంటున్నాడు.

"ఏం జరిగింది? " మరొక యాత్రీకుడు ప్రశ్నించాడు ఆసక్తిగా.

"మైక్‌లో అనౌన్స్ చేస్తున్నారు. వినపడ్డం లేదా? " విసుక్కున్నాడు మొదటి వ్యక్తి.

అనౌన్స్‌మెంట్ వినేందుకు ప్రయత్నించాడు రెండోవ్యక్తి.

"యాత్రీకులకు విజ్ఞప్తి. కొన్ని కారణాలవ లన పారిశుధ్య కార్మికులు సమ్మె చేస్తు న్నారు. భక్తులకు కలుగు అసౌకర్యానికి చింతిస్తున్నాం. ఈ అసౌకర్యాన్ని తొలగించ డానికి సహకరించాల్సిందిగా కోరుతున్నాం. ఎక్కడపడితే అక్కడ చెత్తాచెదారం వేయ కుండా, స్వచ్ఛందంగా చెత్తను తొలగించి అధికారులకు సహకరించాల్సిందిగా మనవి చేస్తున్నాం" అని ఆ మాటల సారాంశం.

"విద్యుత్ సమ్మె చూశాం, పోస్టల్ సమ్మె చూశాం, బ్యాంకుల్లో సమ్మెలు చూశాం. ఈ సమ్మెపోటు చివరకు వైకుంఠవాసునికి కూడా తప్పలేదన్నమాట" అది సానుభూతో, బాధో, జాలో అర్థంకాకుండా అని ముందుకు పోయాడొకతను.

అన్ని భాషల్లోనూ అదే అనౌన్స్‌మెంట్‌ను వినిపిస్తున్నారు. అప్పటికే అధికారుల్లో హడావుడి మొదలైంది.

అంత ఉదయాన్నే జాయింట్ ఎగ్జిక్యూ టివ్ ఆఫీసర్ ఇంట్లో ఫోన్ చాలా బిజీగా వుంది.

"హలో... పి.ఆర్.ఓ గారా? నేను జె.ఇ. వోని మాట్లాడుతున్నాను. ఇ.వో.గారు, ఛైర్మెన్‌గారు కూడా వస్తున్నారు మన కార్య క్రమంలో పాల్గొనడానికి. వెంటనే ప్రెస్‌ని పిలిపించండి. మన మినీబస్‌ను వాళ్ళకోసం పంపించండి. అన్ని పత్రికల విలేకరులనూ, ఫొటోగ్రాఫర్లను తీసుకురండి. అలాగే టీవీ ఛానల్స్ వాళ్ళను కూడా" అంటూ ఆదేశాలు జారీచేశారు.

"సార్... అన్ని పత్రికలకూ కొండమీదే విలేకరులున్నారు కదా సార్" అన్నాడు కొంత భయపడుతూనే పి.ఆర్.ఓ. నాయక్.

"మాకు తెల్సు లేవయ్యా... టౌన్‌నుండైతే ఎడిషన్స్ సెంటర్ కాబట్టి బాగా రాసే స్టాఫ్

రిపోర్టర్‌లు వస్తారు" అన్నాడు జె.ఇ.వో.

"అలాగే సార్... ఇంతకీ ఎన్ని గంటలకు అక్కడుండాలి సర్?"

"తొమ్మిది గంటలకంతా ఇక్కడుండాలి. ఆ లోపు ఇక్కడున్న విలేకరులను కూడా పిలిపించే ఏర్పాటు చేస్తాం"

ఫోన్ కట్‌కావడం ఆలస్యం ఒక్కొక్క పత్రిక ఆఫీసుకు ఫోన్ చేయడం ప్రారంభించాడు పి.ఆర్.ఓ.

అంత ఉదయాన్నే ఏ పత్రిక ఆఫీసూ తెరిచివుండదన్న విషయం గుర్తుకువచ్చి నాలుక కరుచుకుని అటెండర్‌ని పిలిచాడు. విలేకరుల ఇంటి అడ్రస్‌లు చెప్పి ఎనిమిదికంతా స్టేట్ ఇన్‌ఫర్మేషన్ సెంటర్ దగ్గర వెహికల్ వుంటుంది. అక్కడికి వచ్చేయమని చెప్పు అని చెప్పి పంపించాడు. పర్సనల్ ఫోన్ వున్నవారికి తనే స్వయంగా ఫోన్ చేసి విషయం చెప్పాడు.



ప్రెస్ వెహికల్ వైకుంఠం క్యూకాంప్లెక్స్ ముందు వచ్చి ఆగింది. చెప్పుల్ని వ్యాన్‌లోనే వదలి ఒక్కొక్కరే దిగసాగారు.

పి.ఆర్.ఓ నాయక్ పరుగెత్తుకుంటూ వచ్చి అందర్నీ పలకరిస్తూ రిసీవ్ చేసుకున్నాడు.

"అందరం స్నాక్స్ తిని, టీ తాగి లోనికి వెళ్దాం. అటు పదండి" అన్నాడు నాయక్.

అందరూ బ్యాంక్‌వైపు కదిలారు.

"సార్... టైమై పోతోంది సార్... ఇ.వో గారు వచ్చి అరగంటయ్యింది. వీళ్ళకోసమే వెయిట్‌చేస్తువున్నారు. ఇప్పుడు బిస్కట్లకనీ, టీలకని లేట్‌చేస్తే అరుస్తారేమో సార్" అన్నాడు ఓ సూపరింటెండెంట్ నెమ్మదిగా.

"ఆ విషయం నాకూ తెలుసు. అయితే వాళ్ళు వార్తలు బాగా రాయాలంటే వాళ్ళను మనం కొంచెం బాగా గమనించుకోవాలి. వాళ్ళ మర్యాదకు ఏలోటూ రాకుండా చూసుకోవాలి. అనుభవంమీద నీక్కూడా తెలుస్తుందిలే" అంటూ సూపరింటెండెంట్ చెవిలో చెప్పాడు పి.ఆర్.ఓ.

"సార్...సార్... ఆ సార్ టీ తాగకుండానే వెళ్ళిపోతున్నాడు సార్" అన్నాడు సూపరింటెండెంట్.

పి.ఆర్.ఓ తలతిప్పి చూశాడు.

ఒక వ్యక్తి వేగంగా క్యూ కాంప్లెక్స్‌లోకి దూసుకుపోతున్నాడు. పక్కకు దువ్విన వెంట్రుకలు, అద్దాల వెనుక నుండి చురుగ్గా కనిపించేకళ్ళు. ఎప్పుడో తప్ప నవ్వనట్లుగా సీరియస్‌గా వుండే పెదాలు, పొడవాటి కంఠం. అంగుళం తక్కువ ఆరడుగుల పొడవుతో సన్నగా వుండే ఆ వ్యక్తిని చూడగానే పి.ఆర్.ఓ కంగారుపడిపోయాడు.

పరుగెత్తుకుంటూ నాలుగడుగులు ముందుకువేసి "మురళీ... మురళీ.. టీ తాగి పోదాం రా" అంటూ కేకేసి పిలిచాడు.

అప్పటికే లోపలికి వెళ్ళే గేటు దగ్గరికి చేరుకున్న మురళీ వద్దన్నట్లుగా చేయి వూపుతూ లోపలికి వెళ్ళిపోయాడు. "ఈ మురళితో వచ్చిన తలనొప్పే ఇంత" అన్నాడు పి.ఆర్.ఓ. తలపట్టుకుంటూ.

"ఏ పత్రికా విలేకరి సార్ అతను?" ఆసక్తిగా అడిగాడు సూపరింటెండెంట్ అతని పక్కగా వస్తూ.

"అతను "ఈ రోజు" రిపోర్టరయ్యా బాబూ. వచ్చి ఆరు నెలలు కూడా కాలేదు. అతను తెలియని జిల్లా రాజకీయనాయకుడు లేడు. అధికారీ లేడు. చూసేందుకు చిన్నవాడిలా కనిపిస్తున్నా మంచి టాలెంట్ వుందిలే. అతనడిగే ప్రశ్నలకు ఎవరైనా తెల్లగుడ్లేయాల్సిందే. ఒక ప్రెస్‌మీట్‌ని అన్ని పత్రికలవాళ్ళూ ఒకరకంగా రాస్తే, మురళీ మాత్రం మరో కోణంలో నుండి రాస్తాడు. ఇ.వో. మనకు మొదటి మొగుడైతే, ఇతను రెండో మొగుడయ్యాబాబూ. ఆ మురళి లోపలికి వెళ్ళి ఏం కొంపలు ముంచుతాడో ఏమో, నువ్వు వీళ్ళతోనే వుండి, టీలు తాగనిచ్చి తీసుకురా, నేను లోపలికి వెళతాను" అంటూ క్యూ కాంప్లెక్స్‌వైపు పరుగులు తీశాడు పి.ఆర్.ఓ. మురళీ లోపలికి అడుగుపెట్టేసరికి లెట్రిన్‌లన్నీ కంపుకొడుతున్నాయి. యాత్రీకులు దర్శనానికై వేచి వుండే గదులు చెత్తా చెదారంతో నిండిపోయి వున్నాయి. మూడు గదుల్లో జనం వున్నారు. నాలుగో గదిలోకి జనాన్ని అప్పుడే వదలడం ప్రారంభించారు. ఆ నాలుగు గదుల్లోనూ టీ.వీలు పనిచేస్తూ వున్నాయి. అధికారులంతా పొరకలు చేతబట్టి హడావుడిగా పరుగులు తీస్తున్నారు. వాళ్ళ హడావుడికి కారణం కార్యనిర్వహణాధికారి రాఘయోగి, ఛైర్మన్ సత్యనారాయణలు అక్కడ వుండడమే.

రిపోర్టర్లు, ఫోటోగ్రాఫర్లు వచ్చారని తెలియగానే రాజకీయాల్లో రాటుదేలి ఛైర్మెన్‌గా వచ్చిన సత్యనారాయణ గబుక్కున తన సీటునుండి లేచి ఎదురుగా నిలుచుని వున్న ఆఫీసర్ చేతిలోని చీపురులాక్కుని దొడ్లలోని చెత్తను వూడ్వడం మొదలుపెట్టారు. ఆయన వెంటే ఇ.వో. రామయోగి కూడా ఓ చీపురుకట్ట అందుకున్నారు. వెంటనే యావత్ అధికారగణం తమ చేతుల్లోని చీపుర్లకు, తట్టలకు పని పెట్టారు.

ఆ దృశ్యం మొత్తం మురళీ కంటపడనేపడింది.

అది కొత్త విషయం, వింతైన విషయం కాకపోవడంతో అతను ఆశ్చర్యపోలేదు. చిన్నగా నవ్వుకున్నాడు. అంతలోనే ఆ పరిస్థితికిగల కారణం గుర్తొచ్చింది. అతని కళ్ళ ముందు వందలాదిమంది కార్మికులు వీధుల్లో ఉన్న దృశ్యం కనబడుతోంది.

జీతం రాక, కూలీ పనులకు వెళ్ళి కుటుంబాన్ని నడిపించడానికి ప్రయత్నించి, విఫలమవుతున్న కార్మికులు గుర్తుకొచ్చారు.

వారి కళ్లలో నెలకొని వుండే నిరాశ, నిస్పృహ, నిస్సహాయతలు కనిపించాయి. వారి వాడిపోయిన మొహాలపై కన్నీటి చారికలు కనిపించాయి.

మనసంతా ఆవేదనతోనూ, ఆవేశంతోనూ నిండిపోతుండగా నేరుగా ఛైర్మన్ దగ్గరికి దూసుకుపోయాడు. అప్పటికే మురళి చేతిలోకి పాకెట్ సైజ్ నోటుబుక్, పెన్ వచ్చేశాయి. తనకు నచ్చినా, నచ్చకపోయినా, ఎంత ఆవేశం వున్నా జర్నలిస్టుగా వాటినన్నిటినీ ఎదుటివారిముందు వ్యక్తపరచకూడదు. తనలోని ఆవేశాన్ని బలవంతంగా నిగ్రహించుకుంటూ ఛైర్మన్‌ను సమీపించాడు మురళి.

"నమస్తే సార్" అన్నాడు మురళి.

ఓవైపు బిజీగా వూడుస్తున్నట్లు నటిస్తూనే "నమస్తే" అన్నాడు ఛైర్మన్.

"ఇదంతా ఏమిటి సార్?" అన్నాడు మురళి ఆవేదనగా.

"చూస్తున్నావుగా. శ్రమదానం రా... నువ్వు కూడా ఓ చేయి వెయ్యి" అన్నాడు ఛైర్మన్ మామూలుగానే.

"ఈ నిర్ణయం ఎందుకు తీసుకోవలసి వచ్చిందో చెబుతారా సార్?" వినయంగానే అడిగాడు మురళి.

ఛైర్మెన్ చేస్తున్న పనిని ఒక్క నిమిషం ఆపి, తలపైకెత్తి "కార్మికులు చెప్పాపెట్టకుండా సమ్మెలోకి దిగితే ఇంకేం చేయాలి" అని విసుగ్గా సమాధానం చెప్పి, తను

బిజీగా కనపడాలని నాలుగుమెట్లెక్కి వూడ్వ సాగారు. ఆస్థాన ఫోటోగ్రాఫర్ తన కెమేరాలో వర్కింగ్ స్టిల్స్‌ని ఇరికించేందుకు ఆపసోపాలు పడుతున్నాడు. ఫోటోగ్రాఫర్ అడ్డురావడంతో పక్కకు తొలిగి మళ్ళీ ఛైర్మన్ దగ్గరికి వెళ్ళాడు మురళి.

"చెప్పాపెట్టకుండా అంటున్నారేమిటి సార్? వాళ్ళు నెలరోజులకుపైగా పారిశుధ్య విభాగాన్ని ప్రైవేటువారికిస్తే తమకు అన్యాయం జరుగుతుందని చెబుతూనే వున్నారు. ప్రైవేటు వారికివ్వరాదంటూ ధర్నాలు చేస్తూనే వున్నారు కదా సార్?" అన్నాడు.

ఏం చెప్పాలో తెలియక బిక్కమొఖం వేశాడు ఛైర్మన్. అంతలో పి.ఆర్.ఓ. నాయక్ వచ్చి అడ్డుపడిపోయాడు.

"అదే మురళీ... ధర్నాలు చేస్తే ఫరవా లేదు కానీ, సమ్మె చేస్తామని చెప్పలేదు కదా?" అన్నాడు.

కార్మికులు ఎప్పుడైనా సరే తమ సమస్యల పరిష్కారానికై వున్న అన్నిరకాల ప్రయత్నాలు చేసిన తరువాత, చిట్టచివరి ప్రయత్నంగా మాత్రమే తమవిధులను బహిష్కరించి సమ్మెకు పూనుకుంటారు.

పారిశుధ్య కార్మికులు లెక్కలేనన్నిసార్లు నోటీసులు ఇచ్చారు. పలుమార్లు ఉన్నతాధికారులతో చర్చలు జరిపారు. ఒక్క నెలలోనే పదిసార్లు ధర్నాలు చేశారు. ఒకసారి అర్ధనగ్న ప్రదర్శన చేశారు. ఎంతకీ అధికారుల మొండివైఖరిలో మార్పులేకపోవడంతో విధిలేక చివరి అస్త్రంగా సమ్మె మొదలుపెట్టారు.

ఏదో ఒక కుంటిసాకు చెప్పాలనే తప్ప, ఛైర్మెన్ దగ్గర సరైన సమాధానం లేదని అతనికి అర్థమయ్యింది. ఛైర్మెన్ నెమ్మదిగా పక్కదొడ్లోకి జారుకున్నాడు.

ఆయనకు మురళి సంగతి నెలక్రితం బోర్డు మీటింగ్ తరువాత జరిగిన విలేకరుల సమావేశంలో తెలిసింది. దాంతో ఆయన జాగ్రత్తపడ్డాడు.

మిగతా విలేకరులంతా అప్పుడు లోనికి వచ్చారు.

సాక్షాత్తూ ఛైర్మెనే చెత్త వూడుస్తుండడం చూసి వచ్చిన వాళ్ళంతా తీవ్ర ఆశ్చర్యానికి లోనయ్యారు. 'ఎంత అద్భుతమైన దృశ్యం. రేపు ఫ్రంట్ పేజీలో వెయ్యొచ్చు' అనుకుంటూ ఫోటోగ్రాఫర్లు తమ కెమేరాలను క్లిక్... క్లిక్ మనిపించసాగారు.

వీడియోగ్రాఫర్లు క్లోజప్‌లో ఛైర్మెన్ మొహంలో సేవానిరతిని, నిస్వార్థతను చాటేందుకు వీలుగా లెన్స్‌ను అడ్జస్టు చేసుకోసాగారు. తమకు కోరినన్ని లడ్డూలిచ్చే అధికారుల చేతుల్లో పొరకలుండడం చూసి కొంతమంది రిపోర్టర్లు తెగ బాధపడిపోయారు. ఆ పరిస్థితికి కారణమైన కార్మికులపై ద్వేషంతో రగిలిపోయారు. కార్మికులు చేసిన పని ఎంతటి ఘోరాతిఘోరమైందో వివరిస్తూ రాసేందుకు కావలసిన పాయింట్లన్నీ నోట్ చేసుకోసాగారు.

ఛైర్మెన్ తప్పించుకుని దూరంగా వెళ్ళిపోవడంతో ఇ.వో. రామయోగివైపు నడిచాడు మురళి.

"నమస్తే సార్"

"నమస్తే మురళీ"

"సమ్మెకు పరిష్కారం శ్రమదానం చెయ్యడమేనా సార్?" అడిగాడు కోపాన్ని నిగ్రహించుకుంటూ.

"లేకపోతే వాళ్ళు మమ్మల్నే బెదిరించాలనుకుంటారా?" అన్నాడు ఇ.వో. కసి తీర్చుకున్నవాడిలా.

"తిరుమలలో రోజుకు నాలుగున్నర టన్నుల చెత్తాచెదారం తొలగించాల్సి వుంటుంది. మరి ఆ చెత్తనంతా మీరే తొలగిస్తారా?"

రోజుకు తిరుమలలో ఎంత చెత్త తొలగిస్తున్నారో తను ఇ.వో.గా వుండి ఎప్పుడూ పట్టించుకోలేదు. మురళీ చెప్పడంతో అతని మీద మంచి అభిప్రాయం ఏర్పడింది. లెక్కలు చెబుతున్నాడంటే ఘటికుడే. ఇలాం

టివాళ్లతో జాగ్రత్తగా వుండాలనుకున్నాడు ఇ.వో.

ఎవరితో మాట్లాడినా, ఏ సబ్జెక్టు గురించి ప్రశ్నించినా అంకెలతోసహా స్పష్టంగా చెప్పడం మురళీ స్పెషాలిటీ. అధికారులు, రాజకీయనాయకులు అతని సూటి ప్రశ్నలకు ఇబ్బందిపడ్డా, ఆ తరువాత అతనంటే గౌరవం ఏర్పడుతుంది. అందువల్లనే మురళితో పరిచయం ఒక్కరోజే అయినా సరే సాధారణంగా ఎవరూ మరచిపోవడం అంటూ జరగదు.

"దేవస్థానంలో మొత్తం పదహారువేల మంది ఉద్యోగులు పనిచేస్తూ వున్నారు. వాళ్ళలో ఈ ఏడువందల యాభైరెండు మంది పనిచేయనంత మాత్రాన మిగతా వారు వూరికే వుంటారా? అందులోనూ శ్రీవారికి సేవచేసే అవకాశం రావడం ఎంత భాగ్యం. అందరూ శ్రమదానం చేసి చెత్తనంతా తొలగిస్తాం. శ్రమదానంలో పాల్గొనాలని మా ఎంప్లాయీస్ అందరికీ పిలుపునిచ్చాం కూడా" అన్నాడు ఇ.వో. తామెప్పుడూ పెర్‌ఫెక్టే అన్నట్లు.

"ఉన్నతస్థాయి ఉద్యోగులు వాళ్లస్థాయిలో వున్న విలువైన పనులను వదులుకొని వచ్చి ఈ పనిచేయడం ఎంతవరకు సబబు సార్? "

"తప్పేముంది. సాక్షాత్తూ ముఖ్యమంత్రి గారే జన్మభూముల్లో గోడలకు సున్నం వేయడం, శ్రమదానంలో మట్టి తవ్వడం, క్లీన్ అండ్ గ్రీన్‌లో చెత్త వూడ్వడం చేస్తుంటే ఉద్యోగులు శ్రమదానం చేయడంలో తప్పేముంది? " అంటూ సమర్థించుకున్నాడు ఇ.వో.

అప్పటికే చాలామంది ఉద్యోగులు శ్రమదానానికి వూనుకొని వుండడంతో దొడ్లన్నీ శుభ్రమైపోయాయి.

సర్వదర్శనాన్ని పదినిమిషాలు నిలుపుదల చేశారు.

యాత్రీకులు గట్టిగట్టిగా మాట్లాడుకుంటున్నారు. ఆ మాటల్లో రకరకాల భాషలు వినబడుతున్నాయి.

క్యూ ఖాళీ అయింది.

ఉద్యోగులందరూ క్యూ గుండా గుడిలోకి ప్రవేశించారు.

ప్రెస్ రిపోర్టర్లందరూ ఛైర్మన్, ఇ.వో.ల పక్కనే నడుస్తూ రకరకాల ప్రశ్నలు వేస్తూ ముందుకు సాగుతున్నారు. ఛైర్మన్, ఇ.వో.లు ఇద్దరూ కూడా వాళ్ళడిగే ప్రశ్నలకు ఉత్సాహంగా సమాధానాలు చెబుతున్నారు. ముఖద్వారంవద్ద సన్నగా వస్తున్న నీళ్లలో కాళ్లు కడుక్కుని లోనికి ప్రవేశించాడు మురళి.

లోపలికి అడుగుపెడుతూనే తిరుమల లడ్డు వాసన, కర్పూరపు వాసనతో కలిసి గుప్పుమని కొట్టింది.

కిందంతా తేమతేమగా వుంది. బండలపై నల్లగా మురికి కనబడుతోంది. ప్రతిరోజూ యాభైవేలనుండి లక్షమందిదాకా శ్రీవారి దర్శనాన్ని చేసుకుంటూ వుంటారు. దాంతో ఒక్కపూట శుభ్రపరచకపోయేసరికి బండలన్నీ మురికిమయమైపోయాయి.

శ్రీవారి కళ్యాణమండపంవైపుకు వెళ్ళాడు. అక్కడా అదే పరిస్థితి. వెండి వాకిలిగుండా లోనికి ప్రవేశించాడు.

పూజారులందరూ కలిసి శుభ్రపరచినట్లున్నారు. అక్కడ మాత్రం కొంత శుభ్రంగా వుంది.

శ్రీవారి గర్భగుడినుండి ఓం నమో నారాయణాయ. ఓం నమో నారాయణాయ అంటూ అష్టాక్షరీ మంత్రం మంద్రస్థాయిలో వినబడుతోంది. ఇ.వో., ఛైర్మెన్‌లు బంగారు వాకిలి గుండా లోనికి వెళ్ళకుండా వెనుదిరిగారు. ఇంతదూరం వచ్చి శ్రీవారిని దర్శించుకోకుండా వెళ్ళడమా అనుకుని రిపోర్టర్లు, ఫోటోగ్రాఫర్లు, వీడియో గ్రాఫర్లు అందరూ గర్భగుడిలోకి దూసుకుపోయారు.

మురళి మాత్రం ఇ.వో. ఛైర్మన్‌ల వెనుకే నడిచాడు.

హుండీ సమీపంలో, కొడిస్థంభం దగ్గర చెత్త బాగా పేరుకొని వుంది. అక్కడినుండి కొంచెం ముందుకు కదిలారు. కుళ్ళిన వాసన గుప్పుమని కొట్టింది.

ఉచితంగా పులిహోరా, పెరుగన్నం వంటి ప్రసాదాలు ఇచ్చే క్యూ దారుణంగా తయారయ్యింది. కాలుపెడితే జారిపోయేటట్లుంది. పక్కన పోతున్న సన్నని కాలువ దుర్గంధాన్ని వెదజల్లుతోంది.

కమ్ములు పట్టుకుని క్యూలో నడిచాడు మురళి.

ప్రసాదాలు పెట్టి ఇచ్చిన విస్తరాకు చిప్పలు వేయడానికి వుంచిన కుప్పతొట్టెలు నిండిపోవటంతో ఆ ప్రాంతమంతా అవే కనిపిస్తున్నాయి. అక్కడ వస్తున్న కుళ్ళు వాసనకు తట్టుకోలేక రుమాలు తీసి ముక్కుకు అడ్డంగా పెట్టుకున్నాడు.

రాత్రి పన్నెండు గంటలనుండి కార్మికులు సమ్మె చేస్తే ఉదయం పదిగంటలకంతా ఇంత కుళ్ళు వాసన వస్తుందా అని ఆశ్చర్యపోయాడు మురళి. అక్కడనుండి తిరిగి ముఖద్వారంవైపు వచ్చాడు.

ప్రెస్‌వాళ్ళు లేరని కాబోలు పనిమానేసి కుర్చీలో కూర్చుని ఆయాసం తీర్చుకుంటున్నాడు ఛైర్మన్.

మురళిని చూస్తూనే తన మొహంలోకి లేని గాంభీర్యతను తెచ్చిపెట్టుకునే ప్రయత్నం చేశాడు.

ఛైర్మన్ దగ్గరగా వెళ్ళి "సమస్యను పరిష్కరించకుండా శ్రమదానానికి దిగారు. వాళ్ళు సమస్య తీరేవరకు సమ్మె నిలపబోమని భీష్మించుకుంటే మీరేం చేస్తారు? ఇలా శ్రమదానాలు ఎన్ని రోజులు చేస్తారు?" అన్నాడు మురళి.

వీడెక్కడ దాపురించాడండీ బాబూ నా పాలిట శనిలాగా అనుకుంటూ "వాళ్ళకేనా పట్టుదల వుండేది. మాకు లేదా? అది ఎన్నిరోజులైనా సరే శ్రమదానం చేసేందుకు వెనుకాడబోము" అన్నాడు ఛైర్మన్ ప్రజల కోసం ప్రాణాలర్పిస్తామనే రాజకీయ నాయకుల్లాగా.

"చుట్టుపక్కల ప్రాంతాలనుండి కూలీలను పిలుచుకు రావడానికి జీపులు పంపించాము. ఇంకాస్సేపట్లో వాళ్ళు వస్తారు. అలాగే స్వచ్ఛంద సంస్థలకు కూడా పిలుపునిచ్చాం. వాళ్ళ స్పందనను బట్టి నిర్ణయం తీసుకుంటాం" అని వివరణ ఇచ్చాడు ఛైర్మన్.

"అంతే తప్ప సమస్యలను పరిష్కరించి సమ్మెను విరమింపజేసేందుకు ప్రయత్నించరన్నమాట" అన్నాడు మురళి కొంత వ్యంగ్యంగానే.

పరకామణిలో చిల్లరలెక్కించే దృశ్యాల్ని టీ.వీ.లో చూస్తూవున్న ఇ.వో అప్పుడే అక్కడికి వచ్చాడు. మురళి మాటల్ని విన్నాడు.

"శానిటరీ విభాగంలో పనిచేస్తున్న లేబరర్స్ పనితీరు బాగుండడంలేదని ప్రతి గెస్ట్ హౌస్‌వాళ్ళూ రిపోర్ట్ చేస్తున్నారు. పోనీలే చాలా ఏళ్ళుగా పనిచేస్తున్నారు. వాళ్ళను తీసేస్తే ఏం బావుంటుంది అని వదిలేస్తే ఇప్పుడు ఏకంగా సమ్మెలోకి దిగుతారా? ఇలాంటి పనిచేయనివారిని పెట్టుకుని భక్తులకు ఇబ్బందిని కలిగించలేంకదా?" అన్నాడు ఇ.వో. 'శభాష్... సరిగ్గా చెప్పావు' అన్నట్లుగా ఇ.వోవైపు చూశాడు ఛైర్మన్. ఇ.వో చెప్పింది నూటికి నూరుశాతం నిజమే. అందులో సందేహంలేదు. ప్రతి శానిటరీ విభాగం కార్మికుడిపైనా సరిగా పనిచేయడం లేదన్న రిపోర్ట్‌లు వున్నాయి. ఆ రిపోర్ట్‌ల ఆధారంగా కార్మికుల్ని సస్పెండ్ చేయడం అధికారులకు చిటికెలోపని!

ఇది తెలిసిన ప్రతిఒక్కరూ కార్మికులు ఎంత నిర్లక్ష్యంగా పనిచేస్తున్నా అధికారులు తమ ఉదార స్వభావంతో ఇన్నాళ్ళూ పెట్టుకుని వేగుతున్నారనుకుంటారు. ఇప్పుడు కార్మికులు సమ్మె చేయడం దారుణమన్న నిర్ణయానికి వస్తారు. ఇంచుమించు విలేకరులందరూ అదే భావనలో ఉన్నారు.

అయితే అక్కడున్న మురళి వార్తల్ని సేక రించే బాధ్యతను తీసుకున్న నాటినుండీ దేవస్థానంలో ప్రతి విభాగాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అన్ని శాఖల్లో ఉన్నతాధి కారులనుండి కిందిస్థాయి అటెండర్‌వరకు రకరకాల వ్యక్తులతో పరిచయాలు పెంచుకు న్నాడు.

ఏ విభాగంలో ఏం జరుగుతోందో ఇ.వో చెప్పలేకపోవచ్చుగానీ, ఏ ఫైళ్ళూ లేకుండా టకటకా చెప్పగలడు మురళి.

"మీరు చెప్పింది నిజమే సార్. కార్మికులు సరిగా పనిచేయడంలేదు. అయితే ఇప్పు డున్న శానిటరీ లేబరర్స్ ఎప్పుడో పదిహేడే ళ్లక్రితం నియమించబడినవాళ్ళు. అప్పుడు కేవలం నాలుగో, అయిదో గెస్ట్‌హౌస్‌లు మాత్రం వుండేవి. ఆరోజునుండి ఈరోజువ రకూ మీరు ఒక్క కార్మికుని కూడా కొత్తగా శానిటరీ విభాగంలోకి రిక్రూట్ చేసుకోలేదు. ఈ పదిహేడేళ్లలో రిటైరయిపోయినవాళ్ళూ, చనిపోయినవాళ్ళు పోనూ మిగతావాళ్ళు మాత్రమే ఇప్పుడు పనిచేస్తున్నారు. కానీ నాడు నాలుగైదున్న గెస్ట్‌హౌస్‌ల సంఖ్య నేటికి నాలుగు డజన్లు దాటింది. ఆ నాలు గైదు గెస్ట్‌హౌస్‌లను శుభ్రపరుస్తూ వున్న సిబ్బందిచేతే ఇప్పుడున్న ఇన్ని గెస్ట్‌హౌస్ లను శుభ్రం చేయించాలని చూస్తే ఆ పని ఎంత బాగుంటుందో నేను చెప్పనవసరం లేదు సార్" అన్నాడు మురళి చివరి వాక్యాన్ని ఒత్తి పలుకుతూ.

ఆ మాటలకు ఛైర్మన్ ఖంగుతిన్నాడు. ఇ.వో గుటకలు మింగాడు.

"అందుకే అసలు సమస్యే లేకుండా క్లీన్ ఇంటర్నేషనల్‌వారికి శానిటరీ విభాగాన్ని అప్పజెప్పేద్దామని నిర్ణయించారు" అన్నాడు పి.ఆర్.ఓ. నాయక్ వెనుకనుంచి.

ఈయనెప్పుడొచ్చాడు అనుకుంటూ వెనుది రిగి చూశాడు మురళి. దర్శనానికి వెళ్ళిన రిపోర్టర్లందరూ ఒక్కొక్కరే వస్తున్నారు. కొందరు ఉచిత ప్రసాదాలను తిని కుళా యిల దగ్గర చేతులు కడుక్కుంటున్నారు.

"అంటే దేవస్థానం తన బాధ్యతలను వది లించుకుని బయటి వ్యక్తులకు కాంట్రాక్టుకు ఇవ్వడానికి సిద్ధపడుతోందన్నమాట" అన్నాడు. మురళి పి.ఆర్.ఓ. చెప్పిన సమా ధానానికి వున్న అర్థాన్ని వివరిస్తూ.

ఇ.వోకు కోపం వచ్చేసింది.

"ఎన్నిసార్లు చెప్పినా అర్థం చేసుకోరేం. క్లీన్ ఇంటర్నేషనల్ అనేది నష్టమూ లేదు, లాభమూ లేదు. 'నోలాస్, నోగెయిన్' అన్న సిద్ధాంతంపై పనిచేసే ఒక స్వచ్ఛంద సంస్థ మాత్రమే. శానిటరీ వర్క్స్‌లో 'క్లీన్ ఇంటర్నే షనల్'ది అందెవేసిన చేయి. వాళ్లకు ఆ పనుల్లో మంచి రికార్డు కూడా వుంది. భక్తు లకు మరిన్ని సేవలు అందించాలనే ఈ ప్రయత్నం చేస్తున్నాం" అన్నాడు ఇ.వో. గట్టిగా.

ఇ.వో. ఆవేశంగా మాట్లాడడంతో చుట్టు పక్కల వున్న అధికారులంతా ఆయనవైపు వింతగా చూశారు. ఇ.వో.ని ఆవేశానికి గురి చేసిన మురళివైపు మరీ వింతగా చూశారు.

ఇ.వో. ఆవేశంగా అన్న మాటలకు దీటుగా మురళీ కూడా ఆవేశంతో మళ్ళీ ప్రశ్నించాడు. "రౌతు మెత్తగా వుంటే గుర్రం మూడు కాళ్లపైన నడుస్తుందట. వాళ్లకు ఎంత మంచి రికార్డయినా వుండనీగాక ఇప్పుడున్న గెస్ట్‌హౌస్‌ల సంఖ్యను అనుస రించి కావలసినంతమంది శానిటరీ కార్మికు లను రిక్రూట్ చేసుకొని వాళ్ళకు తగినంత మంది సూపర్‌వైజర్లను పెట్టి పనిచేయించు కోగలిగితే క్లీన్ ఇంటర్నేషనల్ వాళ్ళను తల దన్నేటట్లు పని జరగదా సార్" అన్నాడు.

అప్పటికే ఛైర్మన్ సత్యనారాయణశర్మ అక్కడినుండి జారుకునేశాడు. "అది నీ అభి ప్రాయం. కానీ బోర్డు క్లీన్ ఇంటర్నేషనల్ వాళ్ళకివ్వడమే మంచిదని అభిప్రాయప డింది" అని చెప్పి ఏదో అర్జెంటు పనిబడి నట్లు హడావుడిగా వెళ్ళిపోయాడు, ఇ.వోతో సహా! ఆయన వెంటే ఇతర అధికారులూ

పరుగులు తీశారు.

మురళికి కోపం వచ్చింది.

అప్పటికే విలేకరులందరూ అక్కడకు చేరుకున్నారు.

ఇ.వో.ని ఇబ్బంది పెట్టడం చూసి ఒక విలేకరి తెగబాధపడిపోయాడు. "మురళీ! ఎన్ని సమస్యలున్నా వుండనీ వెంకటేశ్వరుని దగ్గర సమ్మె చేయడం తప్పు కాదా? వాళ్ళని వెనకేసుకొస్తావేం? " అన్నాడు.

"మీకు తెలిస్తే మాట్లాడండి. లేకుంటే నోరు మూసుకోండి" కఠినంగా జవాబిచ్చాడు మురళి.

ఆ విలేకరి టక్కున నోరు మూసుకున్నాడు.

అధికారులు పనిగట్టుకుని శానిటరీ విభాగాన్ని ప్రవేటుపరం చేస్తున్నారనేది స్పష్టం. అయినా తనేం అనగలడు? ఎంత కోపం వచ్చినా తను ప్రశ్నించగలడు. అంతే? నిలదీసే హక్కు తనకు లేదు. ఒకవేళ నిలదీసినా 'సమాధానం చెప్పడం ఇష్టంలేదు' అంటే మాట్లాడేందుకింకేం ఉండదు.

ఇక అక్కడ వుండబుద్ధికాలేదు మురళికి.

గుడిలోనుండి బయటపడ్డాడు. పి.ఆర్.ఓ.ని వెహికల్ ఎక్కడుందని అడిగి తెలుసుకుని కోనేటి వద్ద నిలుపుకున్న వెహికల్ దగ్గరికి వెళ్ళి తన చెప్పులను వేసుకుని నేరుగా బస్టాండు చేరాడు. బస్సెక్కి తిరుపతికి చేరుకున్నాడు.

ఆఫీసుకు వెళ్ళి పాతపేపర్లన్నీ తిరగేశాడు ఓపిగ్గా.

నోలాస్. నోగెయిన్ అని చెప్పుకుంటూ ఒక సంస్థను నడపడానికి ఎంతో నిస్వార్థం, పట్టుదల, లక్ష్యశుద్ధి, చిత్తశుద్ధి వుండాలి. ఇవన్నీ వుండేవాళ్ళు 'చేయడానికి పనులే లేనట్లు' గుడికి రావాలా? ఆ పనికోసం రికమండేషన్‌లు దేనికి? సంథింగ్ రాంగ్. క్లీన్ ఇంటర్నేషనల్ సంస్థ గురించి గతంలో ఒక వార్త వచ్చింది. ఆ వార్తను వెదికి, ఆ విలేకరి డేట్‌లైన్ ఆధారంగా ఆ వూరికి ఫోన్‌చేశాడు.

అతను చెబుతున్న మాటలు వింటున్నకొద్దీ మురళీ మనసులో వున్న ఒక్కొక్క సందేహం నెమ్మదిగా తొలగిపోసాగింది.

నోలాస్, నోగెయిన్ అనిచెప్పే క్లీన్ ఇంటర్నేషనల్ సంస్థ నెలకు ఒక్కొక్క కార్మికునికి పన్నెండు వందల రూపాయలు చెల్లిస్తున్నట్లు లెక్కలు చూపిస్తున్నా వాస్తవానికి కార్మికులకు చెల్లించేది ఆరువందల రూపాయలు మాత్రమే. అది చట్టవిరుద్ధం. పర్మనెంట్ వర్క్ వున్నచోట పర్మనెంట్ వర్కర్స్‌ను పెట్టుకోవాలని చట్టం చెబుతోంది. దానికి భిన్నంగా వీళ్ళు దినకూలీలను మాత్రమే పెట్టుకుని దొంగలెక్కలు చూపిస్తుంటారు. ఎప్పుడైనా ఎవ్వరైనా తక్కువ ఎందుకిస్తున్నారని అడిగితే వాళ్ళను వెంటనే పనిలోనుండి తీసేస్తారు. దాంతో ఇక అడిగేవారుండరు. ఎవరిదగ్గరపని చేస్తుంటే వారి వాహనాలు, గెస్ట్‌హౌస్‌లు, ఆఫీస్‌లు వంటివన్నీ పైసా ఖర్చులేకుండా ఉపయోగించుకుంటారు. ఇలా చేస్తూ ఒకసారి దొరికిపోయి బ్లాక్‌లిస్ట్‌లోకెక్కింది ఈ సంస్థ. అయితే సంస్థ యాజమాన్యానికి వున్న రాజకీయ పలుకుబడితో ఇప్పటికీ ఎక్కడ కావాలంటే అక్కడ కాంట్రాక్టులు వీరికే వస్తుంటాయి. కాంట్రాక్టులు దక్కించుకోవడానికి అన్నిస్థాయిల్లోనూ రకరకాల ముడుపులూ, కమీషన్‌లు చెల్లిస్తారు.

అటు అధికారులు, ఇటు ఛైర్మన్, పాలకమండలి కూడా శానిటరీ విభాగాన్ని "క్లీన్" వారికి అప్పజెప్పాలని. అందుకే అంత ఆత్రపడడం! దేవస్థానానికి బిడ్డల్లాంటి కార్మికులపైన కత్తిదూయడం వెనుక వున్న ఆంతర్యం ఇప్పుడర్థమయింది అనుకుని వెంటనే తన కలానికి పనికల్పించాడు.

బాధ్యతలనుండి తప్పుకోవడానికి దేవస్థానం చేస్తోన్న ప్రయత్నాలు, క్లీన్ ఇంటర్నేషనల్‌ను దేవస్థానం పాలకమండలి నెత్తికెక్కించుకుని మరీ మాట్లాడుతున్నతీరు,

తాము చేస్తున్న పనిని సమర్థించుకోవడానికి ఇ.వో, ఛైర్మన్‌లు తనకిచ్చిన సమాధానాలు, క్లీన్ ఇంటర్నేషనల్ అసలు స్వరూపం... అన్నిటినీ వివరిస్తూ దీక్షగా రాసుకుపోయాడు.



ఎక్కువమంది దర్శించే యాత్రాస్థలంగా కీర్తిని సంపాదించుకున్న ఇక్కడ నిజానికి సమ్మె చేయడం నిషిద్ధం. అయినా చట్టాన్ని ధిక్కరించి కూడా కార్మికులు సమ్మె చేస్తున్నారంటే అది ఫ్రంట్ పేజీ ఐటమ్ అయినట్లే.

అన్ని పేపర్లూ ఆ వార్తను ఫ్రంట్ పేజీలో ముద్రించాయి. సమ్మె కారణంగా యాత్రీకులు ఏవిధంగా ఇబ్బందులకు గురయ్యారో ఫొటోలతోసహా వివరించే ప్రయత్నం చేశాయి. దీనికి కారణం కార్మికులు మొండివైఖరితో తీసుకున్న నిర్ణయమేనంటూ రాసుకుపోయాయి. ఇ.వో, ఛైర్మన్‌లు తమ తెలివితేటలతో శ్రమదానం కార్యక్రమానికి పిలుపునివ్వడంతో శుభ్రతా, పరిశుభ్రతా కార్యక్రమాలు ఏవిధంగా జరిగాయో వివరంగా రాశాయి.

అన్ని పత్రికలను ముందేసుకుని చూస్తూ వున్న ఛైర్మన్ తెగమురిసిపోతున్నాడు. ముఖ్యంగా చీపురు చేతబట్టి తను శ్రమదానం చేస్తున్న ఫొటో ఫ్రంట్‌పేజీలో రంగుల్లో వుండడంచూసి చాలా ఆనందపడిపోయాడు. రాష్ట్రవ్యాప్తంగా తన పరపతి ఎన్నిరెట్లు పెరుగుతుందా అని లెక్కలు కట్టుకోసాగాడు.

అన్ని పత్రికలూ తిరగేస్తూ చివరగా ఈరోజు పత్రిక చూశాడు. అతని ముఖం ఒక్కసారిగా వెలవెలబోయింది. తన ప్రతిష్ట సర్రున దిగజారిపోయినట్లనిపించింది.

ఆనందం స్థానంలోనే కోపం చోటుచేసుకుంది.

కళ్లల్లో కసి ఎరుపు వర్ణంగా మారింది.

“రేయ్ మురళీ నా మాటలనుండే నన్ను అసమర్థుడుగా అవగాహనా రాహిత్యుడుగా చిత్రీకరిస్తావురా. నా గురించి తక్కువ అంచనా వేశావు. నేను ఏంచేస్తే సమర్థుడననిపించుకుంటానో నాకు తెలుసురా” అనుకుంటూ పళ్ళు పటపటా కొరికి ఫోనందుకున్నాడు.

చకచకా నంబర్‌లు నొక్కాడు.

“హలో... నేను దేవస్థానం ఛైర్మన్‌ని మాట్లాడుతున్నాను. సార్‌కివ్వు” అన్నాడు.

“హలో... నమస్తే సార్. నేను సత్యనారాయణను మాట్లాడుతున్నాను” అంటూ మొదలుపెట్టి మురళి గురించి చెప్పుకుంటూ పోయాడు.

“అంతేనా! ఈ మాత్రానికే నాకు ఫోన్ చేయాలా. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రాలు దేనికి. అతన్నేమీ అనవద్దు. శత్రువుల్ని మిత్రులుగా చేసుకోవాలి. ఆ రిపోర్టర్‌కు ఏదో ఒకటి ఆశ పెట్టండి. ఎంతో కొంత ముట్టజెప్పండి. మనసును, మనిషిని మార్చగలిగేది డబ్బు ఒక్కటే. పనైపోతుంది. డోంట్ వర్రీ. వుంటాను” అంది అవతలి గొంతు ఫోన్ కట్‌చేస్తూ.

ఆ గొంతు ఓ మంత్రిది.

★ ★ ★

ఉదయం పదిగంటలవుతోంది.



వీధులు జనసందోహంతో కిటకిటలాడుతున్నాయి. కరుణించు మా అయ్య ఓ శ్రీనివాసా! అంటూ ఆడియో కేసెట్స్ షాప్ నుండి గట్టిగా వినబడుతోంది.

"ఆపద మొక్కులవాడా! ఈ ఆపదనుండి రక్షించు తండ్రీ" అంటూ మనసులోనే మొక్కుకుంటున్నారు సమ్మెలో వున్న కార్మికులు.

కార్మికులంతా సెంట్రల్ రిసెప్షన్ ఆఫీసు ముందు టెంట్‌వేసి వున్నారు. 'యాజమాన్యపు నిరంకుశ వైఖరి నశించాలి. పారిశుధ్య విభాగాన్ని ప్రైవేటువారికి అప్పగించవద్దు' అని రాసున్న బ్యానర్లు అక్కడ కట్టివున్నాయి.

టెంట్‌లో సుమారు రెండువందలమంది కార్మికులు కూర్చొని వున్నారు. సమ్మె మొదలై ఒకరోజు పూర్తయ్యింది. ఇంతవరకూ యాజమాన్యం వైపునుండి ఎటువంటి స్పందనా రాలేదు. పైగా వేరే కూలీలను పిలిపించి పనులు చేయించడానికి ప్రయత్నిస్తున్నారని తెలిసినప్పటినుండి కార్మికుల్లో ఆందోళన మొదలైంది.

వున్న పనికాస్తా వూడిపోతుందేమోనని భయపడ్డ కొంతమంది సమ్మెను విరమించి పనిలోకి వెళ్ళిపోదామా అని ఆలోచిస్తున్నారు. కార్మికుల్లో భయం ఎక్కువైనకొద్దీ ఐకమత్యం దానంతటదే విడిపోతుందని తెలిసిన నాయకులు ఆందోళన చెందారు. సమ్మెను విరమిస్తే కలిగే లాభం లేకపోగా నష్టమే ఎక్కువ.

"ఎంతో సాహసంతో చట్టాన్ని ధిక్కరించి సమ్మెను ప్రారంభించగలిగాం. కానీ కార్మికులందరినీ ఒకేమాటపై నిలబెట్టడం అసాధ్యమైపోతోంది. ఇప్పుడు కొత్త కూలీలు వచ్చి పని చేయడం ప్రారంభిస్తే మనం సమ్మె చేసినా, చేయనట్లే. కాబట్టి వెంటనే మనం ఏదో ఒకటి చేయాలి. లేదంటే మనం దారు



ఙంగా ఓడిపోతాం" అంటూ కార్మిక నాయకులు తీవ్రంగా చర్చిస్తున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గం చెబుతున్నారు.

పారిశుధ్య పనులు చేయడానికి కొత్తగా వచ్చే కూలీలను పనిలోకి పోకుండా అడ్డుకోవాలని సూచించారు కొందరు.

చాలామందికి నచ్చిందది.

అది అంత మంచిది కాదు అన్నాడు వెంకటరెడ్డి.

అందరూ ఆయనవైపు ఆశ్చర్యంగా చూశారు.

వెంకటరెడ్డి ఓ పార్టీ నాయకుడు. వయసు అరవై పైనుంటుంది. తలవెంట్రుకలన్నీ నెరిసిపోయివున్నాయి. ముఖం గంభీరంగా కనిపించినా కళ్లు మాత్రం మంచి మేధావి అని చెబుతున్నట్లుంటాయి. ఆయన ఒకే నియోజకవర్గం నుండి వరుసగా ఐదు సార్లు ఎం.ఎల్.ఎ.గా ఎన్నికయిన వ్యక్తి. కార్మిక సంఘాలలో చాలా ఏళ్లుగా పనిచేసిన వ్యక్తి. ఏదో పనిమీద ఇటువచ్చి కార్మికులు చేస్తున్న పోరాటానికి మద్దతు తెలపడానికి దేవస్థానం వద్దకు వచ్చాడు. కార్మికులతోపాటు టెంట్‌లో కూర్చుని వారితో చర్చల్లో పాల్గొన్నాడు. కార్మికనాయకుల చర్చ ఎంతసేపూ కొత్త కూలీలను రాకుండా అడ్డుకోవాలనేదాని పైకే పోతుంటే తనే చొరవచేసి వద్దని చెప్పాడు.

"మరయితే ఏం చేద్దామంటారు సార్" అన్నారు కార్మిక నాయకులంతా.

"మీ ఉద్యోగాలు పోతాయని మీరు భయపడుతున్నట్లున్నారు. మీ ఉద్యోగాలకొచ్చిన భయమేమీలేదు. మిమ్మల్నెవరూ తొలగించలేరు. మీవైపు న్యాయం వుంది. అవసరమైతే కోర్టుకు వెళదాం" అన్నాడు వెంకటరెడ్డి.

అంత పెద్ద నాయకుడు చెప్పడంతో వాళ్ళకు ధైర్యం వచ్చింది. అంతలో దేవస్థానం మినీబస్ టెంట్‌కు అంత దూరంలో

వచ్చి ఆగింది.

కార్మికులందరూ తలలుతిప్పి అటువైపే ఆసక్తిగా చూడసాగారు. ఏ అధికారైనా దిగుతాడేమో, చర్చలకు పిలుస్తాడేమోనని అందరూ ఆత్రంగా వున్నారు.

కానీ దిగింది అధికారి కాదు, మురళి. అతన్నక్కడ దింపి మినీబస్సు కదిలింది.

"వీడొకడు. ఎప్పుడు చూసినా కాకి కావ్... కావ్ మన్నట్లు వీడు కార్మికులు, న్యాయం, అన్యాయం... అంటూవుంటాడు. వూరందరిదీ ఒక దోవైతే వులిపికట్టెది ఒక దోవన్నట్లు పోతున్నాడు" బస్సులోని ఒక రిపోర్టర్ కామెంట్ చేశాడు.

మిగతావాళ్ళందరూ పకపకా నవ్వారు.

"పీడా పోయింది" అని గట్టిగానే అని సీటుకు చేరగిలబడ్డాడు పి.ఆర్.ఓ. తన తోటి రిపోర్టర్ హేళనగా అన్న ఆ మాటలూ పి.ఆర్.ఓ. అన్న మాటలూ మురళి చెవిలో పడనేపడ్డాయి.

అయితే అతను ఆవేశపడలేదు. వీళ్ళు ఎప్పటికి ఎదుగుతారోననుకుంటూ టెంట్ వైపు నడిచాడు.

నిన్న అధికారుల శ్రమదాన కార్యక్రమాన్ని చూసుకుని వెళ్ళిన తరువాత గుర్తుకొచ్చింది, ఆ తొందరలో కార్మికులేమనేదీ తెలుసుకోలేదన్న సంగతి.

తనంటే ఆవేశంలో మరచిపోయాడు. మిగతా రిపోర్టర్లు కావాలనే ఇచ్చివుండరు. చివరకు టీ.వీ. ఛానళ్ళలో కూడా కార్మికుల వెర్షన్ చూపలేదు.

ఒకవైపునుండి మాత్రమే వార్తలు ఇవ్వడం రిపోర్టింగ్‌కే విరుద్ధం. ఆ వార్త అసంబద్ధంగా వుండి పాఠకులను తప్పుదోవ పట్టించే విధంగా ఉంటుంది. రిపోర్టర్‌కు ఇష్టమున్నా లేకున్నా ఇరువైపులవారి వాదనలను తన రిపోర్ట్‌లో పొందుపరచాలి. అప్పుడే అది నిజమైన వార్త అవుతుంది. అధికారులు చేసే కార్యక్రమాలకు వెళ్ళకపోయినా పి.ఆర్.ఓ. అన్ని విషయాలనూ వివరంగా రాసి ప్రెస్‌నోట్ పంపుతాడు.

ఒకవేళ పంపకపోయినా ఫోన్‌చేసి కనుక్కోవచ్చు కాబట్టి నో ప్రాబ్లమ్. అనుకుని కార్మికుల టెంట్ దగ్గరే దిగేశాడు మురళి.

"నమస్తే అండీ... నా పేరు మురళి. ఈరోజు విలేకరిని" అన్నాడు తననుతాను పరిచయం చేసుకుంటూ.

రిపోర్టర్ అని తెలియగానే అక్కడున్న వారి ముఖాల్లో మార్పులు వచ్చాయి. "రేయ్ సార్‌కు కుర్చీ తీసుకురండి" అన్నారెవరో. "ఫరవాలేదు. నేను కిందనే కూర్చుంటాను" అంటూ కార్మికుల పక్కనే కూర్చున్నాడు.

"సార్... ఈ రోజు మీ పేపర్లో వచ్చిన వార్త బావుంది సార్" అన్నాడు ఒకతను.

అప్పటికే కార్మికులందరికీ అతను ఈరోజు విలేకరని తెలిసిపోయింది. అందరూ అతని చుట్టూ మూగిపోయారు. "మీ పేపర్లో చాలా బాగా రాశారు సార్. మీ పేపరొకటే సార్ నిజాలు రాసింది..."

ఒక్కొక్కరు ఒక్కోవిధంగా తమ సంతోషాన్ని తెలియజేస్తున్నారు. వాళ్ళ ఆనందాన్ని చూసి మురళికి చాలా సంతోషమేసింది. చిన్నగా నవ్వి "మీరు మరిన్ని వివరాలు ఇస్తే ఇంకా బాగా రాస్తాను" అన్నాడు.

"తప్పకుండా ఇస్తాం సార్" అన్నారు ఐదారుమంది ఒకేసారి. అంతలోనే ఎం.ఎల్.ఏ. వెంకటరెడ్డిని పరిచయం చేయడం మరచిపోయామన్న సంగతి గుర్తొచ్చి ఆయనను మురళికి పరిచయం చేశారు.

"నమస్తే సార్... మీ గురించి పేపర్లో చదువుతుంటాను. అసెంబ్లీలో మీరడిగే ప్రశ్నలు బావుంటాయండి" అన్నాడు అభినందనపూర్వకంగా చూస్తూ.

నేనూ రిపోర్టర్‌గా పనిచేసే ఎం.ఎల్.ఏ. నయ్యాను. అందుకే ఆ లక్షణాలు వచ్చాయి అంటూ నవ్వాడు వెంకటరెడ్డి.

"సమ్మెను గురించి మాట్లాడండి సార్. వార్తగా రాద్దాం" అన్నాడు మురళీ చనువుగా.

కార్మికులందరూ "సార్ మాట్లాడాలి. సార్ మాట్లాడాలి" అంటూ గట్టిగా నినాదాలిచ్చారు.

ఇక తప్పదన్నట్లుగా లేచి నిల్చున్నాడు వెంకటరెడ్డి.

గొంతు సవరించుకుని ఉపన్యాసం మొదలుపెట్టాడు.

ఆయన గొంతులో గొప్పతనముందో, ఆయన చెబుతున్న అంశంలోని నిజాలు ఆకట్టుకున్నాయో లేక ఆయనకున్న వాక్పటిమ అలాంటిదో తెలియదు కానీ అక్కడున్న వారంతా చాలా ఆసక్తిగా, శ్రద్ధగా విన్నారు.

"ప్రైవేటీకరణ అంటే ఏమిటి? దానివలన వచ్చే నష్టాలు ఏమిటి? లాభాలు ఏమిటి? ఎవరికి నష్టాలు, ఎవరికి లాభాలు? ఈ ప్రైవేటీకరణ ఎప్పుడు ప్రారంభమైంది? దాని ఉద్దేశమేమిటి? దీన్ని ప్రోత్సహిస్తున్నదెవరు? నేడు మన రాష్ట్రంలో ప్రతి ప్రభుత్వ సంస్థను కుంటిసాకులతో ప్రైవేటు వారికి అప్పజెప్పడానికి కారణమేమిటి? కుట్రలో భాగస్వాములెవరు? ప్రైవేటీకరణ ప్రభావం దేవస్థానంపై ఏవిధంగా పడనుంది? మొదలైన అంశాలన్నింటినీ చక్కగా, స్పష్టంగా అందరికీ అర్థమయ్యే రీతిలో ఎక్కడా విసుగనిపించకుండా చెప్పుకొచ్చాడు వెంకటరెడ్డి.

ఆయన సుమారు గంటసేపు ఉపన్యసించి వుండవచ్చు కానీ అక్కడున్న ఏ ఒక్కరికీ అంతసేపు మాట్లాడినట్టు అనిపించలేదు. ఎంతోమంది ఉపన్యాసాలు విన్న మురళీ ఆయన ఉపన్యాసానికి ముగ్ధుడైపోయాడు.

తనకు తెలియని అనేక విషయాలు ఆయన ఉపన్యాసంలో తెలిసిరావడం మురళికి ఆనందాన్ని కలిగించింది. ఆలోచనలను రెట్టింపు చేసింది.

"దేవస్థానాన్ని ప్రైవేటుపరం చేయడానికి తొలిమెట్టు పారిశుధ్య విభాగాన్ని స్వచ్ఛంద సంస్థకు ఇవ్వడం" అని తెలిసినప్పటినుండి మురళిలో ఆవేశం పొంగుతోంది. దాన్ని ఎలా వార్తగా రాయాలో ఆలోచించసాగాడు.

"చాలా థాంక్స్ సార్. ఇన్నాళ్ళ నా రిపోర్టింగ్‌లో నాకు బాగా నచ్చిన వ్యక్తి, బాగా ఉపన్యసించిన వ్యక్తి మీరే సార్" అన్నాడు మురళి.

వెంకటరెడ్డి చిన్నగా నవ్వి "ఈ విషయాలన్నీ చాలామంది రిపోర్టర్‌లకు చెప్పే ప్రయత్నం చేశాను. అందరూ భరించలేనట్లు ఫీలైపోయేవాళ్ళు. ఎవరో నీలాంటి ఒకరిద్దరు మాత్రమే ఓపిగ్గా విని అర్థం చేసుకున్నవాళ్ళు" అన్నాడు వెంకటరెడ్డి.

"సరే. టైమయిపోయింది సార్. నేను బయలుదేరుతాను" అన్నాడు మురళి.

"ఒక్క నిమిషం" అని తన బ్యాగ్‌లో నుండి "ప్రపంచబ్యాంకు రుణం" అన్న ఇంగ్లీషు పుస్తకాన్ని మురళికి ఇచ్చి దీన్ని చదివితే భవిష్యత్తులో మనకు ఎలాంటి ప్రభుత్వం వుంటుందో, మన బతుకులేమవుతాయో తెలిసిపోతుంది అన్నాడు.

దాన్ని తీసుకుని, అక్కడనుండి గుడి దగ్గరకు వెళ్దామా అనుకున్నాడు. కానీ మనసులో వున్న ఆలోచనలకు వార్తారూపం ఇచ్చేవరకూ మనసు ఆరాటం తగ్గేటట్లు కనబడకపోవడంతో బస్టాండు చేరుకుని బస్సు ఎక్కి ఊళ్ళోకి చేరుకున్నాడు.

మొదట్లో "అమ్మకానికి వేంకటేశ్వరుడు" అనికానీ, "వేంకటేశ్వరుణ్ణి వేలం వేయనున్న ప్రభుత్వం" అని కానీ హెడ్డింగ్ పెడదామనుకున్నాడు. అయితే సబ్‌ఎడిటర్లు ఎక్కడ అర్థం చేసుకోక దాన్ని ఖరాబు చేస్తారోనని "ప్రైవేటు పరం కానున్న దేవస్థానం? " అని కొశ్చన్ మార్క్ పెట్టి రాసుకుంటూ పోయాడు.

దేవస్థానంలో ఇప్పటికే వివిధ శాఖల్లో

ప్రారంభమైన కొత్త విధానాలు ఏవిధంగా ప్రైవేటీకరణకు దారితీస్తాయో వివరిస్తూపోయాడు. భవిష్యత్‌లో, కోట్లాది రూపాయల ఆదాయంకల శ్రీవారికి ఏవిధంగా రక్షణ లేకుండా పోబోతున్నదీ, కార్మికులు, ఉద్యోగులు ఏవిధంగా 'గోల్డెన్ షేక్ హ్యాండ్'లతో వీధులపాలు కానున్నదీ విశ్లేషిస్తూ ఉదాహరణలతో రాశాడు. అది ముగించిన తరువాత మనసు ఆరాటం తగ్గి తృప్తిగా అనిపించింది మురళికి.

ఆటలో ఓడిపోతున్నవారిని గెలిపించగలిగితే వచ్చే ఆనందంలా, అణగదొక్కబడుతున్న కార్మికుల పక్షాన నిలబడి, వారి హక్కులకోసం మాట్లాడినా, పోట్లాడినా అందులో కలిగే తృప్తి, ఆ అనుభూతి మాటలకు అందనిది.

అటెండర్‌చేత టీ తెప్పించుకుని తాగుతుండగా ఫోన్ మోగింది.

"హలో..." అన్నాడు లిఫ్ట్‌చేసి.

"మురళీ... నేను పి.ఆర్.ఓ.ని" అంది అవతలి గొంతు.

"చెప్పండి సార్" అన్నాడు మురళి.

"ఏందయ్యా ఇట్లాంటి పనిచేశావ్. నీకేమైనా న్యాయంగా వుందా?"

"ఏంటి సార్... నేనేం చేశాను"

"చేయాల్సిందంతా చేసేసి ఏం చేసినావంటావేమిటి? ఇ.వో, ఛైర్మన్‌ల దగ్గరనుండి నాకు అక్షింతలు వేయిస్తివిగదా.

అయినా కొండపైకి వచ్చినవాడివి. ఒక నిమిషం ఇ.వో.కి, ఛైర్మన్‌కి కనిపించి పోయుంటే బావుండేదికదా?"

"పీడా పోయింది" అన్న వ్యక్తేనా ఈ మాటంటున్నది? అనిపించింది మురళికి.

నవ్వి "ఇంకేమన్నా విశేషాలున్నాయా సార్" అన్నాడు కొనసాగించడం ఇష్టం లేనట్లుగా.

"ఆఁ... ఒక్క నిమిషం మా ఇ.వో.గారు మాట్లాడుతారంట" అన్నాడు పి.ఆర్.ఓ.

"హలో..."

"నమస్తే సార్"

"నమస్తే మురళీ. ఏంలేదూ ఈరోజు ప్రెస్‌కు లంచ్ అరేంజ్ చేశామయ్యా. గెస్ట్ హౌస్‌లో. నువ్వు రావాలి" అన్నాడు క్లోజ్ ఫ్రెండ్‌లాగా.

"ఫరవాలేదు. మిగతా ప్రెస్‌వాళ్లు వున్నారుకదా. మీరు కానిచ్చేయండి సార్"

"నువ్వు లేకుండా లంచ్ చేయడమేమిటి? మిగతావాళ్ళంతా ఒక ఎత్తు. నువ్వు ఒక ఎత్తు. నువ్వు మాకు ప్రత్యేక అతిథివయ్యా. నేను పిలుస్తున్నాను. నువ్వు వచ్చితీరాలి" అన్నాడు ఇ.వో. మరింత మొహమాటపెడుతూ.

"అది కాదు సార్. ఇప్పుడే ఒంటిగంట కావస్తోంది. నేను ఏదో ఒక బస్సుపట్టుకుని వచ్చేసరికి బాగా లేటయిపోతుంది. కాబట్టి మీరు కానిచ్చేయండి. మరోసారి తప్పకుండా వస్తాను" అన్నాడు మురళి.

"నో...నో...నో... నువ్వు రాకపోతే నేను కూడా భోంచేయను. టైం గురించి నోప్రాబ్లమ్. తిరుపతిలో వున్న నా కారు మీ ఆఫీసుకు పంపిస్తున్నాను. నువ్వు వెంటనే వచ్చెయ్. ఇంకేం మాట్లాడకు" అంటూ ఫోన్ పెట్టేశాడు ఇ.వో.

ఫేవర్‌గా రాసే విలేకరికంటే, వ్యతిరేకంగా వార్తలు రాసే విలేకరినే ఎక్కువగా గౌరవిస్తారు. లోపల ఎంత ద్వేషం వున్నా పైకి భయభక్తులతో రాచమర్యాదలు చేస్తారు. వయసులో తమకంటే చాలా చిన్నవాడైనా సార్... అంటూ తెగ గౌరవిస్తారు. ఏమిటో ఈ అధికారుల ప్రవర్తన అనుకుంటూ తను రాసిన వ్యాసాన్ని కంప్యూటర్ దగ్గరున్న ప్యాడ్ క్లిప్‌లో పెట్టాడు మురళి. ఇంతలో "సార్... మీ కోసం కారొచ్చింది" అన్నాడు అటెండర్. అంత ఫాస్ట్‌గా వచ్చాడంటే ఇ.వో. ఎంత సీరియస్‌గా చెప్పాడో డ్రైవర్‌కు అనుకుంటూ "సబ్ఎడిటర్ వస్తే ఇందులో ఏ కొంచెం తొలగించాలనిపించినా నాకోసారి చెప్పమని

చెప్పు" అని అటెండర్‌కు చెప్పి వెళ్ళి కారులో కూర్చున్నాడు.

అరగంటలో గెస్ట్‌హౌస్‌ను చేరుకుంది కారు. అత్యంత ఖరీదైన వసతిగృహం ఆ గెస్ట్‌హౌస్. మంత్రులు, వి.వి.ఐ.పి.లు వస్తే బసచేసేది ఇక్కడే.

ఆ గెస్ట్‌హౌస్ ముఖభాగమంతా అద్దాలతోనూ, ఫ్లోరింగ్ మొత్తం తళతళలాడే పాలిష్ రాళ్ళతోనూ నిర్మించారు. ఎత్తయిన ప్రదేశంలో వుండడం వలనా, ఎప్పుడూ చల్లగాలి వీస్తుండడంవలనా గోడలన్నీ ఏ.సి. పెట్టినట్లుగా చల్లగా వుంటాయి. బయటంతా అందమైన గార్డెన్ పెంచారు. అది కొండమీదున్న గెస్ట్‌హౌస్ కావడంతో వెనుకవైపు వున్న ఏ కిటికీని తెరచినా ఆరబోసినట్లుండే ప్రకృతి అందాలను తిలకించవచ్చు.

ఒకసారి ఆ గెస్ట్‌హౌస్‌లో బసచేశాక, దాన్ని ఖాళీచేయాలంటే ఎవరికీ మనసొప్పదు.

మురళీ లోపలికి అడుగుపెట్టగానే పి.ఆర్.ఓ. పరుగెత్తుకువచ్చాడు. "రావయ్యా మగడా! నీ కోసమే లేటు. మావాళ్ళందరూ వచ్చి అప్పుడే అరగంటయ్యింది. ఆకలో.. ఆకలో అంటూ లబలబలాడుతున్నారు. బాయ్‌కాట్ చేస్తామని బెదిరిస్తున్నారు. ఏదో సర్దిచెబుతున్నా. లోపలికి పద. నేను ఇ.వో.గారిని పిలిచొస్తాను" అంటూ లోపలికి పరుగెత్తాడు.

"ఇ.వో కొంచెం డోసు ఇచ్చినట్లున్నాడు. ఎక్కడ లేని ప్రేమ ఒలకబోస్తున్నాడు పి.ఆర్.ఓ." అనుకున్నాడు.

"తాను ఇక్కడ పేరుకే పి.ఆర్.ఓ.నని, తాను ఏపనీ చేయకున్నా తనను అడిగేవారే లేరనీ, ప్రెస్‌లో టి.టి.డి. గురించి వార్తలు వీలైనంత తక్కువ వచ్చేలా చూడడమే తను చేస్తున్నపని అని తనతో చెప్పిన ఆనాటి పి.ఆర్.ఓ. నాయక్‌కూ, ఇప్పుడు ఎక్కడ లేని గౌరవం ఒలకబోస్తున్న పి.ఆర్.ఓ.నాయక్‌కు ఎంత తేడా వుంది అనుకున్నాడు.

ఇ.వో. ఆయన వెనుకే ఇద్దరు జె.ఇ.వో.లు, ఇతర అధికారులు, ప్రెస్‌వాళ్ళు డైనింగ్ హాల్‌లోకి వచ్చారు.

కూర్చొనివున్న మురళీ లేచి "నమస్తే సార్" అన్నాడు నవ్వుతూ.

"నమస్తే" అన్నాడు ఇ.వో. నవ్వుతూ.

మురళి మిగతా అధికారులందరినీ విష్ చేస్తూ పలకరించాడు. అక్కడ బఫే సిస్టమ్‌లో లంచ్ అరేంజ్ చేయబడి ఉంది.

ఇ.వో. మెప్పుకోసం అన్నిరకాల వంటకాలను కొద్దికొద్దిగా వేయించుకుని ప్లేట్ తెచ్చి ఇ.వో. చేతిలోపెట్టాడొక అధికారి. ఇ.వో. వెంటనే మురళీ చేతిలో ఖాళీ ప్లేట్ తీసుకుని తన చేతిలోని ప్లేట్‌ని పెట్టారు.

మొహమాటపడుతూనే తీసుకున్నాడు మురళి.

అప్పటికే విలేకరులందరూ క్యూలో నిల్చొని తమకు కావలసిన వాటిని అడిగి వేయించుకుంటున్నారు.

అక్కడ సాంబారు, రసం, పెరుగు ఏవీ విడిగా లేవు.

పులగం, ములక్కాయ సాంబారుతో కలిపిన అన్నం, చిత్రాన్నం, చక్రపొంగలి, పెరుగన్నం, రెండురకాల స్వీట్లు, గోరుచిక్కుడుకాయ, గుమ్మడికాయల తాలింపులు, కేసరి, పాయసంలు చూడగానే కడుపు నిండిపోయేలా వున్నాయి. అధికారులొస్తున్నారనేమో ప్రత్యేకంగా చేసినట్లున్నారు. పెరుగన్నం మినహాయిస్తే మిగతా అన్నిటిలోనూ నెయ్యిని బాగా వాడినట్లున్నారు. ఘుమఘుమలాడిపోతున్నాయి.

శాకాహారంలో అంత రుచికరమైన పదార్థాలుంటాయిని కూడా వూహించలేం. లడ్డూలో తిరుమల లడ్డుకున్న ప్రాశస్త్యం, ప్రాముఖ్యత, ప్రామాణికతలలాగే అక్కడి అన్నాల్లో కూడా అంతటి ప్రామాణికత కనిపిస్తోంది. ఇంతకంటే బాగా ఎవరూ చేయలేరు అని ఢంకా భజాయించి మరీ చెప్పగలిగేంత గొప్పగా వుంది ఆ విందు.

స్పూన్‌తీసి పక్కనపెట్టి, చేత్తో తింటూ ఇ.వోని గమనిస్తున్నాడు మురళి.

ఆయన తనతో ఏదో మాట్లాడాలని తాపత్రయపడిపోతున్నాడు. కానీ కొంతమంది విలేకరులు ఆయనను చుట్టుముట్టి తమ సహజధోరణిలో ఒకపక్క అన్నం తింటూనే, మరోపక్క ఆయన తలనీ తింటున్నారు. వాళ్ళకి సమాధానాలు చెప్పలేక, వాళ్ళని తప్పించుకు రాలేక అప్పుడప్పుడూ అదోరకమైన నవ్వు నవ్వుతున్నాడు ఇ.వో.

"దేవస్థానం ఎంప్లాయీస్‌కు ఇచ్చినట్లుగా విలేకరులకు కూడా నెలనెలా పది లడ్డూలు తీసుకునేందుకు స్పెషల్ కార్డులిస్తే బావుంటుంది సార్" అన్నాడొక విలేకరి.

"ఇప్పుడు వారం వారం కావలసినన్ని పట్టుకుపోతున్నారుగా ఎలాగోలా మరి నెలనెలా పదిలడ్డూలు మాత్రమే ఇస్తే మీకెక్కడ సరిపోతాయి" అంటూ చురకంటించాడు ఇ.వో. అందరూ గొల్లుమన్నారు.

మురళీ నవ్వుకుంటూ వెళ్ళి పాయసం వేయించుకుంటుండగా పి.ఆర్.ఓ. వచ్చి "ఇంకొంచెం వెయ్ సార్‌కు" అన్నాడు వర్కర్ నుద్దేశించి.

అతను మరికొంచెం వేయబోతుంటే "చాలు... చాలండీ" అంటూ ప్లేట్ వెనక్కి తీసుకున్నాడు మురళి. "పి.ఆర్.ఓ.గారూ నాకు ఇంకో అసైన్‌మెంట్ వుంది. నేను వెళ్ళాలి. నాకేదైనా వెహికల్ అరేంజ్ చేయగలరా" అడిగాడు మురళి. "అరెరే... నిన్ను తీసుకువచ్చిన కారుని పంపించేశానే. అయినా నీకు లేందేముంది చెప్పు. ఒక నిమిషం వుండు ఇప్పుడే వస్తాను" అంటూ ఇ.వో. దగ్గరికి వెళ్ళి ఆయన చెవిలో ఏదో చెప్పాడు.

అంతదాకా నవ్వుతూ వున్న ఆయన మొహంలో అకస్మాత్తుగా మార్పువచ్చింది. ఆ మొహంలో కొంత ఆత్రం, తొట్రుపాటు కనిపించాయి. ఆయన పి.ఆర్.ఓ. చెవిలో ఏదో చెప్పి, తినడం ఆపేసి ప్లేట్ తీసుకెళ్ళి అక్కడున్న టబ్‌లో పడేసి సింక్ దగ్గరికి వెళ్ళి చేయికడుక్కుని వెళ్ళిపోయాడు వేగంగా.

అకస్మాత్తుగా ఇ.వో. వెళ్ళిపోవడాన్ని చూసి "ఏం జరిగిందబ్బా" అని విలేకరులందరూ ఆశ్చర్యంగా చూడసాగారు.

మురళికి కూడా ఏం జరిగిందో అర్థంకాలేదు.

ఇంతలో పి.ఆర్.ఓ. వెళ్ళినంత వేగంగానే తిరిగొచ్చి "ఇ.వో.గారు మీతో ఏదో పర్సనల్‌గా మాట్లాడాలంట. సెకండ్‌ఫ్లోర్‌లోకి రమ్మన్నారు" అన్నాడు.

దేవస్థానంలో అత్యున్నత అధికారి ఇ.వో. అంటే ఇంచుమించు ఓ మంత్రిస్థాయి. ఆయన అపాయింట్‌మెంట్ కావాలంటే గంటల తరబడి వెయిట్ చేయాలి. అలాంటిది తనను పిలిచి మరీ మాట్లాడాలనుకుంటున్నాడంటే,

బహుశా ఈరోజు పేపర్లోవచ్చిన వార్త చూసి భయపడ్డాడేమో? దాని గురించి అడగాలనుకుంటున్నాడా?

తినడం ముగించి చేయి కడుక్కున్నాడు.

నెమ్మదిగా మెట్లెక్కి సెకండ్ ఫ్లోర్‌కు చేరుకున్నాడు. మురళీ వెళ్లేసరికి ఎవరో ఒక వ్యక్తికి పేపర్లు ఇస్తూ "వెంటనే మంత్రిగారికి ఫ్యాక్స్ పంపించు వీటిని" అంటూ చెబుతున్నాడు ఇ.వో.

మురళిని చూడగానే తప్పుచేస్తూ దొరికిపోయిన వాడిలాగా మొహాన్ని ఎబ్బెట్టుగా పెట్టాడు. దాన్ని కప్పిపుచ్చుకోవడానికా అన్నట్లుగా గట్టిగా నవ్వుతూ "రా మురళీ. రా...రా...రా" అంటూ దగ్గరికి వచ్చి చేతులు పట్టుకుని లాక్కువెళ్లి సోఫాసెట్లో కూర్చుంటూ మురళిని కూడా కూర్చోమని బలవంతం చేశాడు.

మురళీ కూర్చున్నాడు.

"అదికాదుసార్ వీటిలో..." అంటూ అక్కడున్న వ్యక్తి ఏదో చెప్పబోతుంటే ఇ.వో ఒక్కసారిగా మండిపడ్డాడు.

"ఏం ఒకసారి చెబితే అర్థంకాదా! పోయి

# ఏరిన ముత్యాలు

★ నాలో ఇద్దరు మూర్ఖులు ఉన్నారు. ఒకడు కవిత్వాన్ని ప్రేమిస్తాడు. ఇంకోడు ఆ విషయాన్ని అందరికీ చెప్పేస్తాడు.

–జాన్‌డన్నె

★ భగవంతుడు ఒకడే. కాని ఆయన రూపాలు అనేకం. ఇంటిలోని యజమాని ఒకరికి తండ్రి, ఇంకొకరికి సోదరుడు, వేరొకరికి భర్తగా ఉన్నాడు. అదేవిధంగా భగవంతుడు ఒక్కడే అయినను భక్తులు ఆయనను అనేక విధాలుగా వర్ణించుదురు.

–శ్రీ రామకృష్ణపరమహంస

★ కన్ను తెరిస్తే జననం, కన్ను మూస్తే మరణం, రెప్పపాటే కదా ఈ పయనం.

–అలిశెట్టి ప్రభాకర్

★ ఒకనియందు ద్వేషం, వాని చావుతో అంతం కావలెను. చనిపోయినవానిని ఎన్నడును ద్వేషించరాదు.

–శ్రీరామసూక్తి

★ నీవు నీటిలో మునిగినను లేక నీటిలోనికి తోయబడినను నీ గుడ్డలు తడిసిపోవుట లేదా! నీకు ఆసక్తి కలుగకపోయినను కలిగిననూ మంత్రోచ్చారణవలన సిద్ధి కలుగును.

–శారదాదేవి

★ తీవ్ర భావోద్వేగంలో వున్నప్పుడు ఏ భావనను ప్రకటించినా అది ఖచ్చితంగా కవితగా మారుతుంది.

–వెండీకోప్

★ తల్లి మంచి బట్టలు వేసి ఆడుకోమని పంపిస్తుంది. ఆటల్లో బట్టలు మాసిపోతే బాధపడుతుంది. అలాగే భగవంతుడు మనిషికి శరీరాన్ని తొడిగి పంపిస్తాడు. ఆ శరీరాల్ని దుర్వినియోగం చేస్తే భగవంతుడైనా బాధపడతాడు.

–ఒక జర్మన్ సూక్తి.

★ ఈ లోకంలో ఎల్లప్పుడూ ఇచ్చేవాని (దాత) స్థితిలోనే వుండు. సాయం చేయి. సేవ చేయి. ఏ స్వల్పమైనా ఇవ్వు. కాని బేరమాడవద్దు.

–స్వామి వివేకానంద

★ బాల్యం ఆటలలో గడిచిపోవును. యౌవనం కామినీ చింతతో తీరిపోవును. వృద్ధుడు దుఃఖములను నెమరువేయుచుండును. అయ్యో! పరమాత్మను గురించి తలచునది ఎపుడు?

–శ్రీశంకరాచార్య

సేకరణ: కర్లపాలెం సృజన




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువచే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర' ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు. 75/- ద్వితీయ బహుమతి, రు. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఆగస్ట్ చతుర నవల రాలనిపువ్వు

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

చెప్పిన పని చెయ్! వెళ్లువెళ్లు"

ఎప్పుడూ ఇ.వో ముఖంలో అంతకోపం చూడని ఆ వ్యక్తి ఒక్కసారిగా బిక్కచచ్చి పోయి వెనుదిరిగి మెట్లు దిగిపోయాడు.

"వీళ్లంతే మురళీ! ప్రతిపనీ వివరంగా చెబితే తప్పు చేయరు. వీళ్లతో వేగలేక చస్తు న్నామనుకో" అన్నాడు. ప్రతిగా చిన్నగా నవ్వాడు మురళీ ఏమి చెప్పాలో తెలియక.

ఇ.వో ఏమైనా చెబుతాడేమోనని మురళీ ఎదురుచూశాడు. ఎటు ప్రారంభించాలో తెలియక ఇ.వో ఇబ్బంది పడడంతో ఇద్దరి మధ్యా కొంతసేపు నిశ్శబ్దం రాజ్యమేలింది.

అది తుపాన్ ముందరి ప్రశాంతతలా అనిపించింది మురళీకి.

"చెప్పు మురళీ, ఏంటి విశేషాలు" అన్నాడు ఇ.వో. ఎలాగోలా ప్రారంభించే ప్రయత్నం చేస్తూ.

"మీకు చెప్పేటంతటివాణ్ణి కాదు సార్. మీరు ఏదైనా చెబితే వింటాను" ఇ.వో వూపిరి ఒకసారి గట్టిగా పీల్చి వదిలాడు ఏదో చెప్పబోతున్నట్లుగా.

"నీతో చాలా రోజులనుండి మాట్లాడాల నుకుంటున్నాను మురళీ. వీలు పడితేనా? "

"చెప్పండి సార్!"

"నీకు కొన్ని విషయాలు చెప్పాలి. నీకే ఎందుకు చెప్పాలనుకుంటున్నానంటే దాన్ని అర్థం చేసుకోగలిగిన వాడివి నువ్వొక్కడివే కాబట్టి" మురళీ ప్రశాంత వదనంతో ఇ.వో కేసి చూడసాగాడు.

ఇ.వో కొనసాగించాడు.

"దేవస్థానం భవిష్యత్ అంధకారం కానుంది మురళీ. రానున్న కొద్ది సంవత్స రాల్లో దేవస్థానం అనేది లేకుండా పూర్తిగా ప్రైవేటు పరం కానుంది. దానికి కావలసిన ఏర్పాట్లు ప్రభుత్వం చేస్తోంది. ఒక్కొక్క విభాగాన్ని నెమ్మది నెమ్మదిగా ప్రైవేటు వారికి ఇస్తూ పోతారు. కొన్ని రోజుల తరు వాత తిరుమల మొత్తం ప్రైవేటు మయం అయిపోతుంది. ప్రైవేటీకరణ ద్వారా అభివృ ద్ధిని సాధించాలనుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో కొన్ని రంగాల్లో మాత్రమే ప్రైవేటీకరణ సత్ఫలితాల నిస్తుంది.

ప్రతిరంగంలోనూ ప్రైవేటీకరణ అమలు చేస్తే అది ఆ ప్రభుత్వ అసమర్థతను సూచి స్తుంది. అలా చేస్తూ పోతే కొన్నేళ్లకు ప్రభుత్వం కూడా ప్రైవేటుపరమైపోతుంది. అయితే తమ స్వలాభం కోసం దేశాన్ని తాక ట్టుపెట్టే నాయకుల పాలనలో మనం ఏమీ చేయలేని పరిస్థితి. మనం వద్దన్నా దేవ స్థానం ప్రైవేటుపరంకాక తప్పదు. సాక్షాత్తూ వేంకటేశ్వరస్వామే ప్రైవేటీకరణ దెబ్బకు గిల గిలలాడనున్నాడు. ప్రైవేటు వ్యక్తులకు కోట్లు ఆర్జించిపెట్టే వ్యాపారవస్తువుగా మారిపోను న్నాడు. అన్ని విభాగాలు ప్రైవేటుపరం కాగానే దేవుడి హుండీలోని ప్రతిపైసా ప్రైవేటు వ్యక్తుల బ్యాంక్ అకౌంట్లలోకి వెళ్లిపోతుంది. వాళ్లకిస్తే నిర్వహణ మెరుగు పడవచ్చు అభివృద్ధి కూడా చెందవచ్చు కానీ సాధారణ భక్తులెవరూ భరించలేని విధంగా బస్సు ఛార్జీలు పెంచవచ్చు నడచి రావడానికి కూడా టిక్కెట్లు పెట్టవచ్చు సర్వదర్శనానికి వంద రూపాయలు, ప్రత్యేక దర్శనానికి రెండువేలు, పూజలకు వేలకు వేలు వసూలు చేసినా ఆశ్చర్యపోనక్కర్లేదు. అప్పుడు భక్తికి, పవిత్రతకు అర్థాలే మారిపో తాయి"

ఇ.వో గొంతులో ఆవేదన తొణికిసలాడు తోంది. ఎంతో బాధతో మాట్లాడుతున్న ట్లుగా మాటలు జీరబోయి వస్తున్నాయి.

"ఎంతటి ఉదాత్తమైన మనిషి" అనుకు న్నాడు మురళీ.

మురళీ శ్రద్ధగా వింటుండడంతో ఇ.వో తన మాటల్ని కొనసాగించాడు.

"నిజం మురళీ! ఫారెస్టు విభాగంలో ఇప్ప టికే కాంట్రాక్టు పద్ధతి పెట్టాము. ఆ కాంట్రా క్టుని స్థానిక పాలక పార్టీ నాయకులకే ఇచ్చా మని నీకు ఇప్పటికే తెలుసనుకుంటాను"

అన్నాడు.

తెలుసన్నట్లుగా తలూపాడు మురళీ.

ఈవిధంగా కాంట్రాక్టుకివ్వడం వలన తిరుమల కొండల్లో లభించే ఎంతో విలువైన చందనపు చెట్లన్నిటినీ నరికి ఎప్పటికప్పుడు తరలిస్తూ అక్రమార్జనకు పాల్పడే అవకాశాన్ని ప్రైవేటు వ్యక్తులకిచ్చినట్లయింది.

"ఫారెస్టు విభాగం టి.టి.డి చేతిలో వున్నప్పుడు పని చేసే వాళ్లకు కనీస వేతనాలను చెల్లించేవాళ్లం. ఇప్పుడు వాళ్లకు నెలకు ఏ రెండుమూడు వందలో ఇస్తున్నారు. కట్టెలు కొట్టుకుని వెళ్లేవారిని పట్టుకుని వారిదగ్గర బెదిరించి వసూళ్లు చేసుకోమని కాంట్రాక్టర్లు చెబుతున్నారు. ఇవన్నీ నాకు ఎప్పుడో తెలుసు. అయినా నేను నిస్సహాయుణ్ణి, నిమిత్తమాత్రుణ్ణి.

విద్యారంగానికి టి.టి.డి చేస్తున్న సేవ గురించి చెప్పనక్కరలేదు. ఇప్పటికే చాలా విద్యాసంస్థలను దేవస్థానం ప్రత్యక్షంగా నిర్వహిస్తోంది. యూనివర్శిటీకి ఆర్థికంగా చేయూతనిస్తోంది. దేశంలో పలుచోట్ల వున్న ఈ విద్యాసంస్థలకై ఏటా కొన్ని కోట్ల రూపాయల వరకు దేవస్థానం ఖర్చు చేస్తోంది. ఈ విభాగాన్ని కూడా త్వరలో ప్రైవేటు పరం చేయడానికి సన్నాహాలు పూర్తయ్యాయి.

బోర్డు సభ్యులుగా పాలకపార్టీ నాయకులే ఎక్కువగా వుండడంవలన మేం నామమాత్రంగా మిగిలిపోయాం. విద్యాసంస్థలన్నిటినీ చూసుకునేందుకు ఒక ప్రైవేట్ ట్రస్ట్ ఏర్పాటు చేసి దాని నిర్వహణకు కావలసిన మొత్తాన్ని నిత్యాన్నదానం వంటి వాటికి విరాళాలు సేకరించినట్లుగానే నిధులు సేకరించేందుకు రంగం సిద్ధం చేస్తున్నారు. ఈ విద్యావిభాగాన్ని చూడడానికి ఒక ప్రైవేట్ ట్రస్ట్ ఏర్పాటు చేయాలని పాలక మండలి పట్టుపడుతోంది. ఎప్పుడైతే ప్రైవేట్ ట్రస్ట్ ఏర్పడుతుందో అప్పుడే దేవస్థానం దానిపై వున్న అధికారాలను కోల్పోతుంది. ఆ ప్రైవేట్ ట్రస్ట్‌లో ఎవరుంటారో నీకు తెలియందేమీకాదు. అక్షరమ్ముక్క రాని రాజకీయ నాయకులంతా ఇందులో వుండి, విద్యావిభాగాన్ని భ్రష్టు పట్టిస్తారనడంలో సందేహంలేదు. ఇంకో విషయం బహుశా ఇది నీ దృష్టికి వచ్చి వుండకపోవచ్చు ఈ ట్రస్ట్‌ను నేరుగా ఏర్పాటు చేస్తే ఎక్కడ విద్యార్థుల్లోనూ, అధ్యాపకులూ, అధికారుల్లోనూ వ్యతిరేకత వస్తుందోనని తెలివిగా ఒక ఏక వ్యక్తి కమీషన్‌ను నియమించింది పాలకమండలి. ఆయనగారు సర్వే చేసి పంపిన రిపోర్ట్ మొత్తం నేను చదివాను. ఆయన పరిశీలించిన అంశాలన్నీ విద్యారంగాన్ని దేవస్థానమే చూడాలని చెబుతుంటే సిఫార్సుల్లో మాత్రం అందుకు విరుద్ధంగా ప్రైవేట్ ట్రస్ట్‌కు అప్పజెప్పాలంటూ సూచించాడు. దీన్నిబట్టి ఇది ఎవరి నిర్ణయమో మనకు తెలిసిపోతుంది" ఒక నిమిషం ఆపి, మళ్లీ చెప్పనారంభించాడు.

"ఇప్పుడు పారిశుధ్య విభాగంలో ప్రైవేటు వారిని చొప్పించేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. నిన్న నువ్వు ఆ విషయాలను అడుగుతుంటే నిజాలను చెప్పేద్దామనిపించింది. కానీ చెప్పలేకపోయాను. ఈ విషయాలన్నీ బోర్డు మీటింగ్‌లో పెట్టినప్పుడే తిరస్కరించాలనుకున్నాను. అయితే బోర్డు సభ్యులందరూ అత్యున్నత పదవిలోవున్న వ్యక్తి చేతుల్లోని కీలుబొమ్మలు. ఆయన చెప్పినట్లు వీళ్లు వినాలి. ఇష్టమున్నా లేకున్నా వీళ్లు చెప్పినట్లు నేను వినాలి" అంటూ వూపిరి పీల్చుకోవడానికా అన్నట్లుగా ఆపాడు. తన మాటల్ని మురళీ నమ్ముతున్నట్లుగా అనిపించడంతో మళ్లీ కొనసాగించాడు.

"నేను ఐ.ఎ.ఎస్ చదివాను మురళీ, ప్రైవేటీకరణ వలన కార్మికులు ఎంత నష్టపోతారనేది నేను వూహించగలను" అన్నాడు గొంతు గాద్గదికమవుతుండగా.

"ఛ... ఇలాంటి మంచి వ్యక్తికైనా తను

విమర్శనాస్త్రాలు ఎక్కుపెట్టింది. ఇలాంటి వ్యక్తినా లంచాలు తీసుకొనుంటాడని వూహించింది? ఆయన స్థానంలో ఎవరున్నా అంతకంటే ఏం చెయ్యగలరు. అనవసరంగా అపార్థం చేసుకున్నానే" అని మనసులోనే నొచ్చుకున్నాడు మురళీ. పైకి మాత్రం తన సహజధోరణిలో ప్రశ్నించాడు.

"బోర్డు సభ్యుల్లో కార్మికులవైపు నుండి ఇద్దరు ప్రతినిధుల్ని వుంచి వుంటే ఇలాంటప్పుడు ఎంతగానో ఉపయోగపడి వుండేది. ఇప్పుడున్న బోర్డు సభ్యులంతా కష్టమంటే తెలియనివాళ్లే. కాబట్టి వాళ్లు ఎంతసేపూ తమకేమొస్తుందా అని ఆలోచిస్తారు తప్ప కార్మికుల గురించి పట్టించుకోరనేది స్పష్టం. అయినా మీకు ఇష్టం లేనప్పుడు దాన్ని బోర్డు మీటింగ్‌లో గట్టిగా వ్యతిరేకించవచ్చు గదా! లేకుంటే ప్రెస్‌కి చెబితే మేం దాన్ని పత్రికలద్వారా ప్రజల్లోకి తీసుకెళ్లి మీకు అండగా నిలిచే వాళ్లంకదా" అన్నాడు.

"నిజమే మురళీ! బోర్డు మీటింగ్‌లో నేను గట్టిగా వ్యతిరేకించవచ్చు. అలా చేస్తే జరిగేదేమిటి? వెంటనే నాపై బదిలీవేటు పడుతుంది. వాళ్లు ఆడించినట్లంతా ఆడే మరో ఐ.ఎ.ఎస్ ఆఫీసర్ని తెచ్చిపెట్టుకుంటారు. ఇక ప్రెస్ అంటావా? మీకు చెప్పినా జరిగేది అదేకదా! అన్నీ తెలిసినా తెలియనట్లుండడం మంచిది. ఇప్పుడు నీతో చెబుతున్నది కూడా పర్సనల్ విషయాలే. ఇవన్నీ ఆఫ్‌ది రికార్డే. పొరబాటున నువ్వు రాసినా ఫలితం అనుభవించేది నేనే" అన్నాడు ఇ.వో విరక్తితో కూడిన నవ్వుతో.

మురళీ మనసంతా తప్పు చేశానన్న భావనతో నిండిపోయింది. ఆవేశంలో ముందూ వెనకా చూడకుండా పొరబాట్లు చేసేస్తుంటాము. ఆఫీసుకు వెళుతూనే ఈ రోజు రాసిన వార్తలో కొన్ని మార్పులు చేయాలి. ఇ.వోని గూర్చి రాసినవన్నీ ఎడిట్ చేసేయాలి అనుకున్నాడు.

"మీరు పర్సనల్‌గా చెప్పినవి రాసి మిమ్మల్ని ఇబ్బంది పెట్టేంత దుర్మార్గుడిని కానుసార్" అన్నాడు క్షమించమన్నట్లుగా.

"మన పత్రికల్లో బాగా అవగాహన వున్న వ్యక్తి, నిజమైన జర్నలిస్టు ఎవరని అడిగితే నిన్ను చూపుతాను మురళీ! అందుకే ఈ విషయాలన్నీ నీకు చెప్పాను. నాకోసం ఇంతసేపూ కూర్చుని నా ఆవేదనను పంచుకున్నందుకు థాంక్స్" అన్నాడు ఇ.వో.

"అయ్యయ్యో ఎంత మాట సార్! మీ అంతటి వారు నాతో మాట్లాడ్డమే గొప్ప" అన్నాడు మురళీ.

"అన్నట్లు మురళీ... నీకు మా ఆఫీసుల్లో ఏ సహాయం కావాలన్నా నేనున్నంతలో నిర్మొహమాటంగా అడుగు. మీ ఇంటి పరిస్థితి గూర్చి కొంత తెలిసింది. నువ్వేమీ అనుకోకపోతే మంచి సెంటర్లో దేవస్థానం షాపులు ఓ రెండు నీకు ఇప్పిస్తా. మీ నాన్నను పెట్టి చూసుకొమ్మని చెప్పు. అలాగే మీరున్న ఇల్లు చాలా చిన్నది, ఇరుకైనదటగదా! మన క్వార్టర్స్‌లో ఓ పోర్షన్ తీసుకో. నేను మేనేజ్ చేస్తాలే. నువ్వేం మొహమాటపడకు. తరువాతొకసారొచ్చి కనపడు" అన్నాడు ఇ.వో.

ఆయన ఇస్తానన్నవి నిజంగా ఇస్తాడో లేదో, తాను పుచ్చుకుంటాడో లేదో తెలియదుకానీ ఆ మాటల్లోని ఆప్యాయతకూ అభిమానానికి పొంగిపోయాడు మురళీ.

"మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి సార్, ఇక నేను బయలుదేరుతానండి" అన్నాడు మురళి.

ఇ.వో బెల్ కొట్టాడు.

అటెండర్ పరుగెత్తుకొచ్చాడు.

"సార్‌ని తిరుపతికి తీసుకెళ్లమని డ్రైవర్‌కు చెప్పు" ఆదేశిస్తున్నట్లుగా అన్నాడు ఇ.వో.

"వెహికల్స్ ఏవీలేవు సార్! ప్రెస్ వెహికల్ వెళ్లి చాలాసేపయింది. మీ కారు మాత్రమే వుంది సార్!" అన్నాడు అటెండర్ భయపడుతూనే.

"ఫరవాలేదు. నాకారులోనే తీసుకెళ్ళి

దించి రమ్మను" అటెండర్ వెళ్ళిపోయాడు.

మామూలుగా ఏ ప్రోగ్రామ్‌కు పిలిపించినా ఒక మినీబస్సును పంపించి అందులోనే విలేకరులందరినీ కుక్కేసి తీసుకువెళుతుంటారు. ఇక తప్పదు అనుకుంటే ఎవరో ఒక అధికారిని పిలిపించి ఆయన వెహికల్‌లో తీసుకెళ్ళి దించిరమ్మంటారు. అలాంటిది తనకోసం ఇ.వో కారునే పంపిస్తున్నాడంటే...

ఉదయం కూడా ఇ.వో కారులోనే తిరుమలకు వచ్చాడు.

అయితే ఇప్పుడు వెళ్ళబోతున్న కారువేరు.

అది ఇ.వో స్వంతకారు. కాగా, ఇది దేవస్థానం డబ్బులతో కొన్న ఖరీదైన కారు. దానిలో జె.ఇ.వో కూడా ఇంతవరకు ఎక్కలేదు.

"వుంటాను సార్" అని షేక్‌హ్యాండ్ ఇచ్చి వెనక్కి తిరిగి మెట్లు దిగసాగాడు. మెట్లు దిగుతూనే ఎదురుగా వున్న చిన్న గదిలో టేబుల్‌పై ఫోన్ కనిపించింది. ఒకసారి ప్రెస్ క్లబ్‌కు ఫోన్‌చేసి ఏవైనా ప్రోగ్రామ్‌లున్నాయేమో కనుక్కుందామని అటుకేసి నడిచాడు.

ఫోన్ ఎత్తుకుని రింగ్ చేయసాగాడు.

ఫోన్ రింగ్ అవుతోంది కానీ ఎవరూ ఎత్తడం లేదు.

"ఈ అటెండర్లు ఒకరికిద్దరు... ఎక్కడుంటారో ఫోన్ ఎత్తకుండా" అనుకుంటూ మళ్ళీ రింగ్ చేస్తూ పక్కకి తిరిగాడు.

అక్కడ ఫ్యాక్స్ మిషన్ వుంది. అక్కడున్న ఉద్యోగి ఏదో ఫ్యాక్స్ పంపుతున్నాడు.

ఎంతకీ ఫోన్ లిఫ్ట్ చేయకపోవడంతో విసుగొచ్చి ఫోన్ పెట్టేయబోతుండగా ఫ్యాక్స్ మెషిన్‌లోనుండి బయటికొస్తున్న పేపర్‌లోని మేటర్‌లో మురళీ అన్న పేరు కనిపించింది. ఏంటబ్బా అనుకుంటూ ఫోన్‌పెట్టేసి వెళ్ళి ఆ పేపర్ తీసుకున్నాడు.

"అది చదవకూడదండి" అన్నాడు అక్కడున్న ఉద్యోగి.

"మాకు తెల్సు ఏది చదవాలో, ఏది చదవకూడదో నీ పని చూసుకో" అన్నాడు మురళీ కొంచెం గట్టిగానే.

ఆ గొంతులోని కమాండింగ్‌కు ఆ ఉద్యోగి వెనక్కి తగ్గి తన పని తాను చూసుకోసాగాడు.

ఫ్యాక్స్‌లో పంపిన ఆ మేటర్ చదవగానే మనసంతా ఇ.వో. పై అసహ్యంతో నిండిపోయింది. తనని చూడగానే ఎందుకంత తడబడ్డాడో అర్థమయ్యేకొద్దీ 'ఆహా! ఇ.వో. రామయోగిగారూ మీరు ఇంత బాగా నటించగలరని ఇప్పుడే తెలిసింది' అనుకున్నాడు. తను తిరుమలలో ఇ.వోని కలవకుండా వెళ్ళిపోయినప్పుడే ఊహించి వుంటారు. తను ఏదో పెద్దవార్త, వాళ్లకు ఇబ్బంది కలిగించే వార్తను రాయబోతున్నట్లుగా. తనను ఇటు రప్పించి, అటు ఆఫీసుకు మనుషుల్ని పంపి, తను రాసిన వ్యాసంలోని అన్ని పేజీలనూ జిరాక్స్ చేయించుకొచ్చేశారు. వాటిని ఛైర్మన్‌కు, మంత్రికీ ఒక్కో కాపీ ఫ్యాక్స్ పంపుతున్నారు. ఆ వ్యాసంతోపాటూ, ఆ వ్యాసం రాసిన తన గురించీ రాశారు. తనను ఎలా నిలువరించాలో తెలుపవలసిందిగా కోరుతూ నోట్‌ను కూడా అందులో జతపరిచారు.

అందులోనే రెండవ నోట్ కింద ఆ వార్త ప్రచురితమైతే ఇక్కడి కార్మిక, ఉద్యోగ సంఘాలన్నీ మేల్కొని ఐక్యమయ్యే అవకాశం వుందనీ, ఇతర రాజకీయ పార్టీలు దీన్ని రాజకీయంచేసి లబ్ధిపొందేందుకు ప్రయత్నించవచ్చు కాబట్టి ఆ వార్త ప్రచురితం కాకుండా చూడాలని వుంది.

మురళీ ఆవేశంతో రగిలిపోయాడు.

అంతలో కారువచ్చి గేటుముందు ఆగింది. అటెండర్ పరుగెత్తుకొచ్చి "సార్ కారు వచ్చింది" అన్నాడు.

వేగంగా అడుగులు వేస్తూ వెళ్లి వెనుక డోర్‌తీసి కారులో కూర్చున్నాడు. అంతలో పి.ఆర్.ఓ లోపలినుండి పరుగెత్తుకొచ్చి

"మురళీ, ఇది తీసుకో" అంటూ ఒక బ్యాగ్ ఇచ్చాడు.

తీసుకోవాలా? వద్దా? అని ఆలోచిస్తుండ గానే కారు కదిలింది. సగం తెరచిన అద్దం పైభాగం గుండా ఆ బ్యాగ్‌ను లోపలికి విసి రివేశాడు పి.ఆర్.ఓ.

అద్దాలు ఆటోమేటిగ్గా నెమ్మదిగా మూసు కున్నాయి. కారులో ఏసి ఆన్ అయ్యింది.

శరీరానికి చల్లదనం హాయిని గొలుపు తోంది.

అతని ఆలోచనలు క్రమంగా వేడెక్కుతు న్నాయి.

"తను నిజాయితీపరుడని నిరూపించుకు నేందుకు ఎంత పెద్ద ఉపన్యాసం చెప్పాడు. ఎవర్ని నమ్మాలో, ఎవర్ని నమ్మకూడదో తెలి యటం లేదు అయినా తనెట్లా మోసపో యాడు? ఒక్క క్షణం ఫోన్ చేయడానికి వెళ్లకుండా వుండి వుంటే... ఒక దుర్మార్గుణ్ణీ, అవినీతిపరుణ్ణీ చాలా మంచి వ్యక్తని భావిస్తూ ... తను ఓహ్..." తల గట్టిగా విదిలించాడు.

ఆ లెక్కన దేవస్థానం షాపులు, క్వార్టర్స్... ఇవన్నీ తన మీద ప్రేమతో, ఆప్యాయతతో ఇస్తానన్నవి కావు. తన కష్టా లను చూసి, కనీసం జాలితో ఇస్తానన్నవి కూడా కావు.

అవి భయంతో ఇస్తానన్నవి, తనకు లంచంగా ఇస్తానన్నవి. అవును తను ఆయ నపై సదభిప్రాయం కలిగివుండడానికి లంచంగా ఇస్తానన్నవి.

మనసు ఉడికిపోయింది.

అంతలో కారులోని ఫోన్ రింగ్ అవసా గింది.

ఇ.వో.కోసం ఎవరైనా చేస్తున్నారేమోనను కుని విసుగ్గానే లిఫ్ట్ చేశాడు. తను హలో అనకముందే.

"హలో మురళీ..." అన్నమాటలు వినబ డ్డంతో ఉలిక్కిపడ్డాడు. ఆ గొంతును గుర్తు పట్టే ప్రయత్నం చేశాడు.

తను రోజూ సుమారు యాభై, అరవై మందితో ఫోన్‌లో మాట్లాడుతు వుంటాడు. అధికారుల గొంతులన్నీ తనకు సుపరిచితమే. అది ఇ.వోది కాదు. పి.ఆర్. ఓదీ కాదు. వాళ్లిద్దరికీ కదా తెలుసు తను కారులో వున్నట్లు.

"హలో... ఎవరండీ" అన్నాడు మురళి.

నేనెవరైతే ఏం గానీ జాగ్రత్తగా విను.

"నువ్వు ఇప్పుడు నేరుగా ఆఫీసుకు వెళు తున్నావు. వెళ్ళి నువ్వు రాసిన వ్యాసాన్ని వెనక్కి తీసుకుంటున్నావు" అన్నాడు.

ఎవరు? ఎవరి గొంతిది? వేగంగా ఆలో చిస్తున్నాడు.

ఎక్కడో విన్నట్లుంది.

"ఏం వినిపిస్తోందా? "

"వెనక్కి తీసుకోకపోతే? "

"తీసుకోవాలి. తీసుకోకపోతే..." మధ్యలో వికటమైన నవ్వు... "చెప్పను... చేసి చూపి స్తాను. అదే ఆ వార్తను వెనక్కి తీసుకున్నా వనుకో నీ బ్యాంకులో రేపుదయమే ఓ లక్ష నీ అకౌంట్‌లో జమఅవుతుంది. ఆలోచిం చుకో" అంది అవతలిగొంతు.

మురళి ఏదో చెప్పబోయేటంతలో గుర్తుకొ చ్చింది.

యస్... ఆ గొంతు టి.టి.డి. ఛైర్మన్ సత్యన్నారాయణది. అంత ఉన్నతమైన పద విలో వుండి బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడా? ఎంతైనా రాజకీయనాయకుడు కదా. వాళ్ళ స్వభావం ఇంతకంటే ఎదగదు అను కుంటూ.

"రేయ్... నువ్వెవరయితే నాకేంగానీ, ఒకటి మాత్రం గుర్తుంచుకో. నువ్వు మాట్లా డుతున్నది మురళీతో. నీలాంటివాళ్ళు వంద మంది వచ్చినా నన్నేం చేయలేరు. ఒక్క సారి వార్త రాస్తే అది ఖచ్చితంగా అచ్చయి తీరాల్సిందే. ఎవరడ్డమొస్తారో చూస్తాను. నీలాంటివాళ్ళ బెదిరింపులకు లొంగిపోతాన నుకున్నావురా చెత్తనాయాలా" అన్నాడు కావాలనే.

ఆ సంబోధనకు, ఆ తిట్లకు అవతలి గొంతు కొంతసేపు మూగవోయింది. అంతలోనే "ఏం చూసుకుని నీకంత పొగరు. నీకు చెడుకాలం దగ్గరపడింది. నేనెవరనుకుంటున్నావు? నేను తల్చుకుంటే" మాటలు వస్తూనే వున్నాయి.

చేతిలోని కార్డ్‌లెస్ ఫోన్‌ను, అద్దాలు దించి కిటికీగుండా రోడ్డుమీదకు విసిరేశాడు.

డ్రైవర్ బ్రేక్‌వేస్తూ "సార్" అన్నాడు ఆందోళనగా.

"పోనీయ్. ఎవరన్నా అడిగితే నామీద చెప్పు" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

తనకింత ధైర్యం ఎక్కడినుండి వచ్చిందో తనకే అర్థంకావడంలేదు. ఏం చూసుకుని తనింత ధీమా ప్రదర్శిస్తున్నాడు! ఆలోచిస్తూ వున్న మురళి అనాలోచితంగా పి.ఆర్.ఓ ఇచ్చిన బ్యాగ్‌లోకి చేయిపెట్టాడు.

అందులో లక్షలాదిమంది యాత్రీకులు ఇంకా ఇంకా కావాలని కోరుకునే అతిరుచికరమైన తిరుపతి లడ్డు[illegible] [illegible]వడలు బ్యాగ్‌నిండా పెట్టి వున్నాయి.

మామూలుగా అయితే ఆనందంతో పొంగిపోయేవాడే. కానీ ఇప్పుడవి తనకు లంచంగా ఇచ్చినట్లు అనిపిస్తుంటే వాటిని తీసుకోబుద్ధికాలేదు.

వాటిని తనతోపాటు వుంచుకోవడానికి కూడా మనసొప్పడంలేదు.

వెంటనే ఒక నిశ్చయానికి వచ్చాడు.

"డ్రైవర్ కారాపు"

కారు ఆగింది.

కారు దిగాడు మురళి.

సుందరమైన లోయ. పచ్చని చెట్లు పరచినట్లుంది. మధ్యగా వగలుపోతూ, గలగలమంటూ కపిలతీర్థంవైపుగా ప్రవహిస్తోంది సెలయేరు.

రెండో ఆలోచనలేకుండా అందులోకి విసిరేశాడు ఆ బ్యాగ్‌ను.



రాత్రి కురిసిన వానకు కొండల్లోని బండలపై కారుతున్న జవుకలో ఎండపడి వెండిలాగా మెరుస్తోంది.

"నీవల్లనే లేటయిపోయింది. ఎనిమిదిగంటల బస్సు కూడా వచ్చిపోయింది. ఇంత నీలుక్కుని పనికిబోతే రెడ్డి వూరుకుంటాడా. నడునడు" అంటూ తొందరపెట్టింది యశోద.

"ఏ టయ్యానికి లేచినా ఆ టయ్యానికే పొద్దుపుట్టేదన్నట్లుగా కోడికూత ఝాము కాడలేచినా లేటయిపోయింది" అంది గంగావతి [illegible]గా నడుస్తూనే.

"ఎంతదూరం వుంటుంది రెడ్డోళ్ళ బాయి" అడిగింది గంగావతి.

"ఆ చెరువు కట్టదాటేస్తే వచ్చేదే రెడ్డోళ్ళ బాయి"

ఇద్దరూ చెరువు కట్టవెంబడి నడవసాగారు. కట్టకింద పొలాలు... ఆహ్లాదకరంగా వున్నాయి.

పచ్చని చెరకు తోటలు ఏపుగా పెరిగివున్నాయి. వాటిమధ్యలో అక్కడక్కడా వరిపైరు, మిరపతోటలు... దూరంగా అక్కడొకటి, అక్కడొకటి గానుగలు ఆడుతున్నట్లుగా పైకిలేస్తున్న పొగలు...

గాలికి వస్తోన్న కొత్త బెల్లం వాసన.

ఇటువైపు చెరువునిండా నీళ్ళు. చేపల కోసం హుషారుగా ఈదుతూ, బుడుంగున మునుగుతూ నీటికోళ్ళు.

అప్పుడే విచ్చుకున్న పెద్ద తామరపూలు, గాలికి మొదలై కట్ట చివరివరకు పరుగెత్తుకొస్తున్న బుల్లిబుల్లి అలలు...

కట్ట చివరన వున్న డ్యాంపై నుండి కిందికి శబ్దంచేస్తూ దూకుతున్న నీళ్లు.

"అబ్బ ఎంత బాగుందో కదా" అంది గంగావతి ఆ దృశ్యాల్ని చూసి మైమరచి పోతూ.

"దీనికే అబ్బా అంటే, దీనబ్బల్లాంటివి మా వూళ్లో ఇంకా ఎన్నో వున్నాయి తెలుసా" అంది యశోద.

"నాకెప్పుడు చూపిస్తావు అవన్నీ"

"ఎప్పుడన్నా పండగపూట పోదాంలే"

ఇద్దరూ రెడ్డోళ్ళ గానుగ దగ్గరకి చేరుకున్నారు.

వాళ్లను చూడగానే రెడ్డి భార్య ఇంతెత్తున లేచింది.

"ఏమే యశోదా... ఎంత పొద్దవుతా వుండాది. ఇప్పుడా వచ్చేది. బుద్దుండాదా, లేదా? ఏం మనుషులో ఏమో... నాలుగు బార్ల పొద్దెక్కినాక వస్తారు. మళ్ళా పొద్దుబోకముందే పోవాలంటారు. కూలి మాత్రం రూపాయి తక్కువ ఇచ్చినా ఒప్పుకోరే. యాడ ఏగిసచ్చేది మీతో" అంటూ దండకం మొదలుబెట్టింది.

ఆమె మాటల్ని పట్టించుకోకుండా చకచకా పనిలోకి దిగింది యశోద.

ఆమెను అనుసరించింది గంగావతి.

ఇద్దరూ క్రషర్ దగ్గర కుప్పగా వున్న చెరకు పిప్పిని కొంచెంకొంచెంగా తట్టలకెత్తుకుని దూరంగా వెళ్ళి బీడుకయ్యిలో పోయసాగారు. ఆరు కాండ్ల చెరకుపిప్పిని ఆరబోసేసరికి గంటన్నరపైనే పట్టింది.

గంగావతికి బాగా ఆకలేస్తోంది. వచ్చేటప్పుడు తిని వద్దాం అంటే యశోద ఒప్పుకోలేదు. "ఇట్లా ఇంట్లో తింటూవుంటే సంపాదించే కూలి తిండికే సరిపోతుంది. ఎక్కడ పనికిబోతే అక్కడే తెల్లవార్తో మధ్యాహ్నమూ తినేయాలి. మంచివాళ్ళైతే రాత్రిపూట కూడా ఒక ముద్దవేస్తారు" అని చెప్పి పిలుచుకువచ్చేసింది.

ఆరబోయడం అవుతూనే గానుగదగ్గరికి పోయారిద్దరూ.

"పెనుం ఘాతాలకు వస్తోంది. పోయి గోరవెయ్యి. దించేసి సొనరుద్ధి, ముద్దలు పట్టేయండి చద్దులు తిందురుగానీ" అంది.

గంగావతికి నీరసంగా వుంది.

"ఒక రోజుకే ఇట్లా డీలాపడితే ఎట్లా. పోయి ఒక చెరకు తెచ్చుకొని తింటూ వుండు... పాకం ఆరగానే ముద్దలు పట్టేద్దాం' అంది యశోద.

ఇద్దరూ బెల్లం ముద్దలు పట్టసాగారు.

బెల్లంవాసన కమ్మగా వస్తోంది. రంగు తెల్లగా వుండడం, పాకం ముద్దలకు అనువుగా వుండడంతో వేగంగా ముద్దలు పట్టసాగారు. లడ్డుకంటే కొంచెం పెద్దసైజులో పట్టీ పట్టీ పక్కనే వున్న చెక్కలపై వరుసగా పెట్టసాగారు.

ముద్దలు పట్టడం అయిపోగానే లేచి వెళ్ళి చేతులు కడుక్కున్నారు. రెడ్డి భార్య ఏదో గొణుగుతూనే వాళ్ళ దోసిళ్ళలోకి చద్దిపోసింది. నంజుకోవడానికి చెరొక ఎర్రగడ్డ ఇచ్చింది. వాళ్ళు చద్ది తాగాక నీళ్ళు పోసింది. ఇద్దరూ చేతులు కడుక్కుని దోసిలిపట్టి నీళ్ళు తాగారు. మళ్ళీ పనిలోకి దిగారు.

తోటలోనుండి తెచ్చి పడేసిన చెరుకు నుండి ఆకును జివిరి, క్రషర్ దగ్గరికి విసరసాగారు.

బెల్లంసాగు దిగినప్పుడంతా వెళ్ళి ముద్దలు పట్టివస్తున్నారు. మధ్యాహ్నం సంగటొచ్చింది.

జిల్లేడాకులు కడిగి తెచ్చుకున్నారు. వాటిలో సంగటి పెట్టుకుని తిన్నారు. పది

నిమిషాలు వక్కాకు వేసుకుంటూ కూర్చున్నారో లేదో, పనిలోకి దిగండంటూ రెడ్డి భార్య తొందరపెట్టింది.

మంచి ఎండలో తలకు గుడ్డచుట్టుకుని పనిలోకి దిగారు.

గంగావతికి తెలియని వ్యవసాయపు పనులు ఏవీ లేవు. పదేళ్ళ వయసునుండే కూలికి పోవడం అలవాటయింది. అందుకే ఆమెను ఏడవ తరగతిలోనే చదువుకు స్వస్తి పలికించి సంపాదించడానికి పంపించారు ఆమె తల్లిదండ్రులు.

తనకు పెళ్ళి కుదిరిన నాటినుండి కూలికి పంపించడం మానిపించారు. అంతలో నిన్న సాయంత్రం తన భర్తతో జరిగిన సంభాషణ గుర్తొచ్చింది.

"చెప్పాలంటే నాకే ఇదిగా వుంది. నా గురించి నీకు తెలుసుగదా. నేను ఒక్కణ్ణే కష్టపడి సంపాదించి నిన్ను కూలికి పంపించకుండా సాక్కోగలను. అది నాకొక లెక్క గాదు. అయితే నాకష్టంమీద మా అమ్మా, అయ్యా కూడా బతకతావుండారు. మామిడి తోపులు కాపుకొచ్చినప్పుడు వాళ్ళు కూడా కావలిపనిచేస్తా వాళ్ళకు చేతనయినంతలో అంతో ఇంతో సంపాదిస్తానే వుండారనుకో అయినా అది యాడ సరిపోతుంది జెప్పు. అందుకే... అందుకే" అంటూ తల వంచుకుని నాన్చసాగాడు.

తనే అర్థంచేసుకుని "నేను రేపట్నుండి కూలికి వెళ్తాను" అంది. అతను ఆనందంతో ఉక్కిరిబిక్కిరై గభాలున తనను కౌగిలించుకుని చటుక్కున బుగ్గమీద ముద్దుపెట్టాడు. ఆ తరువాత అక్కడ వుండకుండా వెంటనే బయటకు వెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తన గుర్తుకురావడంతో నవ్వొచ్చింది.

"ఏం గంగావతీ నీలో నువ్వే నవ్వుకుంటున్నావు. ఏంది కథా?" అంది యశోద.

"ఏం లేదు" అంది సిగ్గుపడుతూ.

అలవాటయిన పని కావడంతో చకచకా ఆకు జివురుతున్నారు. సూర్యుడు నెమ్మదిగా పడమటివైపుకు వాలుతున్నాడు. గాలి సరిగా రాకపోవడంతో చెట్లన్నీ నీరసంగా కనిపిస్తున్నాయి. తోటలోనుండి చెరకు రావడం ఆగిపోవడంతో క్రమక్రమంగా ఆకు చెరగాల్సిన చెరకు తగ్గిపోతోంది.

ఆమాటా, ఈమాటా చెబుతున్న యశోద టక్కున నిలిపేసి "అద్దో... ఆడ వస్తాండాడు చూడు. ఆయనే నాగేసురెడ్డి. ఈయమ్మ మొగుడు. వీళ్ళకు ఈ బాయి కింద పదెకరాలు, మిట్టకింద బాయికాడ ఐదెకరాలు, ఆ పెద్దకొండకింద ఎనిమిదెకరాల తోపు వుండాయి" అంది.

గంగావతి, యశోద చూపించినవైపుగా పరిశీలనగా చూసింది.

దూరంగా, హుందాగా గెనుము మీదవస్తున్న - భారీ ఆకారం కనిపించింది. తెల్ల పంచె, తెల్లచొక్కా వేసుకుని వున్నాడు. వయసు నలభై దాటుంటుంది. మనిషి నల్లగా వుండి మొరటుగా కనిపిస్తున్నాడు.

అతను గానుగ దగ్గరికి రాగానే అతని భార్య పూనకమొచ్చినట్లుగా వూగిపోయింది. "వస్తాండాడు చూడమ్మా మొగాడు నీలుక్కుని. ఒక ఆడది ఇన్ని పనులు జేపిస్తావుంటే కొంచెమైనా పట్టించుకోకుండా ఆ కాయితాలాటకు బోయి ఇప్పుడొస్తాండాడు" అంటూ మండిపడింది.

"అప్పుడే సోది మొదలుబెట్టివా" అన్నాడు రెడ్డి అవన్నీ తనకలవాటే అన్నట్లుగా.

"ఏందీ... నేను జెప్పేది నీకు సోది మాదిరిగా వుందా" కరచినట్లుగా అరిచింది.

"సరే...సరే... నీతో పోట్లాడి నేను గెలవలేనుగానీ, నువ్వు ఇంటికిపో. నేను జూసుకుంటా"

ఆమె ఏదో గొణుగుతూనే తట్టాబుట్టా సర్దుకుని వెళ్ళిపోయింది.

అప్పుడు చూశాడు అతను గంగావతిని.

అతని కళ్ళు మెరిశాయి.

"ఎవరుమేయ్ యశోదా కొత్తగా వుంది"

"అదే... మీ మేకలు మేపతాండ్లా భూలోకదు, వాని పెండ్లాము"

"ఓహో! మొన్న భూలోకదు పెండ్లిజేసుకునింది ఈ బిడ్డినేనా...

"ఏమ్మేయ్! నీ పేరేంది"

"గంగావతి"

"నీకు అన్ని పనులూ వస్తాయా?" అన్నాడు ద్వంద్వార్థంలో. అందులో రెండో అర్థం యశోదకు అర్థమయ్యింది కానీ గంగావతికి అర్థం కాలేదు.

వచ్చు అన్నట్లుగా తలాడించింది.

అతని చూపులు ఆమె శరీరాన్నంతా ఒకసారి తడిమిచూశాయి.

'ఫరవాలేదు' అనుకున్నాడు.

"చెరుకాకు చెరిగేది అయిపోవచ్చింది. మిగిలుండేది యశోద చెరిగేస్తుంది కానీ, నువ్వు బోయి తోటలో సోగలుకొట్టు ఆవులకు వేయాల" అన్నాడు. యశోదకు ఏదో అర్థమయ్యింది. అయినా ఏమీ అర్థంకానట్లే తనపని తాను చేసుకోసాగింది.

కత్తి తీసుకుని తోటవైపు నడిచింది గంగావతి.

సోగలు కొడుతుంటే వచ్చి "ఈ పక్క చాలు, ఆ పక్కనుండి కొట్టు" అన్నాడు.

ఎవరైనా తోటను ఒకవైపునుండి కొట్టడం మొదలుపెట్టాక, మధ్యలో మరోవైపునుండి కొట్టరు. కానీ ఈయనేమిటి. వింతమనిషిలాగున్నాడే అనుకుంటూ తోట వెనుకవైపుకు వెళ్ళింది.

ఆమె నిలుచున్న చోటుకు అవతలివారెవరూ కనిపించరు.

చుట్టూ తోటలుండడంవలన ఆమె కూడా ఎవరికీ కనిపించదు.

చకచకా సోగలు కొట్టడం ప్రారంభించింది.

చెరుకులు బాగా బలిసివుండడంతో వేటుకొక సోగ వేరవుతోంది. పని త్వరగా అవుతోంది.

అప్పుడు జరిగిందది.

ఎప్పుడొచ్చాడో ఏమో వెనుకగా వచ్చి ఆమెను గట్టిగా కౌగిలించుకున్నాడు రెడ్డి.

గంగావతి అదిరిపడింది. వళ్ళంతా ఒక్కసారిగా జలదరించడంతో ఆమె తత్తరపడింది. ఆమె చేతిలోని కత్తి జారి కిందపడింది. ఏం జరుగుతోందో తెలుసుకుని, తేరుకుని గట్టిగా అరవబోయింది.

నోరు నొక్కేశాడు. ఆమె గింజుకోసాగింది.

గంగావతిలాంటి వాళ్ళను ఎంతోమందిని చూసినట్లుగా నిర్భయంగా తన పని తాను చేసుకుపోతున్నాడు అతను.

దున్నపోతు వచ్చి మీదపడ్డట్లుగా విలవిలలాడిపోతోంది.

అతను ఆమె నోటిని ఒకచేత్తో మూసిపెట్టి, మరోచేత్తో ఎక్కడెక్కడో తడుముతున్నాడు.

ఆమె తన చేతులతో అతని చేష్టల్ని అడ్డుకునేందుకు విశ్వప్రయత్నం చేస్తోంది.

అతను తన కాలితో ఆమె మోకాళ్ళ వెనుక అదిమిపెట్టి ఆమెను వెనక్కినెట్టి కిందపడవేశాడు.

ధబ్‌మని ఆమె కాలవలో పడింది.

చేతితో ఆమె నోటిని మూసివుంచే, ఆబగా ఆమెపైకి వాలాడు.

అంతటి భారీకాయం మీదపడేసరికి ఆమె 'అమ్మా' అంది. ఆ మాట కూడా గొంతు దాటి బయటకు రాలేదు.

కొంగు పక్కకు లాగేశాడు. ఎగసిపడుతున్న పరువాలు చూసి అతని కళ్ళు చెదరిపోయాయి.

ఆమె ముఖంపై ఆత్రంగా ముద్దులు పెట్టసాగాడు. ఆమె చీర కొద్దికొద్దిగా పైకి జరుగుతోంది.

ఆమె తన చేతులతో అతని జుట్టుపట్టుకుని గట్టిగా గుంజసాగింది. అతనికి మంట పుట్టి ఆమె చేతుల్ని పట్టి విసిరికొట్టాడు.

ఆమె చేతులు వెళ్ళి చెరకుగడలకు బలంగా తగిలాయి. చేతులు విపరీతంగా

బాధపెట్టాయి.

అప్పుడొచ్చిందా ఆలోచన ఆమెకు. ధైర్యాన్ని కూడదీసుకుంది. చేతిని జరిపింది. తగిలిన చెరకుగడను పట్టుకుని గట్టిగా లాగింది. 'ఫట్'మంటూ విరిగిందది.

చెరకుగడ బాగా, లావుగా గట్టిగా వుంది. అంతే! ఒక దెబ్బ వేసింది తలపైన.

అతను అరిచిన అరుపుకు అంతదూరంలో కరెంటుతీగపై కూర్చుని వున్న పక్షులన్నీ బెదరి, కకావికలై ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరాయి.

★ ★ ★

సంజె సిగ్గుబడ్డ కుర్రదానిలా వుంది.

అటూ ఇటూ వూగుతూ వెళ్ళిపోతున్న సూర్యునికి చివరి వీడ్కోలు చెబుతున్నాయి చెట్లు. పక్షులన్నీ తిరుగుప్రయాణంలో కోలాహలపడుతున్నాయి.

అదిలించాల్సిన పనిలేకుండానే మేకలు ఇంటిముఖం పట్టాయి. గుండుమీద పడుకునివున్న భూలోకడు లేచి తలకింద వుంచుకున్న తువాలును విదిల్చి భుజాన వేసుకున్నాడు. చిక్కాన్ని భుజాన తగిలించుకుని నెమ్మదిగా మేకల వెనుక నడవసాగాడు.

అతను ఇల్లు చేరేసరికి చీకట్లు బాగా ముసురుకున్నాయి. మేకలన్నిటినీ దొడ్లోకి తోలి, అలసటగా ఇంట్లోకి వెళ్ళాడు.

ఇంటిలోని వాతావరణం అసహజంగా కనిపించింది. మనసు ఏదో కీడును శంకించింది.

చలాకీగా పనిచేస్తూ కనిపించే గంగావతి ఒకమూలగా దొంతులకు ఆనుకుని కూర్చుని వుంది. మొహం బాగా ఏడ్చినట్లు వాచిపోయివుంది. కళ్ళు ఉబ్బి వున్నాయి.

తండ్రి నట్టింట కూర్చుని ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

తల్లి దిగులుగా పొయ్యిముందు కూర్చుని వుంది.

ఎవరూ తనను పలకరించకపోగా, కనీసం తనకేసి చూడకపోవడం భూలోకనికి భయాన్ని కలిగించింది.

ఏం జరిగిందని అడగడానికి కూడా సంకోచించాడు. నెమ్మదిగా వెళ్ళి భుజానికి వున్న చిక్కాన్ని తీసి దండెంకు తగిలించాడు. ఎవరన్నా చెబుతారేమోనని చూశాడు. ఇక తట్టుకోలేక,

"ఏమ్మా! ఏం జరిగింది? " అన్నాడు తల్లికేసి చూస్తూ.

అప్పటిదాకా బిగబట్టుకుందేమో, ఇక ఆగలేనట్లుగా "కూలికి వస్తారని చులకన నాభొట్లకు. కావరమెక్కి కనిపించినదాన్నంతా అనుభవించాలని చూస్తారు ముండనాబట్టలు. పురుగులు పడిచస్తారు. వాడి పెండ్లాం తాడు తెగనాని" అంది ఆవేశంగా తిడుతూ.

అర్థం కాకపోవడానికి అక్కడేమీ లేదు. అయినా అడిగాడు.

"ఏంది మా నువ్వు చెప్పేది? "

"ఇంకా అర్థం కాలేదురా. ఆ నాగేసురెడ్డిగాడు నీ పెండ్లాన్ని చెరచబోయాడు" అన్నాడు భూలోకడి తండ్రి గొంతులో అసహ్యం ధ్వనిస్తుండగా.

నిలువునా కుప్పకూలిపోయాడు భూలోకడు.

కంటికి నదురుగా కనిపిస్తే చాలు. వీళ్ళు ఏ ఆడదాన్నీ వదలరు. పనిమనిషి పెళ్ళామని కూడా చూడకుండా చెరచబోయాడంటే... భూలోకడి ఆలోచనలు ఆగిపోతున్నాయి.

తనేం చేయగలడో, ఏమిచేయాలో అర్థం కావడంలేదు.

జరిగిన విషయాన్నయితే పరుగెత్తుకుంటూ వచ్చి అత్తామామలకు చెప్పేసింది. కానీ ఇప్పుడు ఏం జరుగుతుందో, భర్త ఎలా ప్రవర్తిస్తాడో అర్థంకాక అయోమయంగా వుంది గంగావతికి.

రెడ్డి బలాత్కరించినప్పుడు కలిగిన భయంకంటే ఇంట్లో ఎవరూ మాట్లాడకపోవడంతో ఏర్పడిన నిశ్శబ్దం ఆమెను ఎక్కు

వగా భయపెడుతోంది. భూలోకడి తల్లి కోడలి భయాన్ని కనిపెట్టింది. కోడలికి ధైర్యం చెప్పాలన్న ఉద్దేశంతో "ఆ లం...కొడుకులు అంతేనమ్మా. ఈ వూర్లో ఏ ఆడదాన్నీ మానంతో బతకనీయరు. వీళ్ళకన్నా బసివిగొడ్లు మేలు. వాళ్ళని నమ్ముకుబతికే మనలాంటోళ్ళం వాళ్ళని ఏమీ చేయలేమమ్మా" అంది.

"మనం ఏంజేస్తామన్నది కాదు సమస్య. మనల్ని ఆ రెడ్డి ఏం జేయబోతున్నాడనేది సమస్య" అన్నాడు అంతసేపు నిశ్శబ్దంగా వున్న భూలోకడి తండ్రి.

మిగతా ముగ్గురూ ఆయనకేసి వింతగా చూశారు.

"అవునురా. ఇంత జరిగాక ఆ రెడ్డి మనల్ని వూరికే యిడిసిపెట్టడు. వాడు బలాత్కరించాడు. నీ పెండ్లాం ఆ రెడ్డికి లొంగలేదు సరే. వాణ్ణి కొట్టి తప్పించుకువచ్చేసింది. అంతవరకే జరిగుంటే సరిపోయేదే. కానీ నీ పెండ్లాం వస్తా... వస్తా... ఏడ్చుకుంటూ వచ్చింది. అడిగిన వాళ్ళకంతా ఆ యశోద పూస గుచ్చినట్లు చెప్పింది. ఇప్పుడు ఈ సంగతి వూరందరికీ తెలిసిపోయింది. ఆయన పరువు పోయింది. ఆ పరువు తీసిన వాళ్ళని వూరికే ఎట్లా వదిలిపెడతారు. నాకు వీళ్ళను గురించి ఎన్నో ఏళ్ళుగా తెలుసు. ఎవరెవరు ఎంతెంతమందిని బలాత్కారం చేశారో తెలుసు. వాళ్ళందరూ కుక్కిన పేనుల్లాగా మూసుకుని పడున్నారు. ఆయన దగ్గరే పనిచేసుకుంటున్నారు. కాదూకూడదన్నవాళ్ళకు నిలువ నీడ లేకుండా చేశారు" అన్నాడు తన అనుభవాన్నుంచి చెబుతూ. వాడు బలాత్కారం చేయడం తప్పు కాదు! తను ఏడుస్తూ రావడం తప్పు!! గంగావతికి వికారంగా అనిపించింది.

భూలోకడి కళ్ళు వర్షిస్తున్నాయి.

"ఇప్పుడేం చేద్దాం..." అని అడుగుదామనుకుంటుండగానే వేగంగా లోపలికి వచ్చాడొక వ్యక్తి. అతను భూలోకడి మిత్రుడు మునుస్వామి. అతను రా[illegible]ం రావడంతోనే "రేయ్... భూలోకా . నీ పని అయిపోయిందిరా... నవ్వు నాలుగు మేకల్ని తనకు తెలియకుండా అమ్మేశావని రేపు పంచాయతీ పెట్టించబోతున్నాడురా రెడ్డి" అన్నాడు ఆందోళనగా.

అందరి గుండెల్లోనూ రాళ్ళు పడ్డాయి ఆ మాట వినగానే.

"అయిపోయింది. అనుకున్నదంతా అయిపోయింది. ఇంక మన బతుకులు తెల్లారినట్లే" అన్నాడు కంగారుగా భూలోకడి తండ్రి.

భూలోకడికి కూడా తెలుసు. అంతా వాళ్ళే వుండే పంచాయితీలో తక్కువ కులాలోళ్ళు ఏం చెప్పినా చెల్లదు. ఒక రెడ్డి కాకిని కోకిలని చెప్పినా, కోకిలను కాకి అని చెప్పినా మిగతావారంతా దానికి వత్తాసు పలుకుతారు.

"రేపు ఏం తప్పేస్తారో" అన్నాడు తనకు విధించబోయే శిక్షను తలచుకుంటూ.

"పంచాయితీ పెట్టి తప్పు వేసేది రెండో కథ. తన పరువు తీసిన నీ పెళ్ళాన్ని 'దానెమ్మా దాన్ని వదులుతానా' అంటూ ఆ నాగేసురెడ్డి శపథాలు చేస్తూ వుంటే విన్నా. ముందు దాని కథ చూడు" అన్నాడు మునుస్వామి.

మనసులో ఎవరో శూలాలతో గుచ్చినట్లు బాధపడ్డాడు భూలోకడు. ఏం చేయాలో, ఎలా చేయాలో ఎవరికీ అర్థం కావడంలేదు.

అప్పుడు లేచాడు మునుస్వామి.

"రేయ్ భూలోకా... నాతో రారా" అని చెప్పి బయటకు తీసుకుపోయాడు. భూలోకడి తండ్రి కూడా ఏదో పని వున్నట్లు లేచి బయటకు వెళ్ళిపోయాడు. ఏదో చెప్పాలని అంతసేపూ చూస్తున్న భూలోకడి తల్లి నోరు విప్పింది.

"చూడమ్మా గంగా... నాకు ఆడపిల్లకాయలు లేరు. నువ్వు కోడలుగా వచ్చినా



నేను కూతురులాగానే చూసుకున్నాను. నేనిట్లా చెబుతున్నానని ఏమీ అనుకోవద్దు. ఈ వూర్లోనే కాదు, ఏ వూర్లోనైనా భూములు మస్తుగా వుండే ప్రతివాడూ ఇట్లాగే చేస్తుం టారమ్మా. మనం మాలోళ్లమనీ, అంటు కుంటే మైలపడిపోతామని చెప్పేవాళ్ళే. మాలకులంలో పుట్టిన ఆడవాళ్ళనే బలా త్కారం చేస్తారు. అప్పుడు కనిపించదు వాళ్ళకు అంటు. ఈ మాలపల్లిలో పెళ్ళ యిన ప్రతి ఆడదీ ఏదో ఒక కామందుకింద పడుకున్న మనిషే. ఏ కామందు ఎవరెవర్ని బలాత్కారం చేశాడో లెక్కజెప్పమంటే చెబు తాను" అంది.

గంగావతి నిలువుగుడ్లేసుకుని వింటోంది.

ఆమె చెప్పడం కొనసాగించింది.

"నేను చెప్పకూడదనుకున్నానుగానీ నిన్ను చూస్తావుంటే దాచుకోవాలనిపించడంలేదు. నన్ను కూడా ఇదే నాగేసురెడ్డి బలాత్కారం చేశాడు. అప్పటికి నాగేసురెడ్డికి పెండ్లి కూడా కాలేదు. కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది. ఇలాంటివన్నీ అల్లరి చేసుకుంటే నష్టం మనకే. ఆ రెడ్లకు లొంగ కపోతే మన మానాన మనల్ని బతకని వ్వరు" అంది.

అత్తమీద గౌరవమున్నా, ఆమె చెప్పిన మాటలు మాత్రం ఎందుకో రుచించలేదు. పైగా కోపంగా, ఆవేశంగా ఏదో తిట్టాలని, చెప్పాలనీ అనిపిస్తోంది. అవన్నీ చెప్పడంవ లన ప్రయోజనం లేదనిపించడంతో నిశ్శ బ్దంగా వుండిపోయింది గంగావతి.

అంతలో భూలోకడు, మునుస్వామి వచ్చారు. వాళ్ళొచ్చిన కొంతసేపటికి భూలో కడి తండ్రి వచ్చాడు.

అప్పటికి అర్ధరాత్రి దాటుతోంది.

భూలోకడికి ఇష్టం లేకపోయినా అంతకు మించి దారిలేకపోవడంతో మిత్రుడు చెప్పిన మార్గాన్నే అనుసరించదలచుకున్నాడు.



ఆ మాటే ఇంటిలో చెప్పాడు.

భూలోకడి తల్లి చిన్నగా ఏడుపు మొదలు పెట్టింది.

"ఛత్... వూరుకోఏహే" అన్నాడు భూలోకడి తండ్రి.

గంగావతి గబగబా బట్టలు సర్దసాగింది.

భూలోకడు అంతరాత్రిపూట ఎక్కడెక్కడ తిరిగాడో, ఎందర్ని నిద్రలేపి అడిగాడో, ఏమి చెప్పి తీసుకువచ్చాడోగానీ కొంత మొత్తాన్ని అప్పు పుట్టించగలిగాడు.

భూలోకడి తల్లీ, తండ్రి, మిత్రుడు కన్నీళ్లతో వీడ్కోలు పలికారు. భూలోకడు, గంగావతిలు తూర్పుదిశగా నడక మొదలుపెట్టారు. తెల్లారేసరికి వారిద్దరూ వేగంగా వెళుతున్న బస్సులో వున్నారు.

ఆ బస్సు గుడివేపుగా వెళుతోంది.

★ ★ ★

పట్టణ నాగరికతలో చేదువాసనలకు రూపంగా, కొండకిందగా వుంది ఆ కాలనీ. కరెంటు, తాగునీరు, రోడ్లు, బస్సు వంటి ప్రాథమిక సౌకర్యాలు కూడా లేవు. అన్నీ పూరిగుడిసెలే. అక్కడ నివశించేవాళ్లంతా ఏ పూటకాపూట సంపాదించి పొట్టపోసుకునే కూలీలే.

కాలనీ మధ్యలోనే అక్కడక్కడా ముళ్లపొదలు, పెద్ద పెద్ద చెట్లు వున్నాయి. ఆ కాలనీ పేరు జీవకోన.

ఆ కాలనీలోని ఓ పూరిగుడిసెనుండి ఆగి ఆగి వెక్కిళ్లు వినబడుతున్నాయి. ఆ వెక్కిళ్లు గంగావతివి.

ఆమెకు ఇంకా ఏడవాలని వుంది. గట్టిగా భోరుమని ఏడవాలని వుంది. తన బాధని కనీసం కళ్ళద్వారా అయినా కన్నీటిరూపంలో వెళ్ళగక్కాలని వుంది. అప్పటికే కళ్ళు బాగా అలసిపోయివున్నాయి. ఇక తమలో కార్చడానికి నీళ్ళులేనట్లు అవి నిబిడార్చుకుపోతున్నాయి.

ఇంతలో భూలోకడు వచ్చాడు.

ఒక్కసారిగా ఆమెలోని బాధ కట్టలు తెంచుకుంది.

ఉదయం పనికోసం నాలుగుకాళ్ళ మండపం దగ్గరకు వెళ్ళినప్పటినుండి రాజా రెడ్డి బలాత్కారం చేయబోయిన సంఘటన వరకు... అన్నీ ఒక్కసారిగా చెప్పేయాలని నోరు తెరిచింది.

లోపలికి వచ్చిన భూలోకడు గంగావతిని చూశాడుగానీ, పరిశీలనగా చూడలేదు.

"అరెరె... బీడికట్ట కొనుక్కుని రావడం మరిచిపోయాను. చీకటిపడుతోంది. ఇప్పుడే వచ్చేస్తా వుండు" అంటూ వచ్చినదానికంటే వేగంగా బయటకు వెళ్ళిపోయాడు.

కొండలపైనుండి దూకడానికి ఉధృతంగా వచ్చిన ప్రవాహం, కొండ అంచుననే నిలిచి పోవాల్సివచ్చినప్పుడు ఆ ప్రవాహం పరిస్థితి ఎలా వుంటుందో అలా అయ్యింది ఆమె పరిస్థితి.

తీరాన్ని తాకాలని వేగంగా ఎగిసిపడిన తరంగానికి, తీరం లేకపోవడంతో వెనుదిరిగి సుడిగుండమైనట్లు ఆమె మనసులోని భావాలు చుట్టుముట్టి ఆమెను పిచ్చిదాన్ని చేశాయి.

ఆ బాధను తట్టుకోలేక తలను గోడకేసి బద్దలు కొట్టుకోవాలనిపించింది ఆమెకు.

చివరకు నాలోని బాధను చెప్పుకోవడానికి కూడా మనిషిని లేకుండా చేశావా... ఓ దేవుడా! నువ్వెంత కఠినాత్ముడవయ్యా. నేనేం పాపం చేశానని నాకీ శిక్ష వేశావు?

పల్లెలో కనీసం అత్తామామలైనా వున్నారు.

ఏమీ చేయలేకపోయినా విన్నారు, తన గురించి ఆలోచించారు. బాధపడ్డారు. తన బాధను పంచుకున్నారు.

ఇక్కడ తనకెవరున్నారు? వున్న ఒకే ఒక వ్యక్తికి చెప్పుకుందామంటే...

....

అవునూ... చెప్పి ఏం లాభం?

మొదట బాధపడతాడు. తరువాత...?

పల్లెలో జరిగితే పట్నానికి తీసుకువచ్చాడు. ఇక్కడ జరిగితే...?

మరో వూరికి తీసుకెళతాడా?

అక్కడ ఇలాంటి వాళ్లు వుండరనీ; ఇలాంటివి జరగవనీ నమ్మకం ఏమిటి?

అయినా సమస్య వస్తే పారిపోవడమే మార్గమా?

కాదని గట్టిగా అనిపించింది.

భర్తకు చెప్పడం అనవసరం. చెప్పి సాధించేది ఏమీలేదు.

బోడి... ఇంత పెద్ద పట్నంలో రాజారెడ్డి పనివ్వకపోతే ఇంకొకడిస్తాడు.

ఆమెలో విశ్వాసం వూపిరులు పోసుకుంది. ధైర్యం చిక్కబడింది.

లేచి పొయ్యి వెలిగించింది.

★ ★ ★

"పార్వతీ... ఒసేయ్ పార్వతీ..." అంటూ ఇంటిలోకి వచ్చాడు చెంగయ్య.

తను పిలుస్తున్నా వినబడనట్లుగా తన పని తాను చేసుకుపోతున్న భార్యను చూసి చెంగయ్యకు కోపం వచ్చింది.

"నీ నోటికేమొచ్చిందే ధూము. ఇంత మనిషిని మాట్లాడతావుంటే బెల్లంకొట్టిన రాయిలాగా నిల్చుండావు"

"నీకేం రోగం వచ్చిందని అట్లా లబలబలాడతాండావు" అంటూ విరుచుకుపడింది పార్వతమ్మ.

ఆ మాటల్లోని ఘాటుకు కొంత తగ్గాడు చెంగయ్య.

"ఏంలేదూ... ఈ పొద్దు పండగకదా. పాయసం చేసినావా, లేదా?" అడిగాడు గొంతు తగ్గిస్తూ.

"సంపాదించీ సంపాదించీ ఈడ వుడ్డేసిండావు. దాంతో పాయసాలు, వడలు, బజ్జీలు, బోండాలు, అరిసెలు అన్ని చేసి పెట్టిండా తిందువురా" వ్యంగ్యంగా అంది పార్వతమ్మ.

"నేను మనూర్లోనే వుండుంటే నా సత్తా చూపించివుందును. మనల్ని పల్లెలో వుండ

నీకుండా ఈ పట్నానికి తీసుకొచ్చినాడు నీ కొడుకు. ఈడ బండెడు కష్టంజేస్తే మింగమెతుకుకు సరిపోయే కూలీరాదు. అయినా నేనంటే చదువుకోలేదు. కాబట్టి నువ్వన్నట్లు వుడ్డలు వుడ్డలు సంపాదించలేదు. నీ కొడుక్కేం? డిగ్రీలు జదివినాడు కదా. ఏం వెలగబెడతాండాడో చెప్పు" అన్నాడు తప్పంతా తనదికాదని నిరూపించుకో జూస్తూ.

"మిద్దిపైన వాడుండాడు. వింటే బాధపడ తాడు. కొంచెం నెమ్మదిగా మాట్లాడు"

"వింటే విన్నీలే! పల్లెలో బతకలేమని జెప్పి ఈడేదో ఉద్ధరించేసేవాడి మాదిరిగా మనల్ని పిల్చికొచ్చినాడు. వాడికొచ్చేది రెండు వేలయినా ఈ కాసంత కొంపకే ఎనిమిదివం దలు బాడుగ కట్టాల్నా.

మిగిలింది బియ్యానికి, కూరగాయలకు, పాలుకు ఇట్లా ఎన్నిటికని సరిపోతుంది. ఈడకి వచ్చి అప్పుడే సంవత్సరమైపోతా వుంది. ఇంతవరకు కొత్త గుడ్డపేలికలన్న మాటేలేదు" అన్నాడు.

"నువ్వు సంపాదించేది ఆ తాగుడికి తగలెయ్యకపోతే వేడినీళ్ళకు చన్నీళ్ళన్నట్లు మిగలబెట్టి గుడ్డలు కొనుక్కోవచ్చుకదా! పొద్దుగూకులూ వాడేదో సంపాదించి నీ యదాన వెయ్యలేదని ఒకటే నస పెడతావెం దుకు"

"వీనిది సంపాదించే మొఖంగాదే! ఆ దేవస్థానం ఆఫీసరు మనకు షాపు ఇస్తానంటే వద్దనేసి వచ్చినాడంట. మెడమీద తలకాయ వుండే ముండ ఎవుడైనా ఇట్లా అదృష్టం తలుపు తడితే మోకాలు అడ్డం పెడతాడా"

ఆ మాటలు విన్న పార్వతమ్మ ఆశ్చర్యంగా నోరు తెరచి అలాగే వుండిపోయింది.

చెంగయ్య చెప్పుకుంటూపోయాడు.

"అవునే. దీపం వుండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్నారే పెద్దోళ్లు. పెద్దోళ్లు పిలిచి తీసుకోరా అంటే ఈయనేదో మిగిలి గెడ్డన పడిపోయిన మారాజులాగా బడాయిబట్టి వచ్చినాడంట. నువ్వైనా చెప్పు ఇప్పటికైనా వెళ్ళి ఆ షాపు తీసుకొమ్మని. అది తీసుకుంటే దర్జాగా కాలుమీద కాలేసుకుని బతికేయచ్చు గుడి దగ్గర్లో వ్యాపారం అంటే మాటలా"

షాపు పెట్టుకుని వ్యాపారం కళకళలాడుతూ తామంతా ఆనందంతో వున్నట్లు వూహలు వచ్చినా అంతలోనే తేరుకుని "ఆ మాటేదో నువ్వే వెళ్ళి చెప్పు. ఆ పైనుండాడు" అంది పార్వతమ్మ తెలివిగా. తల్లిదండ్రుల మాటలన్నీ మిద్దిపైనున్న మురళికి వినబడుతూనే వున్నాయి.

తనకొచ్చి చెప్పేంత ధైర్యం తండ్రికి లేదని తెలిసి విరక్తిగా నవ్వుకున్నాడు. ఒకవేళ అడిగితే మాత్రం తనేమి సమాధానం చెప్పగలడు. అది లంచంగా ఇస్తున్నారు కాబట్టి తీసుకోలేదని చెప్పాలా? కార్మికుల కడుపుకొట్టబోతున్న వైనం బయటపెట్టకుండా వుండడానికి ఇస్తామన్నారనీ, అందుకే తను తీసుకోలేదని చెప్పాలా?

అయినా తనిప్పుడు తీసుకోవాలన్నా ఆ అవకాశం లేదుకదా!

మురళి ఆలోచనలు వెనుకకు పరుగులు తీశాయి.

"ప్రైవేటుపరం కానున్న దేవస్థానం" అన్న వార్తను ప్రచురితం కాకుండా అడ్డుకోబోతున్నారని తెలిసి నేరుగా ఎడిషన్ ఆఫీసుకు వెళ్ళి డెస్క్ ఇంఛార్జిని కలిసి విషయం తెలియజేశాడు. ఎందుకైనా మంచిదని న్యూస్ ఎడిటర్‌ని కలిసి ఆ వార్తను ఎన్ని ఒత్తిళ్లు వచ్చినా ఖచ్చితంగా పబ్లిష్ చేయాలని చెప్పాడు.

న్యూస్ ఎడిటర్ హామీ ఇచ్చినా, సందేహం వదలక ఆపరేటర్‌చేత వార్తను కంప్యూటర్‌కు ఎక్కించి, పేజ్‌మేకర్‌చేత దగ్గరుండి పెద్ద అక్షరాలతో, మంచి ఫాంట్‌లో హెడ్డింగ్ పెట్టించి బాక్స్ వేయించి, ప్రింటవుట్ తీయించివచ్చాడు. ఎన్ని జాగ్రత్తలు

తీసుకున్నా ఫలితం శూన్యం. మరుసటిరోజు పేపర్‌లో ఆ వార్త లేదు.

రాత్రికిరాత్రే జరగాల్సినవి జరిగిపోయాయి.

ఒకప్పుడు పత్రికలు ఒక లక్ష్యంకోసం, ఒక ధ్యేయంతో సమాజ హితాన్ని కోరుతూ నడిపేవారు. ఆ పత్రిక యజమానులు కూడా సేవాతత్పరత కలిగివుండి, ఏ వార్త వేయాలి, ఏ వార్త వేయకూడదు అన్న విషయాలపై స్పష్టంగా అవగాహనను కలిగివుండేవారు. కానీ ప్రేమలు, స్నేహాలు, బంధుత్వాలు, అభిమానాలూ అన్నీ... అన్నీ డబ్బుతో ముడిపడిపోతూ, వ్యాపారాత్మకంగా మారిపోతున్న నేటిరోజుల్లో పత్రికలను కూడా వ్యాపారం కోసమే నడుపుతున్నారు. 'తామెంత సంపాదించుకోగలం' అన్నదే ధ్యేయంగా డబ్బులిస్తామంటే ఏ వార్తనైనా ప్రచురిస్తున్నారు. ఏ వార్తనైనా తొలగిస్తున్నారు. హోదాని, పరపతిని పెంచుకోవడానికో, ఎవరిమీదనో కక్ష తీర్చుకోవడానికో, పత్రికలు నడిపేవారికి నైతిక విలువలతో ఏంపని?

వివిధ ప్రభుత్వశాఖలు ప్రతి సంవత్సరం అనేక లక్షల రూపాయల అడ్వర్టైజ్‌మెంట్‌లను విడుదల చేస్తుంటాయి. అలాగే దేవస్థానం కూడా అడ్వర్టైజ్‌మెంట్‌లకు ఏటా లక్షల రూపాయలు కేటాయిస్తోంది. ఈ అడ్వర్టైజ్‌మెంట్‌లు పాలకుల ఫోన్‌కాల్‌తో ఒక పేపర్‌నుండి మరొక పేపర్‌కు జంప్‌చేస్తుంటాయి. కాబట్టి పాలకులకు ఇష్టంలేని వార్తలు, బాధపెట్టే వార్తలు, మరీ ముఖ్యంగా వారు వద్దని చెప్పిన వార్తలు వేసి యాడ్‌లను పోగొట్టుకోవడానికి ఏ యాజమాన్యమూ సిద్ధపడదు. ఇప్పుడు కూడా అదే జరిగింది.

అన్నీ తెలిసినా బాధగానే వుంది. కసిగానే వుంది.

తన వార్త ప్రచురితం కాకపోవడం ఒక ఎత్తైతే తనను ఆ మరుసటిరోజే దేవాలయాల బదులు రెవిన్యూశాఖను కవర్ చేయమనడం మరింత బాధ పెట్టింది.

ప్రభుత్వంలో వివిధశాఖలకు వివిధ మంత్రులున్నట్లుగా తిరుపతి, విజయవాడ, విశాఖపట్టణం, హైదరాబాద్‌వంటి నగరాల్లో యూనివర్శిటీలు చూడడానికి ఒక విలేకరి, రెవిన్యూ, రైల్వేశాఖలు చూసేందుకు ఒక విలేకరి, టెలీకం, మున్సిపాలిటీ, పట్టణాభివృద్ధి సంస్థలు (తుడా,వుడా, హుడాలు) చూడడానికి ఒకరిని... ఈవిధంగా నియమిస్తారు.

తను ఏ శాఖలోనైనా సునాయాసంగా చొచ్చుకుపోగలడు. తనకున్న చొరవ, పట్టుదల, రాసే తీరు చూసే అతి తక్కువ కాలంలోనే ఛీఫ్ రిపోర్టర్లు చూసే దేవస్థానాన్ని తనకు అప్పగించారు. తను కూడా వాళ్ళ అంచనాల్ని నిజంచేస్తూ మంచిమంచి వార్తలు రాసి పేపర్ క్రెడిబిలిటీని పెంచాడు.

తనను వేరేశాఖకు బదిలీచేసినందుకు బాధలేదు. కానీ ఒక కుట్రను బయటపెట్టబోయినందుకూ, ఒక మంచి పని చేయబోయినందుకు, కార్మికుల పక్షాన నిలిచినందుకూ, ఇంకా పచ్చిగా చెప్పాలంటే లంచం తీసుకోనందుకూ తనను బదిలీచేసి అన్యాయాన్నీ, అవినీతినీ గెలిపించినందుకు బాధగా వుంది.

నిన్న న్యూస్ ఎడిటర్ పిలిచి "నువ్వింక దేవస్థానాల్ని చూడనక్కరలేదు. దాన్ని మన బ్యూరో ఛీఫ్ చూస్తారు. నువ్వు రెవిన్యూ చూడు" అని చెప్పినప్పటినుండి మనసు మనసులో లేదు.

డ్యూటీకి వెళ్ళాలనిపించక ఇంటివద్దే వుండిపోయాడు.

"నువ్వేం తప్పు చేయలేదు. నువ్వు బాధపడవద్దు" అని మనసుకు ఎంత చెప్పినా అది వినడంలేదు.

అది దిగులుపడుతోంది. బాధపడుతోంది. మూగగా రోదిస్తోంది.

"నీ నిజాయితీకి, సమర్థతకు బహుమానం బదిలీ" అంటూ కసిని రేపుతోంది.

నిస్పృహాయుడికి కసి ఆవేదనని మిగులుస్తుంది.

మురళీకి గట్టిగా ఏడవాలనిపించింది.

ఇది అన్యాయం... ఇది అక్రమం. దారుణం... అని గొంతెత్తి పట్టణమంతా వినిపించేలా గొంతు చించుకుని అరవాలనిపించింది.




గుడికి ఉత్తరంవైపు వీధి మధ్యలో వున్న పురాతన కాలపు భవనంలో ఉంది ప్రెస్‌క్లబ్.

చాలాకాలంనుండి కొత్త భవనాన్ని నిర్మించాలని ప్రయత్నాలైతే జరుగుతున్నాయి కానీ జర్నలిస్టు యూనియన్ నాయకులకు 'చిల్లర' పనులు ఎక్కువైపోవడంతో అది ఆలస్యమవుతోంది. ప్రెస్‌క్లబ్‌లోని ఓ గదిలో కోలాహలంగా వుంది. ఆరోజు ప్రత్యేకమైన ప్రోగ్రామ్స్ ఏవీ లేకపోవడంతో ఫోటోగ్రాఫర్లు క్యారమ్‌బోర్డుపై పడ్డారు.

"అరె మామా... ఏందిరా ఆ కొట్టుడు. కొంచెం స్పీడ్ తగ్గించరా" అన్నాడు జానీ.

"నేను మొన్ననే జెప్పినాను. సుజుకీలో ఎనభై దాటితే ముప్పైలోనే పోతావని" అన్నాడు రాజేష్ జానీకి జత కలుస్తూ.

గంటకు ఎనభై కిలోమీటర్లు మించి వేగంగా వెళితే ముప్పైఏళ్ళ వయసులోనే పైకిపోతాడన్న ఆ జోక్ అర్థం కావడానికి అరనిమిషం పట్టింది.

అర్థమవగానే అందరూ గొల్లుమన్నారు.

ఇంతలో వి.ఐ.పి. సైరన్ వినిపించింది.

"ఎక్స్‌ట్రాగాడొస్తున్నాడురోయ్" అన్నాడొకడు.

ఎక్స్‌ట్రాగాడనబడిన రవితేజ ముక్కును చేత్తో మూసిపెట్టి అచ్చం వి.ఐ.పి. సైరన్ లాగే కూతవేస్తూ లోపలికి వచ్చాడు. వస్తూనే, "అన్ని పత్రికా విలేకరులకు, ఫొటోగ్రాఫర్లకు, ఈ.ఎస్.పి. వారికీ, సిటీకేబుల్ వారికీ నా నమస్కారాలు. అయ్యా అంతా క్షేమమేగదా" అన్నాడు స్థానికంగా వున్న అక్షరమ్ముక్కరాని రాజకీయ నాయకుడ్ని అనుకరిస్తూ.

ఆ అనుకరణ వినీవినీ బోరుకొట్టడంతో "నీకు మిమిక్రీ ఎవరు నేర్పారోగానీ మా ప్రాణాలు తోడేస్తున్నావు" అన్నాడు వినయ్.

వాళ్ళ మాటలు పట్టించుకోకుండా వెనక్కి తిరిగి మురళిని చూసి "స్థానిక ప్రెస్‌క్లబ్‌లో నేడు ప్రారంభమైన క్యారమ్స్ పోటీలపై ప్రత్యేక కథనం మా 'ఈ రోజు' ప్రత్యేక ప్రతినిధి మురళి అందిస్తారు" అన్నాడు టి.వి అనౌన్సర్లని అనుకరిస్తూ.

బోర్డు దగ్గరున్న వాళ్ళు పకపకా నవ్వారు.

మురళీ కూడా బలవంతంగా పెదాలపైకి నవ్వు తెప్పించే ప్రయత్నం చేశాడు. ఎప్పుడూ హుషారుగా కనిపించే మురళీ దిగాలుగా కనిపిస్తుండడం చూసి "ఏమైంది మురళీ అలా వున్నావు. ఆరోగ్యం బాగా లేదా? " అన్నాడు రవితేజ.

తనలోని బాధల్ని, ఆలోచనల్ని మొహంలో కనపడకుండా జాగ్రత్తపడాలని ప్రయత్నించినా మురళీకి సాధ్యం కాలేదు.

బదులుగా చిన్నగా నవ్వుతూ ఏం లేదన్న

ట్లుగా తలూపాడు.

"అవునూ, అసలు ప్రెస్‌క్లబ్‌కే నువ్వు సరిగా రావు. అలాంటిది మూడు రోజులుగా ఇక్కడే కనిపిస్తున్నావ్. ఏంటి సంగతి"

నిజమే తను గతంలో ప్రెస్‌క్లబ్‌కు సరిగా వచ్చేవాడు కాదు. దేవస్థానాలు చూస్తున్నప్పుడు ఇంటినుండి నేరుగా దేవస్థానం పరిపాలనా భవనానికి వెళ్ళిపోయేవాడు.

ఆ పరిపాలనా భవనం ఒక చిన్న ప్రపంచం.

అక్కడ వున్న దేవస్థానానికి సంబంధించిన అన్ని విభాగాల ఉన్నతాధికారులను ఒకసారి పలకరించి వచ్చినా సాయంత్రమైపోతుంది. అందువల్లే ప్రెస్‌క్లబ్‌కు రావడానికి వీలుపడలేదు.

ఇప్పుడు రెవిన్యూ చూస్తున్నాడు.

రెవిన్యూలో ఏముంటాయ్. భూముల పట్టాలు, అక్రమాలు, పథకాలు, పన్నులు, వర్షపాత వివరాలు. ఇవేగా.

వార్తలు కావాలనుకుంటే ఆర్.డి.ఓను కలిస్తే ఏదో ఒకటి చెబుతాడు. లేదా ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఇంకేదైనా కొత్త పథకం గూర్చి చెబుతాడు. నిజంగా రాయాలనుకునే విలేకరికి ప్రతిశాఖలోనూ లెక్కలేనన్ని వార్తలు కనిపిస్తాయి. మరీ శ్రద్ధగా రాయాలనుకుంటే పంటలను గురించి రాయవచ్చు వర్షపాతం ప్రజలపై చూపిన ప్రభావం గూర్చి ప్రభుత్వ పథకాల అమలు తీరుతెన్నులు వగైరావగైరా... ఎన్నైనా రాసుకుంటూ పోవచ్చు

అయితే వాటిపైన ఇప్పుడు ఆసక్తి పుట్టడంలేదు.

అవన్నీ స్పెషల్ స్టోరీస్. అవి రాయకపోయినా ఎవరూ అడగరు. ఏదైనా రెవిన్యూ ఆఫీసులో కార్యక్రమం జరిగినప్పుడు దాన్ని మిస్‌కాకుండా రాసేస్తే చాలు. తనని ఏం చేస్తున్నావని అడిగేవాళ్ళుండరు. అయినా పనీ పాటా లేకుండా కూర్చోవాలంటే విసుగు. తనపైన తనకే కోపం. పోనీ చేద్దామా అంటే ఏదో అసహనం. తన కాళ్ళూచేతులూ ఎవరో కట్టివేసినట్లు అనిపిస్తోంది.

ఒక చిన్న ఉద్యోగో, అటెండరో లంచాలు తీసుకుంటున్నాడని రాస్తే జిల్లా పేజీలో రంగులద్ది మరీ వేస్తారు. తమ పత్రిక 'అవినీతిని' ఎత్తిచూపేందుకు ఎంతలా కష్టపడుతోందో తెలియజేస్తారు.

నాలుగురోజులు శ్రద్ధగా ఏ ఆఫీసు చుట్టూనైనా తిరిగితే ఐదో రోజుకి ఆ ఆఫీసులో ఏ అధికారి ఏఏ రూపాల్లో లంచాలు తీసుకుంటున్నాడో కనిపెట్టేయవచ్చు. తను అసలు శ్రద్ధపెట్టి తిరగకపోయినా ఎం.ఆర్.ఓ ప్రతిరోజూ ఇంటికి వెళ్ళేటప్పుడు ఎంత తీసుకువెళుతున్నాడో, ఆర్.డి.ఓకి రోజుకు ఎన్నివేల రూపాయల కమీషన్ వస్తుందో తెలుసుకోగలడు.

వీళ్ళు తీసుకుంటున్న దాంతో పోలిస్తే అటెండర్‌లు, చిన్నా చితకా ఉద్యోగులు తీసుకుంటున్నది గాలికి పోతుంది.

అయితే ఈ వార్తల్ని విలేకరి రాయకూడదు. ఎందుకంటే రాసినా ప్రచురిస్తామన్న నమ్మకంలేదు. ఇవన్నీ ఆలోచించేకొద్దీ ఉత్సాహం నీరుగారిపోతోంది.

ప్రతిరోజూ ఉదయాన ఓసారి రెవిన్యూ ఆఫీసులకు ఫోన్‌లు చేయడం, ఏమైనా కార్యక్రమాలుంటే వెళ్ళడం, లేకుంటే నేరుగా ప్రెస్‌క్లబ్‌కు వెళ్ళిపోయి క్యారమ్స్ ఆడడం, నిద్రవస్తే పడుకోవడం, లేదంటే టీ.వీ. చూడ్డం. సాయంత్రం వెళ్ళి ఆఫీసులో కూర్చుని ఒకటిరెండు వార్తలు రాయడం, ఇంటికి వెళ్ళిపోవడం. ఇది రోజువారీ కార్యక్రమంగా మారిపోయింది.

రవితేజ అడిగిన ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో అర్థంకాక నవ్వి వూరుకున్నాడు మురళి.

అంతలో ఎవరో పిలవడంతో రవితేజ హాల్లోకి వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఎన్నికలు దగ్గరపడ్డాయి.

రాజకీయనాయకులు వూరంతా తిరుగుతున్నారు. బ్యానర్‌లతో వీధులన్నిటినీ నింపివేస్తున్నారు. వచ్చిపోయే రాజకీయనాయకులతో ప్రెస్‌క్లబ్ సందడి సందడిగా వుంది.

ఒక్కొక్క రాజకీయనాయకుడు వచ్చి ఎదుటిపార్టీవాడు గత అయిదేళ్ళుగా ప్రజల్ని ఎలా దోచుకున్నదీ చెబుతున్నాడు. కాబట్టి ఈసారి తమకు ఓటేయాలని కోరుతున్నారు. కొంతమంది నాయకులు, విలేకరులను పక్కకు పిలుచుకుని పోయి తమపై రివ్యూలు రాయవలసిందిగా కోరుతున్నారు. అందుకు అవసరమైన ఖర్చులు, గట్రా ఇస్తామని ప్రలోభ పెడుతున్నారు.

ఆ వాతావరణం చూసి మురళి లోలోపలే నవ్వుకున్నాడు. రాజకీయనాయకులకు మీడియా ప్రాణం. పత్రికలలో, టీవీలలో వచ్చే వార్తలనుబట్టే తమ ఇమేజ్ ఆధారపడివుంటుందని గట్టిగా భావించడంవల్లనే రాజకీయనాయకులు విలేకరులతో మంచి సంబంధాలు కొనసాగిస్తుంటారు.

"హాయ్ మురళీ" అన్నాడు అప్పుడే వచ్చిన ఆర్ముగం.

"హలో" అన్నాడు మురళీ షేక్‌హ్యాండ్ ఇస్తూ.

"ఆర్.డి.ఓ. ఆఫీసు దగ్గర ధర్నా వుంది. నేను వెళుతున్నా వస్తావా? " అన్నాడు.

"ఇప్పుడా? ఎవరూ చెప్పలేదే? ఇంతకీ ఎవరిది ధర్నా? "

"నిన్న గుడి దగ్గర్లో గ్యాంగ్‌రేప్ జరిగింది కదా. రేప్ చేసిన వాళ్ళని అరెస్ట్ చేయాలని కోరుతూ మహిళా సంఘం వాళ్ళు ధర్నా చేస్తున్నారు. ఇందాకా వాళ్ళు ర్యాలీ చేస్తూ పోయారు. రా వెళదాం" అన్నాడు.
అంతలో నాగరాజు పరుగెత్తుకుంటూ వచ్చి "నేను కూడా వస్తున్నా" అన్నాడు.

ముగ్గురూ బజాజ్‌లో ఆర్.డి.ఓ. ఆఫీస్‌కు దూసుకుపోయారు. సర్కిల్‌లో ట్రాఫిక్ కానిస్టేబుల్ చెయ్యి అడ్డంపెట్టి సైడ్‌కు నిలపమన్నాడు బజాజ్‌ను.

"ప్రెస్" అని చెప్పి నిలపకుండా ముందుకు వెళ్ళిపోయాడు ఆర్ముగం.

"నీతులు రాసే వాళ్ళు పాటించి చావరు. ఎంత ప్రెస్ అయితే మాత్రం ముగ్గురు పోవాలని ఏముంది" అంటూ గొణుక్కున్నాడు కానిస్టేబుల్.

ముగ్గురూ ఆర్.డి.ఓ ఆఫీసు చేరేసరికి మహిళాసంఘం వాళ్ళు "దోషులను అరెస్ట్ చేయాలి, ఆర్.డి.ఓ. స్పందించాలి" అంటూ పెద్దపెట్టున నినాదాలిస్తున్నారు.

ప్రెస్‌వాళ్ళు వచ్చారని తెలియగానే నినాదాలు ఆపమని కొంతమంది సంజ్ఞలు చేశారు.

వాళ్ళు నినాదాలివ్వడం ఆపగానే అందర్నీ కూర్చోబెట్టారు.

మహిళాసంఘం నాయకురాళ్ళు మాత్రం నిలబడే వుండి తమ ఉపన్యాసం ప్రారంభించారు.

ఆ నాయకురాళ్ళ వస్త్రధారణ చూసి మురళి పెదాలపై నవ్వు మొలిచింది.

అంతలోనే "ఈ సోకులాడి చీర నలగకుండా వచ్చి ఉపన్యాసం చెబుతోంది. కింద కూర్చున్న వాళ్లని చూడు. ఎలా వున్నారో. వాళ్ళందరినీ డబ్బులిచ్చి పిలుచుకొచ్చి వుంటుంది. లేకపోతే ఈమె వెనుక ఇంత జనం వచ్చే సీను లేదు" అన్నాడు నాగరాజు.

"దీన్నేరాస్తే ఎలా వుంటుంది" అన్నాడు ఆర్ముగం.

"వద్దు...వద్దు..." అన్నాడు మురళీ.

మిగతా ఇద్దరూ ఆశ్చర్యంగా చూశారు.

"ఆమె పబ్లిసిటీ కోసం డబ్బులిచ్చి మనుషుల్ని పిలుచుకువచ్చినా మంచిపని చేస్తోంది. ఇప్పటికీ ఆడవాళ్ళు వీధుల్లోకి వచ్చి న్యాయం అడగడమంటే గొప్ప విషయమే. కాబట్టి ఇట్లాంటివి మరిన్ని చేసేలా

మనం ఆమెను ప్రోత్సహించాలి" అన్నాడు మురళీ.

మురళీ చెప్పింది సమంజసమనిపించడంతో మిగతా ఇద్దరూ కన్విన్సయ్యారు.

అంతలో ఫొటోగ్రాఫర్లు వచ్చారు.

ఫొటోలు తీస్తున్నారనగానే ఉపన్యాసమిస్తున్న నాయకురాలు తన కొంగును సరిచేసుకుని, చేతులు వూపుతూ ఆవేశంగా మాట్లాడ్డం ప్రారంభించింది.

ఆమె ఉపన్యాసాన్ని నోట్‌చేసుకున్నారు ముగ్గురూ.

ఆమె ఎంతకీ ఆపకుండా పూనకం వచ్చినట్లు వూగిపోతూ ఉపన్యాసమిస్తూనే వుండడంతో "ఇక లాభంలేదు. మనం వెళితే తప్ప ఆపదు. వెళ్దాం పదండి" అన్నాడు ఆర్ముగం.

ముగ్గురూ బజాజ్ కేసి నడిచారు.

బజాజ్ స్టార్ట్ చేశాడు ఆర్ముగం. అతని వెనుక నాగరాజు ఎక్కి కూర్చున్నాడు.

మురళీ నాగరాజును కొంచెం ముందుకు జరగమని చెప్పి ఎక్కి కూర్చోబోతూ చూశాడు వాళ్ళని.

అతని భృకుటి ముడిపడింది.

ఒక్క క్షణం ఆలోచించి "మీరు పదండి. కొంచెం పనుంది. తరువాత వస్తాను" అన్నాడు బజాజ్ ఎక్కకుండా.

ఆర్ముగం, నాగరాజులు వెళ్ళిపోయారు.

వాళ్ళకేసి పరిశీలనగా చూశాడు మురళీ.

నో డౌట్... వాళ్ళు ధర్నాకు వచ్చినవాళ్ళు కాదు. వారంరోజులుగా ఇక్కడే కనిపిస్తున్నారు.

వాళ్ళ బట్టలు చాలా పాతవి, మాసిపోయి వున్నాయి. అక్కడక్కడా చిరుగులు కనిపిస్తున్నాయి. మాసిపోయి మురికిగా కనబడుతున్న తువాలుతోనే మొహానికి పడుతున్న చెమటను తుడుచుకుంటున్నారు. వాళ్ళ జుట్టు ఏనాడూ దువ్వినట్లు లేదు.

కొంతసేపు స్కూటర్స్ స్టాండ్‌వద్దే నిలుచున్నాడు మురళీ.

ధర్నాకొచ్చిన వాళ్ళంతా వెళ్ళిపోతున్నారు.

వాళ్ళు నలుగురు మాత్రం అక్కడే దిగులుగా కూర్చుని వున్నారు. ఇద్దరి వయసు ముప్పై, ముప్పై అయిదు వుండొచ్చు మరో ఇద్దరి వయసు నలభై వుండొచ్చు

ముంగాళ్ళమీద చేతులు పెట్టి స్థంభానికి ఆనుకుని కూర్చునివున్నారు. వాళ్ళ దగ్గరికి నడిచి "ఎవరు మీరు. ఏం పనిమీదొచ్చారు? " అని అడిగాడు మురళీ.

వాళ్ళ కళ్ళల్లో మెరుపులు కనిపించాయి.

ఒక్కసారిగా ఎక్కడలేని చైతన్యం వచ్చినట్లు తటాలున లేచి నిల్చుని చేతులు కట్టుకున్నారు.

మురళీ ప్యాంట్, షర్ట్ వేసుకుని అద్దాలు పెట్టుకుని వుండడంతో ఎవరో ఆఫీసరు తమమీద దయ చూపించాడనుకున్నారు వాళ్ళు కంఠతా పట్టిన పాఠాన్ని గడగడా ఒప్పజెప్పినట్లు చెప్పుకుపోయారు. నలుగురూ ఒకేసారి మాట్లాడ్డంతో ఒక్కముక్క కూడా అర్థంకాలేదు మురళీకి.

"ఆపండి... ఆపండి... ఒక్కరుగా చెప్పండి"

అందరి నోళ్లూ టక్కున మూతపడిపోయాయి.

ఒకరినొకరు చూసుకున్నారు. సైగలు చేసుకున్నారు. ఒక వ్యక్తి చెప్పడం మొదలు పెట్టాడు.

"నా పేరు రాం నారాయణ సార్. వీడి పేరేమో గోవిందు సార్. వాడి పేరు వెంకటేశులు, వాని పక్కనుండే వాని పేరు చిన్నోడు సార్" అని చెప్పి మురళీ కళ్ళలోకి చూశాడు అతను. చెప్పమన్నట్లుగా చూశాడు మురళీ.

"మాది జీవకోన సార్. మేం వుండే గుడిసెలను ఆక్రమించేసుకుని మాకు నిలువనీడ లేకుండా తరిమేసినారు సార్. మా గుడిసెల్ని కూలగొట్టేసినారు సార్" అన్నాడు ఏడుపు ముఖంపెట్టి.

"ఎవరు?" అన్నాడు మురళీ ఆశ్చర్యం గానూ, ఆత్రంగానూ.

"ఆ రాంపాదరెడ్డి మనుషులు సార్" అన్నాడు రాంనారాయణ. ఆ గొంతులో కసి ధ్వనించింది.

రాంపాదరెడ్డి కన్ను వేశాడంటే ఆ స్థలం పని అయినట్లే. ఇక వాళ్ళ స్థలాన్ని వాళ్ళకి ప్పించడం అంత సుళువుకాదు. ఆలోచి స్తూనే

"ఎప్పుడు ఆక్రమించుకున్నారు?" అని అడిగాడు మురళీ.

"పది రోజులవుతావుంది సార్"

"పది రోజులవుతుంటే ఇంకా ఏం చేస్తు న్నారు. పోలీస్ కేసు పెట్టారా?"

"కేసు పెట్టనుపోతే రాసుకోమన్నారు సార్ వాళ్ళు. అందుకే ఆర్.డి.వో సార్‌కి చెప్పుకుందామని ఇక్కడికి వచ్చినాము. ఇక్కడ మమ్మల్ని పట్టించుకునే దిక్కులేదు. ఎన్నిసార్లు ఛెప్పుకున్నా కనీసం వినేవాళ్ళు కూడా లేరు సార్" అన్నాడు.

"ఇంతకీ మీకు పట్టాలున్నాయా?"

"పట్టాలుంటే ఇంకేం సార్. జీవకోనలో ఏ ఒకరికీ పట్టాలు లేవు సార్!"

"మీరు ఎన్నాళ్ళుగా వుంటున్నారక్కడ?"

"రెండేండ్లయ్యింది సార్"

"ఇంకెవరికైనా ఈ విధంగా ఆక్రమించు కున్నారా, మీవేనా?"

"ఇంకా కొంతమందివి ఆక్రమించుకు న్నారు సార్" అన్ని ప్రశ్నలు అడుగుతుంటే తమ సమస్య తీరిపోయినట్లేననిపిస్తోంది వాళ్ళకి. అది గ్రహించాడు మురళీ.

"నేను అధికారిని కాదు. రిపోర్టర్‌ను. నావంతు ప్రయత్నం నేను చేస్తాను. నేను రేపు మీ జీవకోనకి వస్తాను. ఇంటిదగ్గరే వుండండి" అన్నాడు.

★ ★ ★

రోడ్డుమీద వెడల్పాటి గుంతవుంది. దానిలో వర్షపునీళ్ళు ఎర్రగా వున్నాయి. పక్కనే వరుసగా రాళ్ళు ఎత్తుగా పేర్చివు న్నాయి. దానిపక్కగా రాళ్ళపొయ్యి మండు తోంది. కట్టెలు పచ్చివేమో విపరీతమైన పొగవస్తోంది. అక్కడే బాగా అతుకులు పడిన రెండు పాత్రలున్నాయి. వాటిలో మంచినీళ్ళున్నాయి.

బట్టలులేని మూడేళ్ళపాప సత్తుగ్లాసును రెండు చేతులతో పట్టుకుని నోటిదగ్గర పెట్టుకుని వుంది. ఆ పాప జుట్టంతా చింద రవందరగా వుంది. కొత్తగా కనిపిస్తున్న ఆ ఇద్దరి వ్యక్తులవైపు భయంభయంగా చూస్తోంది.

"సురేష్... ఆ పాపను, ఈ పాత్రల్ని, పొయ్యి, నీళ్ళగుంట అన్నీ కవరయ్యేలా ఒక ఫొటో తియ్" అన్నాడు మురళీ తమ ఫొటోగ్రాఫర్ నుద్దేశించి.

అతను లెన్స్ అడ్జెస్ట్ చేసుకుని ఆ పాప బెదురు చూపుల్ని కూడా ఫొటోలో బంధించే ప్రయత్నం చేశాడు.

"ఈ ఫొటో సూపర్‌గా వస్తుంది మురళీ!"

"వెరీగుడ్"

అంతలో రాంనారాయణ, గోవిందులు వచ్చారు. పరుగెత్తుకుంటూ వెళ్ళి ఎవరింట్లో నుండో కొయ్య కుర్చీలను తెచ్చివేశారు. ఫరవాలేదని చెబుతున్నా వాళ్ళిద్దరినీ వాటిలో కూర్చోబెట్టారు.

"రేయ్... అందర్నీ పిలవండిరా" అంటూ పరుగులు తీశారు. పదినిముషాల్లో యాభై మంది ఆడామగా అక్కడ గుమిగూడిపో యారు.

అందరూ పనులకు వెళ్ళడానికి బయలు దేరుతున్న వాళ్ళే. ఇంత ఉదయాన్నే ఎందుకు మధ్యాహ్నం పోదామన్న సురే ష్‌ను బలవంతపెట్టి లాక్కురావడం మంచి దయిందనుకున్నాడు మురళి.

మురళీ ఇంటర్వ్యూలు చేయసాగాడు.

ఆవేశంగానూ, ఆవేదనగానూ మాట్లాడే స్త్రీలను, ముసలి వాళ్ళను, యువకులను ఇంటర్వ్యూలు చేస్తూ నోట్‌చేసుకున్నాడు. ఇంటర్వ్యూలు చేసినవారందరి ఫొటోలు

తీయించాడు.

మరుసటిరోజు జిల్లా ఎడిషన్‌లో సెంటర్ స్ప్రెడ్ మొత్తం జీవకోనలో పేదల బాధలను కళ్ళకుగట్టినట్లుగా, వాళ్ళు మాట్లాడే యాసని అలాగే అక్షరబద్ధంచేస్తూ వివరించాడు.

పేదలు తలదాచుకోవటానికి పట్టణానికి దూరంగా ఎక్కడో అడివికింద చదునుచేసుకుని వేసుకున్న పూరిగుడిసెల్ని దౌర్జన్యంగా ఆక్రమించి, ఆ స్థలాన్ని అమ్ముకునే ముఠా ఒకటి ఇక్కడ తయారైందని రాశాడు.

పట్టణ శివార్లలో వుండే కొన్ని కాలనీలు, కొన్ని ప్రాంతాలు, జీవకోన, మంగళం వంటి ప్రాంతాల్లోని ప్రజలు ఏళ్లతరబడి నివాసముంటున్నా అధికారులు పట్టాలిచ్చిన పాపాన పోలేదని విమర్శించాడు.

జన్మభూముల్లోనూ, ఇతరత్రా ఎం.ఎల్.ఏలు, ఎం.పీలు, మున్సిపల్ ఛైర్మన్‌లు ఓట్ల కోసం ప్రచారానికి వచ్చిన ప్రతిసారీ తమ సమస్యల్ని విన్నవించుకున్నా ఫలితం మాత్రం శూన్యమని రాశాడు.

రౌడీ మూకల్ని పెంచిపోషిస్తూ, దౌర్జన్యంగా స్థలాన్ని అమ్ముకుంటున్న ముఠాకు రాజకీయ నాయకుల అండ వుందని, పోలీసులతో మామూళ్ళ సంబంధం వుందనీ రాశాడు. ఆ వ్యాపారానికి తగినట్లుగా ఫొటోలు, సబ్ హెడ్డింగ్‌లు పెట్టడంతో చూడగానే చదవాలనిపించేలా వుంది ఆ వ్యాసం. వ్యాసం చివర్లో మురళీ, సురేష్‌ల పేర్లను కూడా ఇచ్చారు.

రాంపాదరెడ్డే ఆ స్థలాలను ఆక్రమించుకున్నాడని తెలిసినా ఎక్కడా ఆ పేరును వాడలేదు మురళీ. ఆ పేరు కనిపిస్తే ఆ వార్త అచ్చుకు నోచుకోకపోవచ్చు.

జనం అలా కష్టపడుతున్నారు. ఇలా కష్టపడుతున్నారు అంటూ ఎన్ని వార్తలైనా రాయనీ ఆనందంగా పబ్లిష్ చేస్తారు. కానీ ఆ జనం సమస్యలకు, కష్టాలకు కారణం ఎవరు? అన్నది సూటిగా చెబితే మాత్రం ఆ వార్త ఫట్.

అందుకే పేరు రాయకుండా పాలకపార్టీకి చెందిన ఒక వ్యక్తినీ ఆయన రకరకాల అక్రమ వ్యాపారాలుచేసి పేరుతెచ్చుకున్న వ్యక్తనీ పరోక్షంగా సూచించారు. ఆ మాత్రం క్లూ చాలు. ఆ ఊళ్లో కనీస పౌర సంబంధాలున్న ఎవరైనా ఆ వ్యక్తి ఎవరో గ్రహించగలరు.

ఆ వ్యాసం అధికారుల్లో కలకలం రేపింది.

ఒకానొక మహిళ అధికారుల మీద కోపంతో పనికిరాని దద్దమ్మలనీ, లంచగొండులనీ ఆవేశంగా చెప్పిన మాటల్ని యథాతథంగా పేపర్లోకి ఎక్కించాడు మురళీ.

దాంతో కలెక్టర్ ఫోన్‌చేసి పేపర్లో పనికిరాని దద్దమ్మలని రాసేదాకా ఏంచేస్తున్నారంటూ ఆర్.డి.ఓపై మండిపడ్డాడు.

ఆర్.డి.వో మురళీకి ఫోన్‌చేసి "ఏం మురళీ ఇట్లాంటి పనిచేశావు. ఒకమాట నాకుచెప్పి రాయకూడదా" అన్నాడు నిష్ఠూరంగా.

ఒకమాట చెప్పుంటే ఏంజరిగేది? అని ఆలోచించి చిన్నగా నవ్వుకున్నాడు మురళి.

"కలెక్టర్ పేపర్‌చూసి ఇంతెత్తున మండిపడతావుండెనయ్యా. నువ్వు కొంతమంది పేర్లు చెప్పు. ఎట్లాగోలా వాళ్ళకు స్థలాలను ఇప్పించే ప్రయత్నం చేస్తాను" అన్నాడు ఆర్.డి.వో.

"వాళ్ళ స్థలాలే వాళ్ళకిప్పిస్తారా?" అన్నాడు మురళీ సందేహంగా.

"ఏదో ఒక స్థలం ఇప్పిస్తాను లేవయ్యా. తాడూ బొంగరం లేనివారికి ఏదో ఒకటి ఇవ్వడమే గొప్ప"

మనసు చివుక్కుమంది మురళీకి.

అంత పెద్ద పొజిషన్‌లోవున్న అధికారికి వుండాల్సిన లక్షణమేనా అది? అనిపించి బాధపడ్డాడు.

ఎంతకీ మురళీ మాట్లాడకపోయేసరికి "ఏం మురళీ పేర్లు చెబుతావా" అన్నాడు

ఆర్. డి. వో.

"గుడ్డికన్నా మెల్లనయం, ఇచ్చేవేవో తీసిస్తే పోలా" అనుకుని "అలాగే సార్!" అంటూ పేర్లు చెప్పసాగాడు.

"అన్నట్లు రేపు ఇళ్లస్థలాలిచ్చేటప్పుడు ఫొటోగ్రాఫర్‌ను కూడా పిలుచుకురావోయ్! వార్త ఎలాగూ నువ్వు రాస్తావు కాబట్టి అది రిపోతుందనుకో" అన్నాడు ఆర్. డి. వో.

"సరే సార్!" అని ఫోన్ పెట్టేసి మనసు లోనే నవ్వుకున్నాడు మురళీ.

★ ★ ★

వేకువఝామునే మెలకువ వచ్చింది గంగావతికి.

దూరంగా ఎక్కడో రైలు కూత పెడుతూ వెళుతున్న శబ్దం వినిపిస్తోంది. ఇంకా కొంతసేపు పడుకుంటే బావుండనిపిస్తోంది. మళ్లీ పడుకుంటే లేచేసరికి తెల్లారిపోతుంది.

'ఇక అప్పుడు తన బతుకే తెల్లారిపో తుంది' అనుకుంటూ లేచింది.

నీళ్లబిందె చంకనేసుకుని బోరింగు వద్దకె ళ్లింది.

అప్పటికే చాలామంది లేచినట్లుగా శబ్దాలు వినిపిస్తున్నాయి. బోరింగువద్ద చాలామంది వున్నారు. వేచి వుండి నీళ్లు పట్టుకుని ఇంటికి వచ్చింది.

పాత్రలు కడిగి, అన్నం చేసింది. పప్పు వుడుకుతూ వుండగానే స్నానం చేసొచ్చింది. పప్పు రుద్ది తిరగమోత పెడుతూ భూలో కడ్నీ లేపింది. చకచకా రెండు మెతుకులు తిని మధ్యాహ్నానికి బక్కెట్టులో అన్నం వేసుకుని టవలు ఎత్తి భుజానవేసుకుని బయలుదేరింది.

పట్టణానికి వచ్చిన తొలిరోజు ఇల్లు వెతు క్కోవడానికీ, అందులో చేరి వస్తువుల్ని సర్దు కోవడానికీ సరిపోయింది. ఇంటి ఓనరు మేస్త్రీ పని చేస్తాడు. తనతోపాటు తీసుకెళ్లి భూలోకనికి పని ఇప్పించగలిగాడు. కానీ తనకు ఇప్పించలేకపోయాడు.

పనిచేయక తప్పదుకాబట్టి తనకు ఎలా గైనా పని కావాలని అడిగితే నాలుగుకాళ్ల మండపం వద్దకు వెళితే పనికి పిలుస్తారని చెప్పాడు. మొదటిసారి అక్కడికి వెళ్లినపుడు దారిపొడవునా అడుగుతూ వెళ్లాల్సి వచ్చింది. ఇప్పుడు దారి తెలుసుకాబట్టి త్వర త్వరగా అడుగులు వేయసాగింది.

ఆరోజు ఆరుగంటలకే నాలుగుకాళ్లమం డపం చేరుకుంది.

ఇంకా చీకట్లు పూర్తిస్థాయిలో తొలగిపో లేదు. అప్పుడప్పుడే జనం వచ్చి చేరుతు న్నారు అక్కడికి.

నిమ్మకాయల బండ్లు వచ్చి నిమ్మకాయల తట్టలను దింపి పోతున్నాయి. నిమ్మకా యలు అమ్ముకునేవారు తట్టలను హోల్ సే ల్ గా కొనుక్కునేందుకు బేరాలాడుతు న్నారు.

క్రమంగా అక్కడ చేరుతున్న వారి సంఖ్య పెరగసాగింది.

ఎప్పటిలాగే ముందుగా రాజారెడ్డి ట్రాక్ట రొచ్చింది. రాజారెడ్డి దిగాడు.

మగవాళ్లలో తనకు నచ్చిన వాళ్లను పిలి చాడు. ఆడవారివైపు తిరిగాడు.

గంగావతి తల తిప్పుకుంది చూడన ట్లుగా.

'ఎంతపొగరు' అనుకున్నాడు రాజారెడ్డి.

తనకు కావలసినవాళ్లను పిలుచుకు న్నాడు.

తులశమ్మను పిలవలేదు. తులశమ్మే వస్తానంటే అవసరంలేదు అన్నాడు.

ట్రాక్టరు కదిలింది కూతలతో.

తులశమ్మకు కోపం వస్తుందేమోనని చూసింది గంగావతి.

ఏమీ పట్టించుకున్నట్లులేదు.

"రోజూ పిలుచుకునే వాళ్లనే పిలుచుకుపో వచ్చుగదా? రోజురోజుకీ కూలీలను మార్చడం దేనికి? "

తనలోని సందేహాన్ని ఇంకెవరో అడి గారు.

"రోజూ పిలుచుకుంటే మనకు ధీమా

వచ్చేస్తుందనీ, వాళ్లంటే భయం, గౌరవం తగ్గిపోతాయని వాళ్ల భయం. అందుకే ఎప్పటికప్పుడు కూలీలను మార్చేస్తుంటారు. మహా అంటే వారం రోజులు ఒకరి దగ్గర పనిచేయవచ్చు. అంతకంటే ఎక్కువ రోజులు ఒకరి దగ్గరే ఎవరూ ఇంతవరకూ పనిచేయలేదు" అంది తులశమ్మ.

అర్థం చేసుకునేందుకు ప్రయత్నించింది గంగావతి.

మరో ట్రాక్టరు వచ్చింది. అందరిలోనూ ఉత్సాహం. తమను పిలుస్తాడేమోనని ఆశ.

ట్రాక్టరు దిగిన వ్యక్తి చకచకా తనకు కావలసిన వాళ్లను ఎంపిక చేసుకున్నాడు. ఆడవాళ్లలో ముగ్గుర్ని పిలుచుకున్నాడు. ట్రాక్టరెక్కబోతుండగా చూశాడు గంగావతిని.

వెనుదిరిగి "ఇంకా ఒకరు కావాలి. నువ్వురా" అన్నాడు.

తనని పిలవకుండా వెళ్లిపోతున్నప్పుడే ఏదో ఓడిపోయినట్లనిపించింది.

అంతలోనే పిలవడంతో ఆనందంగా వెళ్లి ట్రాక్టరెక్కి కూర్చుంది.

ట్రాక్టరు కదిలింది.

నాగరాజు వచ్చి ఆడవాళ్ల పక్కన కూర్చున్నాడు.

అతని వయసు నలభై దాటుంటుంది. మీసాలు తెల్లబడుతున్నాయి. మొహంలో వయసు ముదిరిన ఛాయలు కనబడుతున్నాయి. అతని వయసుకూ, ప్రవర్తనకూ పొంతనే వుండదు.

"ఏమే రంగీ ఈమధ్య తెల్లబడిపోతున్నావు" రంగమ్మ అనే ఆమెను ఆటబట్టిస్తూ అన్నాడు నాగరాజు.

నిజానికి రంగమ్మ చాలా నలుపు.

"మీరు పొండయ్యా! తెల్లారిలేస్తే సరసాలాడ్డం తప్పించి ఇంకో పనిలేదు" అంది రంగమ్మ మూతి తిప్పుతూ.

ఎలా అంటే అతను ఆనందపడతాడో ఆమెకు తెలుసు. అందుకే అలా అంది.

నాగరాజు తన మీసాల్ని సవరించుకుంటూ, "ఏమే రంగీ, మీ ఆయన ముసలాడయిపోతున్నాడుకదా! బాగా పని చేస్తూండాడా? " అన్నాడు ద్వంద్వార్థంలో.

"ఛీ పాడు... మీకెప్పుడూ అదే యావ" అంది రంగమ్మ అతని రసికతని పొగుడుతున్నట్లుగా.

అతను పకాపకా నవ్వాడు ఆ మాటలకు.

అతని మాటతీరు, వెకిలి నవ్వు చూసి ఎబ్బెట్టుగా అసహ్యంగా అనిపించింది గంగావతికి.

అతను రంగమ్మతో మాట్లాడుతున్నా చూపులన్నీ తనమీదే వుండడాన్ని గమనించింది.

ఈ రోజు కూడా నిన్నటిలాగా... ఈ నాగరాజు కూడా నిన్నటి రాజారెడ్డిలాగా...

సందేహాలు ఎన్ని వుండి ఏం లాభం?

ట్రాక్టర్ ఆగింది.

అక్కడ రెండంతస్థుల మిద్దె కొత్తగా కట్టి వుంది. దానికి పెయింటింగ్ వేయిస్తున్నారు.

ఇంటిలోపల సెంట్రింగ్ తీసినపుడు పడిన సిమెంటు, చెత్తాచెదారం లోపలే వున్నాయి.

అన్నం బక్కెట్లన్నీ శుభ్రంగా వున్న ఒక గదిలో పెట్టారు అందరూ. గంగావతి వాళ్లను అనుసరించింది.

మగవారికి పెయింట్ డబ్బాలు, మిగతా సామాగ్రి అందించి వారు పెయింట్ చేయాల్సిన చోటు చూపించాడు నాగరాజు.

మగవారంతా పనిలోకి దిగారు.

ఆడవాళ్లు తమ కొంగుల్ని నడాన దోపుతుంటే అప్పుడే ఎక్కడికి అన్నాడు నాగరాజు.

"పనిలోకి" అన్నారు అందరూ ముక్తకంఠంతో.

గంగావతి మాత్రం మౌనంగా నిలబడి జరిగేది చూస్తూ వుంది.

"కూర్చోండి. టీ తెమ్మని చెప్పినా తాగిపోదురుగానీ" అన్నాడు.

ఆడవాళ్లంతా ఒకరిముఖాలు ఒకరు చూసుకుని ముసిముసిగా నవ్వుకున్నారు.

ప్రతిదానికీ వాళ్లు నవ్వడం వెగటుగా అనిపించింది గంగావతికి.

టీ వచ్చేవరకూ ఆడవాళ్లతో ద్వంద్వార్థ ప్రశ్నలు వేస్తూ, వారి సమాధానాలకు పకపకా నవ్వుతూనే వున్నాడు నాగరాజు.

టీ వచ్చింది. అందరూ తాగారు.

అంతలో ఒక కుర్రాడు టకార్లు తెచ్చాడు.

"ఇదిగో మీకో చిన్న పని పెడుతున్నా. ఇంట్లోవున్న పగిలిపోయిన సిమెంటు పలకలు, చెత్తాచెదారం అంతా ఆ ట్రాక్టర్‌లో పోయాలి. అంతే" అన్నాడు.

ఆడవాళ్లు నవ్వుతూనే టకార్లు తీసుకున్నారు.

చీర ఎగజెక్కి కొంగును నడాన దోపుకుని పనిలోకి దిగారు.

గంగావతి కూడా టకారు తీసుకుందామని చూసింది. టకార్లు లేవు. మేస్త్రీ వైపు చూసింది.

"నీకు టకారిలేదా? సరే నీకు వేరే పని, అంతకంటే సులువైన పని పెడతా" అన్నాడు.

గంగావతి గుండె అనుమానంతో ఒక్కసారిగా ఆగి వేగంగా కొట్టుకోసాగింది.

ఏం చెబుతాడో ఏమోనని టెన్షన్‌గా చూడసాగింది.

"నేను పోయి కంప్రెషన్ వదులుతాను. నువ్వెళ్లి నీళ్లుపట్టు" అంటూ ఒకపైపు తెచ్చి ఆమె చేతికిచ్చాడు.

హమ్మయ్య అంతేనా! అని వూపిరి పీల్చుకున్నా ఏదో మూల అనుమానం ఆమెను పీకుతూనే వుంది.

అయినా బలవంతంగా ధైర్యం తెచ్చుకునే ప్రయత్నం చేస్తూ పనిలోకి దిగింది.

పైపు చేతబట్టి ప్రతిగోడనూ తడపసాగింది.

మధ్యాహ్నానికి పెయింట్ చేస్తున్న వైపు తప్పించి మిగతా గోడలన్నీ లోపలివైపు నుండి తడిపింది.

మధ్యాహ్నానికి పని నిలిపి భోజనానికి వచ్చేవరకూ నాగరాజు కనిపించలేదు.

అప్పటికి ఆమెకు కొంచెం నమ్మకం చిక్కింది.

అందరూ నాగేసురెడ్డి, రాజారెడ్డి లాంటోళ్లే వుంటారనుకోవడం పొరబాటు. మొరిగే కుక్క కరవదని పెద్దోళ్లు వూరికే చెప్పుండరు అనుకుంది నాగరాజును గూర్చి ఆలోచిస్తూ. భోజనాలవుతూనే ఆ ఇంటి ముందున్న కానగచెట్టుకింద తువ్వాళ్లు పరచి అందరూ నడుం వాల్చారు. గంగావతికి నిద్రపట్టలేదు.

ఈ పనైనా స్థిరంగా వుంటే చాలు అనుకుంటోంది.

భోజనాలప్పుడు మిగతా ఆడవాళ్లు పలకరించినా ఆమె ముక్తసరిగా సమాధానాలు చెప్పడంతో వాళ్లు మళ్లీ మాట్లాడించే ప్రయత్నం చేయలేదు.

మగవాళ్లు పనిలోకి దిగిన పదినిమిషాలకు ఆడవాళ్లూ లేచి పనిలోకి దిగారు.

గంగావతి కూడా పైపు తీసుకుని బయటిగోడలను తడిపేందుకు మిద్దెక్కింది.

మేస్త్రీ వెళ్లి కంప్రెషన్ ఆన్ చేశాడు.

పైనుండి గోడలను తడపసాగింది.

మూడున్నర గంటల ప్రాంతంలో మేస్త్రీ మిద్దిపైకి వచ్చాడు.

"ఏవమ్మాయ్ తడపడం అయ్యిందా?" అన్నాడు.

"ఇంకా ఈ పక్కగోడ మిగిలిపోయింది. పట్టేస్తాను" అంది.

అతను తడిసిన గోడలను పరిశీలిస్తూ, "గోడలకు నీళ్లు పట్టేది ఇట్లేనా ఆ పక్క చూడు తెరపలు వచ్చేస్తున్నాయి" అంటూ ఆమె దగ్గరికి వచ్చాడు.

"అట్లాకాదు, నేను చూపిస్తాను చూడు" అంటూ నీళ్లపైపు పట్టుకున్న ఆమె చేయి పైన చేతిని వేసి పైపును పట్టుకున్నాడు.

మరో చేయిని ఆమె రెండవ భుజంపై

వేశాడు.

ఊహించని అతని చర్యలకు బిక్కచచ్చి పోయింది ఆమె.

అంతలోనే తేరుకుని "మిమ్మల్ని అట్లాం టోళ్లనుకోలేదు. వదులు... వదులు..." అంటూ గింజుకోసాగింది.

"అచ్చం నువ్వు గింజుకుంటున్నట్లే నిన్ను చూసి నా మనసు గింజుకుంటోంది. నీకు కావాలంటే రోజూ ఇలాంటి సుళువు పనులే ఇస్తా" అంటూ ఆమె మెడవంపులో తన ముఖాన్ని పెట్టి రెండు చేతులనూ ఆమె నడుంచుట్టూ బిగించి వెనక్కి గట్టిగా అదుముకున్నాడు.

ముందువైపు పిట్టగోడ వుండడంతో ఆమె అతన్ని వెనక్కి నెట్టేందుకు ప్రయత్నించసాగింది.

అతను తన పట్టు మరింత బిగించి ఆమె శరీరాన్ని తడమసాగాడు.

"వదలకుంటే అరుస్తాను" అంది ఆమె, అట్లన్నా భయపడతాడేమోనని. అతను గబుక్కున ఆమె నోటిని ఒక చేత్తో మూసి వేస్తూ,

"నేను ఇంతవరకూ ఎవరికీ డబ్బివ్వలేదు. నీకు కావాలంటే ఇస్తా. ఒక్కసారి ఒప్పుకో" అన్నాడు.

డబ్బులంటే లొంగని కూలిమనిషి వుండదని అతనికి గట్టినమ్మకం. అందుకే డబ్బులు ఆశ చూపించాడు.

"వూహూ... వూహూ..." మరింత గట్టిగా గింజుకోసాగింది.

ఆమె వళ్ళంతా వణికిపోసాగింది.

ఎంత నెట్టినా ఆమెవల్ల కావడంలేదు.

అతను బాగా ఆమెను నలిపివేస్తున్నాడు.

ఆమెకు ఏడుపొస్తోంది.

ఏ ఆలోచనా రాని నిస్సహాయస్థితిలో ఒక్కక్షణంపాటు అతన్ని విదిలించుకోవడానికి చేస్తున్న ప్రయత్నాన్ని ఆపింది.

అతను ఆశ్చర్యపోయాడు.

ఇక లొంగిపోయినట్లేనని నమ్మకం కుదిరింది.

చేతిపట్టు సడలించి "కొంచెం బెట్టుచేస్తే తప్ప ఆడవాళ్ళనిపించుకోరేమో. అందరూ ఇంతే"నంటూ ఆమెను తనవైపుకు తిప్పుకున్నాడు.

అప్పుడు కొట్టిందామె తన బలాన్నంతా చేతిలోకి తెచ్చుకుంటూ.

ఆ దెబ్బ అతనికి తగలరానిచోట తగిలింది.

బాధతో ఉంగలు చుట్టుకుపోతూ నాగరాజు వేసిన కేకకు చుట్టుపక్కల అప్పుడే తుదిరూపు దిద్దుకుంటున్న కొత్త భవనాలన్నీ కూడా 'అమ్మా' అంటూ ప్రతిధ్వనించాయి.

★ ★ ★

అది మధ్యాహ్నసమయం.

ఎండాకాలంలోనే కాదు, చలికాలంలో సైతం ప్రథమస్థానంలో వుంటుందా ఊరు. చెప్పుల్లేకుండా వీధుల్లో నడిస్తే బొబ్బల్లేచేటట్లుగా పొగలొస్తున్నాయి భూమినుండి.

వేడిగాలితో వళ్ళంతా చెమటపట్టి షర్టులు తడిసిపోతున్నాయి. అంతటి ఎండలో సైకిలేసుకుని ప్రెస్‌క్లబ్‌నుండి ఇంటికి వెళుతున్నాడు మురళి.

నాలుక్కాళ్ళ మండపంవద్ద ట్రాఫిక్ జాం కావడంతో ఒక్కక్షణం సైకిల్ నిలిపాడు మురళి.

అంతలో తెల్లటి టాటాసుమో వచ్చి మురళి పక్కన ఆగింది.

అందులోనుండి రాంపాదరెడ్డి దిగాడు.

అతని వెనగ్గా జీన్స్ ప్యాంట్, కాటన్ షర్టులు వేసుకుని రఫ్‌గా కనిపిస్తున్న యువకులు దిగారు.

రాంపాదరెడ్డి బుర్రమీసాలతో గంభీరంగా వుంటాడు.

అతన్ని చూసిన వెంటనే ఎవరికీ సదభిప్రాయం కలగదు.

రాంపాదరెడ్డి దిగుతూనే "నమస్తే మురళీ సార్" అన్నాడు.

"నమస్తే" అన్నాడు మురళి పొడిపొడిగా.

మామూలుగా చాలామంది రౌడీలను సినిమాలో చూసే అవకాశం దొరుకుతుంది. కానీ నిజజీవితంలో అంతగా దొరకదు.

పోలీసులకు, కోర్టులో పనిచేసేవారికీ, వారి తరువాత జర్నలిస్టులకు మాత్రమే అనేకమంది రౌడీలను ఒకేసారి చూసే అవకాశం వుంటుంది. పోలీసులకంటే జర్నలిస్టులకే రౌడీల పుట్టుపూర్వోత్తరాలు, వాళ్ళు ఎవరికింద పనిచేస్తున్నారు, ఎలాంటి పనులు చేస్తారన్న వాటిపై మంచి అవగాహన వుంటుంది.

మురళికి రాంపాదరెడ్డి చాలాకాలంనుండే పరిచయం.

పొలిటికల్ పార్టీలోకి అడుగుపెట్టిన లేదా రాజకీయనాయకుల వెంట తిరుగుతున్న రౌడీమూకల్లో నాయకులుగా వున్న వారందరూ జర్నలిస్టులతో మంచిగా మసలుకొంటూ వుంటారు. రిపోర్టర్‌లు కనిపించగానే తమ స్థాయిని, అహంకారాన్నీ, గర్వాన్నీ మరిచిపోయి నమస్కారం పెడుతూ ఎక్కడలేని గౌరవాన్నీ, అతి వినయాన్నీ ప్రదర్శిస్తుంటారు.

వద్దన్నా వినకుండా కూల్‌డ్రింక్‌లు, టీలు, టిఫిన్‌లు వగైరా తినిపిస్తుంటారు. తమతో అంత క్లోజ్‌గా మసలే వ్యక్తి నాలుగు మర్డర్లు, రెండు రేప్‌లు చేశాడని తెలిసినా నమ్మాలనిపించనంతగా నడుచుకుంటారు.

చాలాకాలం క్రితమే రాంపాదరెడ్డి పరిచయం ఏర్పడింది.

రాజకీయాల్లో ఎలా ఎదగవచ్చో. ఎలా చేస్తే పబ్లిసిటీ బాగా వస్తుందో తనే సలహాలిచ్చేవాడు.

నిజానికి రౌడీలు రాజకీయాల్లో చేరితే అంతో ఇంతో క్రైం రేటు తగ్గుతుంది. అల్లాటప్పాగాళ్ళు డబ్బుందికదా అని రాజకీయాల్లో చేరితే క్రైం రేటు పెరిగిపోతుంది.

పదవులొస్తే రౌడీలైనా, డబ్బున్నవాడైనా చేసేదొకటే! అందుకనే రాంపాదరెడ్డి కనిపించినపుడల్లా సూచనలిచ్చేవాడు. మురళి చెప్పిన సలహాప్రకారం నడుచుకోవడంతో రెండుమూడుసార్లు మంచి పబ్లిసిటీ వచ్చింది రాంపాదరెడ్డికి.

అప్పటినుండి మురళీ మాటపై మంచి గురి ఏర్పడింది. అయితే మురళీ దేవస్థానం చూస్తున్నంతకాలం రాంపాదరెడ్డికి దొరికేవాడు కాదు.

ఎప్పుడో ఒకసారి కనిపిస్తే పలకరింపుతోనే ముగించేసేవాడు. పండగలు, మినిస్టర్‌లు వచ్చినప్పుడు ఫోన్ చేస్తే మాట్లాడేవాడు.

అంత పరిచయం వున్న వ్యక్తితో ఇప్పుడు మాట్లాడాలంటే జంకుగా వుంది.

"ఏందిసార్. ఇంత ఎండలో సైకిల్‌మీద పోతున్నారు" అన్నాడు రాంపాదరెడ్డి.

"భోజనానికి ఇంటికి వెళుతున్నాను" ముభావంగానే అన్నాడు మురళి.

"మేం కూడా భోం చేయలేదు. చాలారోజులయ్యింది మనం కలిసి. ఈ పూట నాతో భోజనానికి మీరొస్తున్నారంతే" అంటూ మురళీ సమాధానం కోసం చూడకుండా సైకిల్ లాగేసుకున్నాడు రాంపాదరెడ్డి.

"రేయ్ దీన్ని ఆ స్టూడియో ముందుపెట్టి బీగమేసి రారా" అంటూ తన అనుచరుడిని ఆజ్ఞాపించాడు.

జులపాలు పెంచుకున్న ఒకవ్యక్తి ముందుకు వచ్చి సైకిల్ తీసుకువెళ్ళి స్టూడియోముందు పెట్టి బీగాలేసుకువచ్చాడు.

"మీరు రండి సార్" అంటూ ముందు డోర్ తీశాడు రాంపాదరెడ్డి. వెళ్ళాలా? వద్దా? అని సందేహిస్తూనే "ఇప్పుడెందుకులెండి. మరోసారి వస్తా..." అంటూ నసిగాడు మురళి.

ఆ మాటల్లో గట్టితనం లేదు.

రాంపాదరెడ్డి మురళి మాటలు వినపడ



నట్లే మురళీ చెయిపట్టుకుని సుమో ఎక్కిం చేశాడు.

మురళీ పక్కనే కూర్చున్నాడు రాంపాద రెడ్డి.

తను రాసిన వార్తకు ఖచ్చితంగా కోపం వచ్చేవుంటుంది. ఇప్పుడు తనను తీసుకెళు తున్నారు. తనని కొడతారా? అంత సాహసం చేయడేమో?

బహుశా బెదిరిస్తాడేమో! చూద్దాం. బెది రిస్తే బెదిరించాడని వార్త రాస్తే సరి అను కుంటూ పైకి ధీమాగా ఉన్నట్లు కనిపించే ప్రయత్నం చేశాడు.

సుమో లీలామహల్ మీదుగా కరకం బాడి రోడ్‌లోకి ప్రవేశించింది.

"మొన్న మీ పేరుతో రాసిన వార్త చూసి నాను. బాగా రాసినారు సార్" అన్నాడు రాంపాదరెడ్డి.

ఒక్కక్షణం వూపిరి పీల్చుకోవడం మరచి పోయాడు మురళి.

"నో డౌట్. వీళ్లు ఏదో చేయడానికే తీసు కువెళుతున్నారు. అయినా రోట్లో తలపెట్టి రోకటిపోటు పడుతుందేమో అనుకుంటే ఏం లాభం? ఒక్కొక్కడు దున్నపోతుల్లాగా వున్నారు. కొడితే తనపని ఖతం" మనసు బిక్కుబిక్కుమంటున్నా పైకి మేకపోతు గాంభీర్యం ప్రదర్శించే ప్రయత్నం చేశాడు.

పైకి మాత్రం "థాంక్స్" అన్నాడు అతని కాంప్లిమెంట్‌కు.

"అవును సార్. మీరు ఆ డొక్కు సైకిల్ ఎన్నాళ్లు వాడతారు. ఈమధ్యే నేనొక యమహా కొన్నాను. ఇంటి వద్దనే వుంది. నేను ఎక్కువగా బయట తిరుగుతుంటాను కదా. మీరు వాడుకోకూడదూ" అన్నాడు చాలా క్యాజువల్‌గా రాంపాదరెడ్డి.

సబ్జెక్టు మారిపోయినందుకు సంతోషిం చినా ఏదో సందేహం పీకుతూనే వుంది మురళీకి.



మురళీ మాట్లాడకపోవడం చూసి, "పెట్రోల్ గురించి మీరేం బాధపడకండి. బస్టాండు దగ్గరున్న పెట్రోల్ బంక్‌లో నా అకౌంట్ వుంది. నేను చెబుతాను. మీకెప్పుడు కావాలంటే అప్పుడు, ఎంత కావాలంటే అంత పెట్రోలు పోసుకొచ్చుకోండి" అన్నాడు రిక్వెస్ట్ చేస్తున్న వాడిలాగా.

"అరె. వీడికి అప్పుడే రాజకీయనాయకుల లక్షణాలు వంటబడుతున్నాయే. ఎంత బాగా చెబుతున్నాడు. వద్దనడానికి ఏమాత్రం అవకాశం వుండదు. అందులో ఎక్కడా లంచం ఇచ్చినట్లుగా వుండదు. తన యమహాని వాడుకోమంటున్నాడు కానీ వుంచేసుకోమనడం లేదుకదా! చెప్పినా చెప్పకపోయినా దాని అర్థం ఒకటే!" అనుకున్నాడు మురళి.

ఇటీవలికాలంలో రాజకీయనాయకులు మొదలుకొని ప్రైవేటు సంస్థలు, ప్రభుత్వ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు... అన్నీ ప్రెస్‌లో కవరేజీ బాగా రావాలని, విలేకరులకు, ఫొటోగ్రాఫర్‌లకు మంచి విందు భోజనాలు ఏర్పాటు చేయడం మామూలైపోయింది. ఆ విందుల్లో తాగేవారందరికీ బ్రాందీ, విస్కీ వంటివి పోయడం అఫీషియల్ అయిపోయింది.

'అలా తినడంలో తప్పు లేనప్పుడు, ఇలా వాడుకోవడంలో తప్పేముంది?' అనిపించింది మురళికి.

మరుక్షణంలోనే రాజీపడడంతోనే విలువల పతనం మొదలవుతుందని గుర్తుకొచ్చింది.

అయినా పైకి మాత్రం "చూద్దాంలెండి. అవసరమొచ్చినప్పుడు వాడుకుంటాను" అన్నాడు అతనికి ఇష్టంలేని సమాధానం చెప్పడం ఎందుకులెమ్మని.

సుమో హోటల్ గెస్ట్‌లైన్‌డేస్ ఆవరణలోకి వెళ్ళి ఆగింది. అందరూ దిగారు.

ఆ హోటల్ మొత్తం సెంట్రలైజ్‌డ్ ఏ.సీ.

చేయబడింది.

తలుపుదాటి లోపలికి అడుగుపెట్టగానే మొహంపై చల్లటి పొర ఒకటి ఏర్పడిన ట్లుగా అనిపించింది.

ఆర్డరిచ్చిన పదినిమిషాల్లో భోజనాలన్నీ గదిలోకి వచ్చాయి.

మటన్ సూప్, చికెన్‌ఫ్రై, కోడిగుడ్లు...

వాటిని చూడగానే మురళీ "అయ్యయ్యో, నేను వెజిటేరియన్‌ను. అవ్వేం తినను" అన్నాడు.

"అరెరె... తెలియకపోయెనే. మిమ్మల్ని అడిగి ఆర్డరిచ్చుకుంటే బావుండేది. అయినా ఫరవాలేదు. రేయ్ పోయి వెజిటేరియన్ మీల్స్ పట్రా" అన్నాడు రాంపాదరెడ్డి.

"ఏంటి సార్... మీరు బ్రాహ్మణులా?"

"కాదు"

"బ్రాహ్మణులే ఈరోజుల్లో పబ్లిగ్గా మాంసం తింటుంటే, మీరు తినకపోవడం నిజంగా విచిత్రమే సార్"

బదులుగా చిన్నగా నవ్వాడు మురళి.

"అయినా వెజిటేరియన్‌గా వుంటూ, అట్లా నాన్‌వెజ్ వార్తలు రాసే సాహసం ఎందుకు చేస్తున్నారు సార్?"

మళ్ళీ కథ మొదటికొచ్చిందీ! ఏదైతే చర్చకు రాకూడదని అనుకుంటున్నాడో అదే వచ్చింది. ఆ సబ్జెక్టు వింటూనే అనీజీగా అనిపించింది మురళికి. ఏంమాట్లాడితే ఏం జరుగుతుందో? మౌనంగా వుండిపో యాడు.

ఐదు నిమిషాల్లో వెజిటేరియన్ మీల్స్ వచ్చింది.

అందరూ తినడం ప్రారంభించారు.

ఒక్క రాంపాదరెడ్డి మాత్రం మురళీ దగ్గర కూర్చుని వున్నాడు. మిగతావారంతా పక్కగదిలోకి వెళ్ళి భోంచేస్తున్నారు. రాంపా దరెడ్డి వుండడంతో ఎక్కడ వినబడితే తిడ తాడోనని నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు వాళ్ళు అయినా సన్నగా వాళ్ళ మాటలు వినపడుతూనే వున్నాయి.

"ఇంటికాడ అమ్మా నాయినా బాగున్నారా సార్" అడిగాడు రాంపాదరెడ్డి.

తన ఫ్యామిలీ గురించి ఎలా తెలుసని ఆశ్చర్యపోయాడు మురళి.

అంతలోనే రాంపాదరెడ్డి తెలుసుకోవా లంటే అది నిమిషాల్లో పని అని గుర్తొచ్చి "బావున్నారు" అన్నాడు.

"సార్ మీరు చాలా తెలివైనవాళ్ళు. బాగా చదువుకున్నవాళ్ళు. నేను పెద్దగా చదువుకో లేదు. అయినా మీ మంచికోరి నేనొకటి చెబుతాను. వింటారా సార్" అన్నాడు రాంపాదరెడ్డి.

సుమారు ముప్పైఅయిదు, నలభై ఏళ్ళుం టాయేమో రాంపాదరెడ్డికి. అంత వయ సున్న వ్యక్తి పైగా పేరు మోసిన రౌడీ వయసులో చాలా చిన్నవాడైన తన దగ్గర అలా మాట్లాడ్డం వింతగా అనిపించింది మురళికి.

"మీరు మొన్న 'భూబకాసురులు' అంటూ జీవకోనలో స్థలాల ఆక్రమణను గురించి రాశారు చూడండి. అలాంటివి మరోసారి రాయకండి" అన్నాడు.

అది సూచనలాగే వున్నా, అందులో హెచ్చరిక కూడా ధ్వనించింది.

"ఏది రాయాలో, ఏది రాయకూడదో మాకు తెలుసులే" అని వ్యంగ్యంగా కోపంగా చెప్పాలనిపించింది. అయినా నిగ్రహించుకు న్నాడు. అతను చెప్పడం కొనసాగించాడు.

"అలాంటి వార్తలు రాస్తే మీకు పేరొస్తే రావచ్చునేమోగానీ ప్రమాదాలు కూడా వస్తాయి సార్. అలాంటి వార్తలు రాయ డంవలన మీకొచ్చే లాభమేమిటి సార్?" అన్నాడు రాంపాదరెడ్డి.

"నిజమే! తానెప్పుడైనా ఇది ఆలోచిం చాడా? తనకేమిటి లాభం? ఏమీలేదు! లేదా? లేకపోతే రాయాలన్న తపనెం దుకు?"

రోజంతా కష్టపడినా మూడు పూటలా తిండి గడవని పేదజనం తలదాచుకోవడా

నికి వేసుకున్న గుడిసెలను పీకివేసినప్పుడు వారి కళ్లల్లో కనిపించే భయం, అభద్రత, బేలతనం, నిస్సహాయతలను పోగొడితే తనకేం వస్తుంది?

"సార్... నేను ఐదేళ్ళకిందట ఈ వూరికి వచ్చినప్పుడు నా దగ్గర నా ఖర్చులకు కూడా సరిపోయేంత డబ్బులు లేవు. నేనెవరో తిరుపతిలో ఎవరికీ తెలియదు. నేను ఎన్నుకున్న మార్గం దౌర్జన్యం. రౌడీయిజంతో బెదిరించి ఖాళీలు ఆక్రమించుకోవడం, అమ్ముకోవడం, గలాటాలు జరిగినప్పుడు మధ్యవర్తిత్వాలు చేసి వేలరూపాయలు వసూలు చేసుకోవడం. ఇప్పుడు నా ఆస్తి ఎంతుందో ఎవరూ వూహించలేరు. నా బ్యాంక్ బ్యాలెన్స్ కోట్లకు చేరుకుందంటే నాకే నమ్మబుద్ధి కావట్లేదు"

ఆ విషయం మురళీకి కూడా తెలుసు.

భోజనం ముగిసింది.

చేతులు కడుక్కుని వస్తూ "ఇప్పుడు రాంపాదరెడ్డి నాకు బాగా తెలుసు అని గొప్పగా చెప్పుకునేవాళ్ళు తిరుపతిలో చాలా మంది వున్నారు. నీతి, ధర్మం, పాపం అంటూ చచ్చుమాటలు చెప్పుకుంటూ కూర్చుంటే నాకివన్నీ సాధ్యమయ్యేవా చెప్పండి" అన్నాడు రాంపాదరెడ్డి. అవునని చెప్పగలడా తను? పోనీ కాదనీ, తప్పనీ చెప్పగలడా?

"అంటే మిమ్మల్ని నాలాగా రౌడీయిజం చేయమనీ కాదూ, అవినీతిపరులు కమ్మనీ కాదు. వాటి జోలికి వెళ్ళకుండా, దూరంగా వుంటూ మీ నీతినీ, ధర్మాన్నీ పాటించుకోండి. జీవితం సినిమా కాదు. మనం హీరోలమూ, విలన్‌లమూ కాము. మీరు రాసిన వార్తవలన నాకు రెండో, మూడో లక్షలు నష్టం కలుగుంటుంది. అది నాకు పెద్ద లెక్కకాదు. అయినా నేను కాబట్టి సరిపోయింది. నా స్థానంలో ఇంకెవరన్నా వుండివుంటే ఏమయ్యేదో తెలుసా? "

మురళీ ఏమీ మాట్లాడలేదు.

"మొత్తంమీద నేను చెప్పదలచుకున్నది ఒకటే సార్. బురదలాంటి వాళ్ళం మేము. బురదలో కాలుపెట్టినా, రాయి విసిరినా అది మీపైకే వచ్చిపడుతుంది"

ఒక్కముక్కలో ఎంత సూటిగా చెప్పాడు. నిజమేకదా!

ఎవరెలాపోతే మనకేం? నీతి, నిజాయితీ, పాపం, పుణ్యం అంటూ మిడిసిపడితే తనకు మిగిలేదేమిటి?

నేడు సమాజమే అవినీతి ప్రవాహమై కొట్టుకుపోతోంది. దౌర్జన్యమేవ జయతే అంటూ నినదిస్తోంది. మనం మాత్రం ఎందుకు ఎదురీదాలి? రాంపాదరెడ్డి చెప్పినట్లుగా జీవితమంటే సినిమా కాదుకదా! ఎన్ని ఇబ్బందులొచ్చినా ఎదుర్కొని, విజయుడై సుఖాంతంగా ముగిసే హీరో కథ, వాస్తవానికి ఎంత దూరంగా వుంటుందో తనకు తెలియంది కాదు.

అయితే మరి తను అవినీతిని ఆశ్రయించగలడా? ఇ.వో ఇస్తానన్న షాప్ సెట్టుకోగలడా? రాంపాదరెడ్డి ఇస్తానన్న యమహా వాడుకోగలడా?

ఆ ఆలోచనే వెగటుగా అనిపించింది.

తలంతా పోటెత్తుకుంది.

అసలు తనేనా ఇలా ఆలోచిస్తున్నది.

కళ్ళముందు అన్యాయం జరుగుతుంటే, మరీ ముఖ్యంగా పేదలు, కార్మికులకు ద్రోహం జరుగుతుంటే తను భరిస్తూ వుండగలడా?

తన దగ్గరున్నది కలం. కత్తికన్నా గొప్పది. ఆ కలాన్ని ఝళిపించకుండా చేతుల్ని కట్టేసుకోగలడా?

"నో... నో..." గట్టిగా అరిచింది మనసు.

మురళీ ఎంతకీ మాట్లాడకపోవడం చూసిన రాంపాదరెడ్డి"ఇక బయలుదేరుదామా సార్" అన్నాడు.

తలూపాడు మురళి.

మురళీని సుమో ఎక్కించి, "మేము తరువాత వస్తాం సార్. మీరు ఎక్కడ దింప

మంటే అక్కడ దింపుతాడు డ్రైవర్. నా దగ్గర మీరు మొహమాట పడక్కర్లేదు. ఎప్పుడు ఏ అవసరమొచ్చినా ఫోన్ చేయండి చాలు. అది డబ్బైనా ఫరవాలేదు. మరొకటైనా ఫరవాలేదు. అన్నట్లు యమహా గురించి మరచిపోకండి. మీకు వీలున్నప్పుడు వచ్చి తీసుకుపోండి" అన్నాడు.

అతను అలా మాట్లాడుతుంటే తనకు కావలసినవాడులాగా అనిపిస్తోంది. బహుశా మనసులో అవన్నీ తనకు కావాల నిపిస్తుండడంవలన,అతను ఇస్తానంటుంటే అది సంతోషపడుతోందేమో? అందుకే రాంపాదరెడ్డి ఎంతో మంచివాడు అనుకోలే కపోయినా, చెడు అభిప్రాయాన్ని మాత్రం కలిగించడంలేదు. అందుకేనేమో అతను అవి ఇస్తా, ఇవి ఇస్తానంటున్నా వద్దు అని చెప్పలేకపోతున్నాడు తను.

"నేను నాకు తెలిసినంతలో చెప్పాను సార్. నాకు మాట్లాడ్డం రాదు. మీరు వింటే వినచ్చు లేదూ ఈ పోకిరి నాకొడుకు మాటలు నేను వినేదేమిటి అనుకున్నా అను కోవచ్చు కానీ నాకు తెలిసింది ఒకటే నా దారికి ఎవరడ్డొచ్చినా తొలగించుకుంటూపో వడమే" అన్నాడు రాంపాదరెడ్డి. చివరి వాక్యం చెప్పేటప్పుడు అతని కంఠంలో కాఠిన్యం తొణికిసలాడింది. సుమో కది లింది.

ఆ మాట మురళిలోని పౌరుషాన్ని తట్టి లేపింది. మనసు అల్లకల్లోలమయింది.

అంటే తనను చంపేస్తానని హెచ్చరిస్తు న్నాడా? తను ఇలాంటి బెదిరింపులకు భయపడిపోతాననుకున్నాడా? ఇట్లాంటి వాళ్ళ బెదిరింపులకు మురళీ లొంగిపో తాడా? ఇలాంటివాళ్ళు ఎంతమంది వచ్చినా తన మార్గాన్ని మార్చుకునే ప్రసక్తేలేదు. సుమో వేగంగా పోతోంది.

"సార్..." డ్రైవర్ పిలిచాడు.

కోపంగా డ్రైవర్‌కేసి చూశాడు మురళి.

అతను డ్రైవ్ చేస్తూనే వంద రూపాయల నోట్లకట్టలు రెండు ఎత్తి తన వడిలో పెట్టి "అన్న ఇమ్మన్నాడు సార్" అన్నాడు.

ఆ డబ్బులు చూడగానే వళ్ళంతా అస హ్యంతో జలదరించింది. వాంతి వచ్చే భావన కలిగింది. మనసంతా వికారంగా తయారై ఒక్కసారిగా అలజడిని రేపింది. వెగటు తారాస్థాయికి చేరుకుంది.

తను ఏం చేస్తున్నాడో తెలియనంత ఆవేశం ఆక్రమించుకుంది. ఆ సుమో వేరే వాళ్ళదన్న సంగతి మరచిపోయి పిచ్చిగా పిడికిలి బిగించి, మోచేత్తో అద్దంపై గట్టిగా కొట్టాడు. అది భళ్ళుమంటూ పగిలిపో యింది.

వళ్ళో వున్న నోట్లకట్టలను ఎత్తి బయ టకు విసిరేశాడు.



**ఆర్.**డి.ఓ. కార్యాలయంలోని మీటింగ్ హాల్‌లో జిల్లా అభివృద్ధి సమీక్షా కమిటీ సమావేశం జరుగుతోంది. జిల్లాలోని ఇరిగే షన్, బి.సి. కార్పొరేషన్, ఎస్.సి, ఎస్.టి. కార్పొరేషన్, పరిశ్రమలశాఖ, ఆర్.టి.సి., పంచాయతీరాజ్, ఆర్అండ్‌బి, విద్యుత్‌శాఖ మొదలైన అన్ని ప్రభుత్వశాఖల ఉన్నతాధికా

రులు అక్కడ కూర్చునివున్నారు.

డి.డి.ఆర్.సి. అధ్యక్షుడు, భారీనీటిపారు దల శాఖామంత్రి నాగేశ్వరనాయుడు, అతని పక్కన జిల్లా మంత్రి గోపీనాథరెడ్డి, జిల్లాలోని ఎం.ఎల్.ఏలు., ఎం.పీ.లు, కలె క్టర్ కూర్చుని వున్నారు. నాగేశ్వరనాయుడు అజెండాలోని ఒక్కొక్క అంశాన్నే ప్రవేశపె డుతున్నాడు.

ఎం.ఎల్.ఏలు, ఎం.పీలు వాళ్ళకున్న సందేహాలు అడుగుతున్నారు. ఫలానాచోట ఫలానా పని ఎందుకు సకాలంలో పూర్తికా లేదని అడుగుతున్నారు. ఇంతేనా అభివృద్ధి అంటూ కొంతమంది అధికారులపై మండి పడుతున్నారు.

ప్రతిపక్ష పార్టీ ఎం.ఎల్.ఏలు మంత్రు లను అసమర్థులుగా ఎత్తిచూపాలనే తాప త్రయంలో విమర్శలు గుప్పిస్తున్నారు. మధ్యమధ్యలో వ్యంగ్యోక్తులు విసురుతు న్నారు.

ప్రెస్‌లైన్‌లో కూర్చునివున్న మురళీకి విసుగొచ్చింది.

ప్రెస్‌క్లబ్‌నుండి ఒకటిన్నర కిలోమీటర్ దూరం ఎండలో రావడం, అందునా ఉదయం టిఫిన్ చేసి రాకపోవడంతో తల నొప్పిగా వుంది. అక్కడి వాతావరణం మరింత విసుగును పుట్టిస్తూ తలనొప్పిని పెంచుతుండడంతో ఇక అక్కడ వుండలేక పోయాడు.

డివిజినల్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్‌కు "నోట్‌చేసుకోండి తరువాత మీదగ్గర రాసు కుంటా"నని చెప్పి బయటకు వచ్చేశాడు.

రోడ్డులోకి అడుగుపెట్టాడో లేదో హీరో హోండా ఒకటి దూసుకు వచ్చింది. బాగా దగ్గరికొచ్చాక గమనించాడు మురళీ. డ్రైవ్ చేస్తున్న వ్యక్తి బాగా తాగున్నాడు. ఇక తప్పించుకునే మార్గంలేదే అనుకుంటూనే అప్రయత్నంగా పక్కకు గెంతాడు.

తృటిలో తప్పిపోయింది ప్రమాదం.

మురళీ గెంతడం చూసి హీరోహోండా వెనుక సీటులో కూర్చున్న వాడితోసహా ఇద్దరూ అహ్హహ్హా అంటూ నవ్వారు.

వాళ్ళు పోయిన వైపే చూస్తూ తిట్టు కున్నాడు మురళీ.

హీరోహోండా వెళ్ళి కొంతదూరంలో కొత్తగా నిర్మాణంలో వున్న నాలుగంతస్తుల భవనం ముందు ఆగింది. అక్కడ పదిమం దికి పైగా యువకులు నిలబడివున్నారు. వాళ్ళంతా అప్పుడప్పుడూ భవనంలోకి చూస్తూ ఏదో మాట్లాడుకుంటూ వున్నారు.

అక్కడ వాతావరణం అసహజంగా అని పించింది మురళీకి.

నలుగురు ఒకచోట గుమికూడి కనిపిం చినా, ఏ రకమైన ఆసక్తికర సంఘటన జరి గినా, అసహజంగా ఏది కనిపించినా రిపో ర్టర్ అనే వాడు అక్కడేం జరుగుతోందో తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. అది రిపోర్టింగ్‌లో ప్రాథమిక సూత్రం.

మురళీ ఆకలి మరచిపోయి నెమ్మదిగా ఆ బిల్డింగ్‌వైపు అడుగువేశాడు.

ఆ బిల్డింగ్‌కు ఇంకా ప్లాస్టరింగ్ వేయ లేదు.

కింద మొత్తం పార్కింగ్‌కు కేటాయించి వుంది. అక్కడ రెండు కార్లు ఆగివున్నాయి.

వాటి పక్కగా హీరోహోండాలూ, స్కూట ర్లు నిలిపివున్నాయి.

తనను ఎవరూ పట్టించుకోకపోవడంతో నెమ్మదిగా లోపలికి వెళ్ళిపోయి మిద్దె మెట్లు ఎక్కసాగాడు.

అప్పుడే ఎవరో ఒక వ్యక్తి మెట్లు దిగుతు న్నాడు.

ఎదురుగా వస్తున్న అపరిచిత వ్యక్తిని చూసి అతనికి అనుమానం వచ్చింది. మురళీ కూడా చూశాడు ఆ వ్యక్తిని. నోట మాట రాలేదు.

"ఎవరికోసం? " అన్నాడావ్యక్తి దబాయిస్తు న్నట్లుగా.

ఒక్కక్షణం ఏంచెప్పాలో తోచలేదు ముర ళీకి.

ఇందాకా లోపలికొస్తున్నప్పుడు బయట నిలబడి వున్న యువకుల మాటల్లో రాజేష్ అనే పేరు వినివుండడం గుర్తొచ్చి గబుక్కున ఆపేరు చెప్పేశాడు.

ఎదుటి వ్యక్తి ఆ సమాధానానికి సంతృప్తి చెంది మరేం మాట్లాడకుండా దిగిపోవడంతో హమ్మయ్యా అని వూపిరిపీల్చుకున్నాడు మురళీ.

మెట్లు ఎక్కడం పూర్తికాగానే వచ్చిన తలుపును తీశాడు. అక్కడ కనిపించిన దృశ్యానికి మ్రాన్పడిపోయాడు మురళీ.

తను చూస్తున్నది తనే నమ్మలేకపోయాడు.

బయటినుండి చూస్తే పూతపనికాకుండా ఇంకా నిర్మాణంలో వున్నట్లున్న ఆ భవనం లోపల అందుకు పూర్తి భిన్నంగా వుంది.

అక్కడంతా పాలిష్‌రాయి పరిచి వుంది. మొత్తం ఏ.సి. చేయబడింది. గోడలన్నిటికీ రంగులువేసి అందంగా తీర్చిదిద్దారు. ఒక వారగా సోఫాసెట్, టీ.వీ. పక్కనే బొమ్మలతో కళకళలాడుతున్న షోకేసు వున్నాయి. టీ.వీ. పక్కనే వైర్‌లెస్ ఫోన్ కూడా వుంది. లోపలికి అడుగుపెట్టాడు శబ్దం రాకుండా అక్కడ ఇంకోగది ఎంట్రన్స్ కనిపిస్తోంది.

లోపల పెద్దతలకాయలే వున్నట్లు ఒకతను కాపలాగా నిలుచని వున్నాడు.

మురళీని చూడగానే "ఎవరు కావాలి?" అన్నాడతను.

తడబడితే తన శరీరం జల్లెడయిపోతుందనుకుంటూ "రాజేషన్న" అన్నాడు తనకేదో బాగా తెలిసిన వ్యక్తిలాగా.

రాజేష్ జిల్లాలోని ప్రముఖ దొంగ సారా వ్యాపారి. కోటీశ్వరుడు. అధికార పార్టీలో కీలకమైన వ్యక్తి. ఆయన గురించి మురళీ చాలా వినివున్నాడు.

"నువ్వెవరు?"

"కార్యకర్తను" అన్నాడు తడుముకోకుండా.

"సరుకుకోసం వచ్చావా?"

ముందూ వెనుకా ఆలోచించకుండా "అవును" అన్నాడు.

"అందర్నీ బయటుండమని చెప్పారు కదా. ఆ పక్క చూడు, వాళ్ళు పార్సిల్ చేస్తున్నారు కదా! అప్పుడే అంత తొందరైతే ఎట్లా?"

"ఎంతసేపని వుంటాం. మేం కూడా పోవాలగదా. లోపల సార్‌తో నేను మాట్లాడతాను వుండు" అంటూ తలుపు వద్దకు పోబోయాడు.

"వద్దులే... వద్దులే... లోపలికి ఎవర్నీ పంపించవద్దని అన్న ఇందాకా సీరియస్‌గా చెప్పాడు"

"ఎవరెవరున్నారు లోపల?" చాలా క్యాజువల్‌గా అడిగినట్లు అడిగాడు.

పేర్లు చెప్పాడు.

ఆ పేర్లన్నీ రాజకీయాల్లో తలపండిన వాళ్ళవి.

"సరే... నేను పని ఎంతవరకైందో చూసొస్తా"నంటూ ఎదురుగా వున్న గది వైపు వెళ్ళాడు మురళీ.

ఆ గదినిండా సారా క్యాన్‌లు, సారా పొట్లాలు. వాటిని చాక్లెట్‌లు తెచ్చే అట్టపెట్టెలకు సర్దుతున్నారు నలుగురు.

జంకులేకుండా వాళ్ల దగ్గరికి వెళ్ళి "కింద అందరూ ఎదురుచూస్తూ వున్నారు. త్వరగా కానివ్వండి" అన్నాడు మురళీ.

ఏ పార్టీనాయకులైనా ఎన్నికలప్పుడు తమ కార్యకర్తలందరినీ గుర్తుపెట్టుకోలేరు. ప్రతిసారీ కొత్త ముఖాలు కనిపిస్తూనే వుంటాయి. జర్నలిస్టుగా తిరుపతిలోని రాజకీయనాయకులకు తాను బాగా పరిచయం. మంత్రులు చూసినా తనను గుర్తుపట్టేస్తారు. కానీ సాధారణ కార్యకర్తలెవరూ తనని గుర్తుపట్టలేరు. ఆ ధైర్యంతోనే దూసుకుపోతున్నాడు మురళీ.

"డైలాగులు చెప్పకపోతే నువ్వూ ఒక చెయ్యి వేయవచ్చు కదా?" అన్నారు వాళ్ళు. మరింత దగ్గరికి వెళ్ళి సారా పాకెట్లు అట్ట

పెట్టెలలో సర్దుతూ సారా మొత్తం ఎంత విలువ చేస్తుందో, ఎక్కడినుండి తెప్పించారో, ఎవరు తెప్పించారు, ఎవరు తెచ్చారు, ఎలా తెచ్చారు, ఏఏ నియోజక వర్గాలకు పంచుతారు అన్న విషయాలను ఏ అనుమానం రాకుండా క్యాజువల్‌గా అడిగి తెలుసుకున్నాడు.

పాస్‌కెళ్ళొస్తానని చెప్పి నెమ్మదిగా దిగి రోడ్డుపైకి వచ్చేశాడు మురళీ.

రేడియోస్టేషన్ దాటి రాయల చెరువు రోడ్డులోకి వచ్చేదాకా గుండె వేగంగా కొట్టుకుంటూనే వుంది.

తను చేసిన సాహసం తల్చుకునేసరికి ముచ్చెమటలు పట్టాయి మురళీకి.

ఏమాత్రం అనుమానం వచ్చున్నా తను ప్రాణాలతో బయటపడే అవకాశం వుండేది కాదు. ఎంతకైనా తెగిస్తారు రాజకీయనాయకులు.

ఏది ఏమైతేనేం తను బతికి బయటపడ్డాడు.

ఇప్పుడేం చేయాలి?

ఇలాంటివి వార్తగా రాయడంవలన పెద్దగా ఫలితం వుండదు. ఈ సరుకు ఏకంగా మినిస్టర్ తెప్పించి, ఆయన చేతుల మీదుగా మారుతున్నది కాబట్టి వార్త డెస్క్‌లోకి పోతూనే డెస్క్‌లోని ఏ సబ్ ఎడిటరో చూసి మంత్రిగారికి ఫోన్‌చేసి, తన చేతులు, నాలుక తడుపుకునే ప్రయత్నం చేస్తాడు.

వార్త కాస్తా బుట్టదాఖలవుతుంది. లేదూ అంటే అవసరమైనవన్నీ ఎడిట్ అయిపోయి అవశేషాలు అచ్చవుతాయి.

పోలీసులకు చెబితే?

ఈ ఏరియా ఎస్.ఐ. శ్రీనాథ్ తనకు బాగా తెలుసు. కాబట్టి తప్పకుండా అరెస్ట్ చేస్తాడు. ఇది బావుంది అనుకుని వెంటనే టెలిఫోన్ బూత్‌కు వెళ్ళి ఎస్.ఐ.కి ఫోన్ చేశాడు.

రింగవుతూ వుంది.

అప్పుడొచ్చింది ఆ ఆలోచన. తన పేరు, హోదా చెప్పడం అంతమంచిది కాదేమోనని.

"హలో ఎస్.ఐ. స్పీకింగ్"

పేరు చెప్పకుండా విషయాలన్నీ వివరంగా చెప్పాడు మురళీ.

"థాంక్‌యూ- తప్పకుండా పట్టుకుంటాం" అన్నాడు ఎస్.ఐ.

టెలిఫోన్ బూత్‌నుండి బయటకు రాగానే అనుమానం వచ్చింది.

శ్రీనాథ్ తనకు పరిచయం. కానీ అతను కక్కుర్తి పడడని ఎవరు చెప్పగలరు. అసలే మంత్రిగారి సరుకు. భయపడి అరెస్ట్ చేయకపోవచ్చు? ట్రాన్స్‌ఫర్ కావాలనో, ప్రమోషన్ కావాలనో మంత్రిగారిని అడిగి, హామీ ఇప్పించుకుని, సరుకు మార్పించేసిన తరువాత దాడిచేసి అక్కడేం లేదని చెప్పినా చెప్పవచ్చు" అనిపించగానే మళ్ళీ టెలిఫోన్ బూత్‌లోకి దూరి సి.ఐ.కి ఫోన్‌చేశాడు.

పూర్తి వివరాలు అందించి 'హమ్మయ్య అయిపోయాడు' అనుకుంటూ బయటకొచ్చాడు. అంతలో మళ్ళీ అనుమానం ప్రవేశించింది.

మళ్ళీ టెలిఫోన్ బూత్‌లోకి దూరాడు.

డి.ఎస్.పి.కి, ఎ.ఎస్.పికి, ఎస్.పి.కి ఫోన్‌లు చేసి వివరాలన్నీ చెప్పి, చివరగా 'ప్రెస్‌వాళ్ళకు కూడా ఫోన్‌చేసి చెప్పాను సార్' అని ఎస్.పి.కి మాత్రం చెప్పి పెట్టేశాడు.

అతనికి సంతృప్తిగా అనిపించింది.

ప్రెస్ వాళ్ళకు తెలుసుకాబట్టి పట్టుకోకపోతే తనకు చెడ్డపేరు కాబట్టి, ఎస్.పి., ఎస్.పి.కి తెలుసుకాబట్టి ఆయన చెప్పాడు కాబట్టి కిందిస్థాయి అధికారులూ ఎవరికి వాళ్ళు ఒక్కసారిగా నిజాయితీపరులైపోతారు.

★ ★ ★

మురళీ అంచనా తప్పుకాలేదు.

ఆ బిల్డింగ్‌ను పోలీసులు రైడ్ చేశారు. లక్షల రూపాయల విలువైన నాటు

సారాను ధ్వంసం చేశారు. ఆరు మందిని అదుపులోకి తీసుకున్నారు. అదుపులోకి తీసుకున్న వారిలో ప్రముఖ నాయకులెవరూ లేరు. కేసు నమోదు చేసేటప్పుడు మంత్రిపేరు గానీ, ఎం.ఎల్.ఏ. పేరుగానీ, ఇతర నాయకుల పేర్లుగానీ రాలేదు.

మురళీ మిగతా విలేకరులతో మాట్లాడుతూ తనకెవరో వేరే వాళ్ళు చెప్పినట్లుగా వాస్తవాలను చెప్పేశాడు.

మరుసటిరోజు పేపర్లలో అధికార పార్టీ మంత్రే ఈ సారా పొట్లాల పంపిణీలో కీలకమైన వ్యక్తని విశ్వసనీయ వర్గాల సమాచారం అంటూ థర్డ్‌వెర్షన్‌లో వార్తలు వచ్చాయి.

ఆ వార్త ప్రతిపక్ష పార్టీకి పెద్ద ఆయుధంగా మారింది. వెంటనే ప్రెస్ మీట్‌లు పెట్టి అధికారపార్టీ నిజస్వరూపం తెలుసుకోండి ప్రజలారా అంటూ దుమ్మెత్తిపోశారు.

విషయం తెలుసుకున్న మినిస్టర్ గోపీనాథరెడ్డి కళ్ళు అగ్నిగోళాలే అయ్యాయి.

"రేయ్ ఏ పోలీసు నాకొడుక్కి అంత కొమ్ములొచ్చాయో కనుక్కోండిరా. కత్తిరింపు చేద్దాం" అన్నాడు కసిగా.

★ ★ ★

చీకట్లు ముసురుకుంటున్నాయి.

చల్లని గాలి వీస్తోంది.

జీవకోనలో మనుషుల అలికిడి పెరుగుతోంది.

దూరంగా కొండలు కాలుతున్నాయి. సీరియల్ సెట్‌లాగా ధగధగా మెరుస్తున్నాయి మంటలు. చీకటితో పొగ కలిసిపోతూ వింతరూపాన్ని సంతరించుకుంటోంది.

ఆ మంటల్లాగే వున్నాయి గంగావతి ఆలోచనలు.

మంటల్లో చిక్కుకున్న రెక్కలు రాని పిల్లలను రక్షించుకోలేక, వదులుకోనూ లేక పైన గిరగిరా తిరుగుతున్న పక్షుల్లా ఆమె రోదిస్తోంది.

"ఏమిటీ పరిస్థితి. ఎందుకిలా జరుగుతోంది. ఈ పరిస్థితి నాకేనా? అందరికీనా? వాళ్లు చెప్పేది చూస్తుంటే అందరూ ఈ పరిస్థితిలోనే వున్నారు. అందంగా పుట్టడం తనకు శాపమా?

చూసిన వెంటనే పని ఇస్తున్నారు. అంటే అందాన్ని చూసి ఇస్తున్నట్లే కదా? పని వస్తుందా, రాదా అన్నదాన్నిబట్టి పని ఇవ్వాలి కానీ అందంగా వుందా లేదా అని చూసి పని ఇవ్వడం ఏమిటి?

ఒకవేళ తను అందంగా లేకుంటే తనకు వెంటనే పని ఇచ్చేవాళ్ళు కారా? కూలీలెవరూ తమ సోకులకు సమయాన్ని వెచ్చించలేరు. పైగా మాసిన దుస్తులు, దువ్వని తల ఎప్పుడూ నములుతూ వుండే వక్కాకు వంటి వాటివలన అంతో ఇంతో బాగున్న ఆడవాళ్ళు కూడా కొంత వికారంగానే కనిపిస్తారు. అయినా వాళ్ళందరికీ పని ఇస్తున్నారు. బహుశా అంతకు మించిన అందగత్తెలు దొరక్కనేమో?

తను రోజూ గమనిస్తూనే వుంది కదా. బక్కబక్కగా వున్న వారికీ, అందవికారులకు అంత సులువుగా పని దొరకడంలేదు. వాళ్ళను పిలుచుకెళ్లే వాళ్లకు మనుషుల అవసరం ఎక్కువై వుండాలి. అయినా పనికీ, అందానికీ సంబంధం ఏమిటి? మేస్త్రీకి కావలసింది పని. రోజంతా వళ్ళు దాచుకోకుండా పనిచేసే వాళ్ళకు పని ఇస్తే సరిపోతుంది కదా? మధ్యలో ఈ కాంట్రాక్టర్ల, మేస్త్రీల దర్బారేమిటి? పనిలోకి వచ్చిన ఆడవాళ్ళందరూ ఇష్టమున్నా లేకున్నా తమ కింద పడుకోవాలన్నది తమ హక్కు అన్నట్లు ప్రవర్తిస్తున్నారు.

అయితే ఇప్పుడు తనేం చేయాలి?

మేస్త్రీలు చెప్పినట్లు నడుచుకోవాలా? అంటే వాళ్ళకు లొంగిపోవాలా? అది... అది... తనకు అసాధ్యం. అది స్పష్టం.

ఎన్ని కష్టాలైనా రానీ, పని దొరకకుండా పస్తులు పడుకోవాల్సిరానీ గానీ చచ్చినా పడుకోను. పడుకోలేను. చావనైనా

చస్తుంది కానీ మనసును చంపుకుని మానాన్ని వదులుకొనే ప్రసక్తే లేదు.

గంగావతి మనసు గిలగిలా కొట్టుకుంటోంది.

ఈ రోజైనా భర్తకు చెప్పేయాలి?

వద్దు... వద్దు... భర్తకు చెప్పి ఏం ప్రయోజనం?

ఏం చేసినా తనే చేయాలి!

దుష్టులకు దూరంగా వుండమన్నారు పెద్దోళ్లు.

ఇంత పెద్ద పట్టణంలో కొంతమందైనా మంచివాళ్ళు వుండకపోతారా? వాళ్ళ దగ్గర తనకు పని దొరకకపోతుందా?

★ ★ ★

యథాప్రకారం ఇంటి పనులన్నీ ముగించుకుని చద్ది తాగి అన్నం బక్కెట్టు ఎత్తుకుని 'ముందురోజు ఏమీ జరగనట్లే' బయలుదేరింది గంగావతి.

నాలుగు కాళ్ళ మండపం చేరుకుంది.

నిరీక్షణ మొదలైంది.

రాజారెడ్డి దిగాడు. గంగావతివైపు మిర్రి మిర్రి చూశాడు.

తనకేమీ పట్టనట్లు నించుంది గంగావతి.

కొంతమంది ట్రాక్టరెక్కారు.

ట్రాక్టరు వెళ్ళిపోయింది.

నిరీక్షణ కొనసాగింది.

నాగరాజు మేస్త్రీ ట్రాక్టరొచ్చింది.

మేస్త్రీ గంగావతివైపు కోపంగానూ, కసిగానూ చూశాడు.

అంతలోనే తమాయించుకున్నాడు.

మగవాళ్లలో తనకు నచ్చిన వాళ్ళను ఎంపికచేశాడు.

వాళ్ళందరూ ట్రాలీ ఎక్కి కూర్చున్నారు.

ఆడవాళ్ళవైపు వచ్చి ముందురోజు పిలిచిన వాళ్ళనే పిలిచాడు. చివరగా గంగావతి వద్దకు వెళ్ళాడు.

ఇక జన్మలో తనని పిలవడనుకున్న గంగావతి ఆశ్చర్యానికి లోనయ్యింది.

"వస్తావా? " అన్నాడు అనుమానంగానే.

వెళ్తే జరిగే విషయాలను అప్పటికే విని వుంది గంగావతి.

తనతో పడుకోవడానికి ఇష్టపడని కూలీలను బాగా కష్టపెడతాడు. ప్రతి పనిలోనూ తప్పులు చూపుతూ బూతులు తిడతాడు. అందరికంటే ఎక్కువ పని చేయించి, చివరగా వీలైతే ఏదో ఒకటి పగలగొట్టి ఆ రోజు కూలి ఎగవేసినా ఆశ్చర్యపోనక్కరలేదు. దాంతో చూసీ చూడనట్లు తలతిప్పుకుంది గంగావతి.

అతనికి పౌరుషం ముంచుకొచ్చింది. ఒక కూలీమనిషి తనను అవమానపరచడమా అని కుతకుతలాడిపోయాడు.

ఈ దేశంలో ప్రతి ఒక్కడికీ స్వేచ్ఛ వుంది.

కూలికి వస్తే వాళ్ళ స్వేచ్ఛను తమ చేతుల్లోకి తీసుకోవచ్చు. ఎట్లా కావాలంటే అట్లా ఆడించవచ్చు. కూలికి రాకపోతే చేయగలిగిందేమీ లేదు.

అతను విసవిసా వెళ్ళి ట్రాక్టరెక్కాడు.

ట్రాక్టరు ముందుకు సాగిపోయింది.

మళ్ళీ నిరీక్షణ మొదలైంది.

గంగావతికి అసహనంగా వుంది.

మళ్ళీ ఓ ట్రాక్టరు వచ్చింది. అందులోనుండి రాఘవయ్య దిగాడు. అతన్ని చూడగానే గంగావతికి ఎందుకో కొంత ధైర్యం చిక్కింది. అందుకు కారణం అతని వయసు. అరవైకి అటూ ఇటూగా వుండొచ్చు. మీసాలు తెల్లబడి వున్నాయి. బట్టతల. మనిషి కొంచెం ఎరుపే. ముసలివాడైపోయినట్లు అతని ముఖంలోని ముడతలు బాగా కనిపిస్తున్నాయి.

అతను ఆడవాళ్ళలో మొదటగా గంగావతినే ఎంపికచేశాడు.

గంగావతికి ఎందుకో నవ్వొచ్చింది.

గట్టిగా నవ్వితే ఏమైనా అనుకుంటాడేమోనని నవ్వును బిగబట్టుకుంటూ ట్రాక్టరెక్కింది.

ఆమె వెనక మరికొంతమంది ట్రాక్టరె

క్కారు

రాఘవయ్య డ్రైవర్ వెనుక వేసివున్న చెక్కపైన కూర్చుని ట్రాలీవైపు చూస్తున్నాడు. అప్పుడప్పుడూ తన తెల్లమీసాల్ని, వీధినాటకాల్లో దుర్యోధనుడు సవరించినట్లు సవరిస్తున్నాడు.

అది చూసి గంగావతి మనసులోనే నవ్వుకుంది.

చాలారోజుల తరువాత ఆమెకు నవ్వురావడంతో మనసుకు కొంత రిలీఫ్‌గా అనిపించింది. దానికి తోడు గాలి బాగా వీస్తుండడంతో హాయిగా అనిపిస్తోంది. ట్రాక్టరు కాలనీ దాటి పరుగులెత్తసాగింది. ట్రాలీలో మాట్లాడుకుంటున్నవారి మాటలనుబట్టి రాఘవయ్య బ్రాహ్మణుడని తెలుసుకుంది. ఆ విషయం మరింత సంతోషాన్నిచ్చింది. బ్రాహ్మణుల మడి ఆచారాలను గూర్చి గంగావతికి కొంత తెలుసు. వాళ్ళు దళితులను అంటుకోవడమే మహాపాపంగా భావిస్తారు. కాబట్టి తనకు 'అలాంటి' ఇబ్బందులుండవు!

రైల్వేగేటుదాటి రెండు కిలోమీటర్లు ముందుకెళ్ళి ట్రాక్టరాగింది. అక్కడున్న విశాలమైన ప్రదేశంలో నాలుగైదు ఇటుకబట్టీలు దూరదూరంగా కాలుతున్నాయి. వాటికి పక్కగా గుంతలు తీసివున్నారు. కొంత దూరంలో పచ్చి ఇటుకలు ఎండబెట్టి వున్నారు.

రోడ్‌కు మరోవైపు పచ్చని పంటపొలాలు. 'ఈ పనైనా స్థిరంగా వుండేలా చూడు స్వామీ' అంటూ దూరంగా కనిపిస్తున్న గుడిగోపురం చూసి వెంకటేశ్వరునికి మొక్కుకుంది.

పని మొదలైంది.

ఒకరు మన్నుతొక్కుతుంటే, మరొకరు ట్రాక్టర్‌కి మన్ను వేస్తున్నారు. ఆ మన్నును ఇటుకలు అచ్చువేసేవారిదగ్గరకు మోస్తూ వున్నారు కొందరు.

ఓవైపు అచ్చులు వేస్తుంటే వాటిపైన బూడిద చల్లుతున్నారు ఇద్దరు. గంగావతి చీర కొంత ఎగగట్టి, టకారితో బంకమట్టిని పక్కనున్న వారికి అందిస్తోంది. నాలుగడుగులు ముందుకువేసి టకారి అందుకోవడం, మళ్ళీ వెనక్కి వచ్చి మరొకరికి అందించడం. పని సులువుగానే అనిపించింది. చకచకా మట్టి కుప్ప తరుగుతోంది. ఇటుకలు తయారవుతున్నాయి. క్రమంగా ఎండతీవ్రత ఎక్కువకాసాగింది.

దూరంగా అటూ ఇటూ వెళ్ళే బస్సులు కుయ్...మంటూ హారన్‌లు వేస్తూ దూసుకుపోతున్నాయి.

పని చేస్తున్నవారికి చెమటలు పట్టడం ప్రారంభించింది.

నుదుటిమీద మొదలైన చెమట బిందువులు సర్రున జారుతూ గంగావతి జాకెట్టుపై పడుతున్నాయి. అప్పటికే ఆమె వీపంతా తడిసి ముద్దయిపోయింది. మొహంమీద మరీ ఎక్కువగా చెమట పట్టడంతో కొంచెం ఆగి, వంగి తన పావడతో చెమటను తుడుచుకుంది.

ఎవరో తనని ప్రత్యేకంగా చూస్తున్నట్లనిపించడంతో తలెత్తి చూసింది. కొంత దూరంలో వేపచెట్టుకింద కూర్చున్న రాఘవయ్య గబుక్కున చూపులు తిప్పుకోవడం ఆమె కంట్లో పడింది.

'ముట్టుకుంటేనే మైలపడతారని చెప్పిన శాస్త్రం. దళితులను 'ఆ' దృష్టితో చూస్తే కూడా మైలపడినట్లే అని చెప్పుంటే ఎంత బావుండేది' అనుకుంది.

ఆ వయసులో కూడా చొంగ కారుస్తున్న అతన్ని చూసి ఆమెకు నవ్వు వచ్చింది.

మధ్యాహ్నం భోజనానికి పని నిలిపారు. అందరూ చెట్లకిందకు చేరారు. భోజనాలయ్యాయి.

ఆడవాళ్లందరూ తువ్వాళ్లు పరచి పడుకుని కునుకుతీసే ప్రయత్నంలో పడ్డారు. ఒకరిద్దరు కబుర్లు చెప్పుకుంటున్నారు.

గంగావతికి నిద్ర రావడంలేదు. ఇక తన

సమస్య తీరిపోయినట్లే.

రోజూ ఈ పని దొరికినా చాలు, ఎలాగోలా బతికేయచ్చు

ఒక నెల రోజుల్లో తాము కొంత నిలదొక్కుకుంటే అత్తా మామల్ని కూడా పట్టణానికి పిలుచుకువచ్చి తామే సాకాలని అనుకుంది

పక్కచెట్టుకింద కూర్చున్న మగాళ్లలో ఒకతను నీళ్లు కావాలంటూ మేల్కొనివున్న గంగావతిని అడిగాడు.

గంగావతి లేచి గ్లాసెత్తుకుని బిందెలోకి చూసింది. అందులో నీళ్లు లేవు.

"నీళ్ళు లేవు" అంది అడిగిన అతనికేసి చూస్తూ.

గంగావతి పక్కన పడుకుని వున్నామె లేచి, "అద్దో... ఆ రోడ్డుకాపక్క చెరుకుతోట కనిపిస్తావుంది చూడు. అక్కడ బాయి వుంది. నీళ్ళు ముంచుకుని రాబో" అంది.

బిందె చంకనేసుకుని బాయివైపు నడిచింది.

చెరుకుతోట కొంచెం ఏపుగా పెరిగివుండడంతో బావి రోడ్డులోకి కనిపించదు.

నెమ్మదిగా బావిలోకి దిగింది.

మొహంపై నీళ్లు చల్లుకుని, దోసిలితో నీళ్లు తాగింది. ప్రాణానికి హాయిగా అనిపించింది.

అలవాటు తప్పడంతో కాళ్లు కొద్దిగా నొప్పులు పెడుతున్నాయి. నాలుగురోజులు చేస్తే అన్నీ సర్దుకుంటాయిలే అనుకుంది.

బిందె కడుక్కుని నీళ్ళు ముంచుకుంది.

బిందెను లేపి చంకన పెట్టి వెనుదిరిగి మెట్లెక్కబోయింది.

మెట్లు దిగివస్తున్న రాఘవయ్యను చూసి హతాశురాలయింది.

తన అంచనాలన్నీ వెక్కిరించినట్లనిపించింది.

అతను పంచె ఎగగట్టుకుంటూ ఒక్కొక్క మెట్టే దిగుతున్నాడు.

గంగావతికి నోటిమాట రావడంలేదు.

"నిన్ను చూస్తుంటే పిచ్చెక్కిపోతోందనుకో. పిటపిటలాడే నీ వళ్లు చూసి నాకు తిమ్మిరెక్కిపోతోంది" అంటూ అదోరకంగా నవ్వుతూ ఆమె దగ్గరికి వచ్చాడు.

ఆమెకు ఎప్పటిలాగా భయం కలగలేదు.

నెమ్మదిగా గొంతు పెకలించుకుని, "అయ్యా! మీరు నాకు తండ్రిలాంటోళ్లు. నామీద మనసు పడ్డం ఏంది?" అంది అడుక్కుంటున్నట్లుగా.

"ఛత్... కూలిదానికి తండ్రిలాంటోన్నెట్లవుతానే" అన్నాడు పౌరుషం పొంగుకురాగా.

"అదేనయ్యా నేనూ చెబుతున్నాను. నేను కూలిదాన్నయ్యా. పైగా నేను మాలదాన్ని. మీలాంటోళ్ళు అన్నీ తెలిసినవాళ్ళు మాలాటోళ్ళని కోరడం పాపం కదయ్యా" అంది మరింత దిగజారి.

"గంగకు పంగకూ అంటు లేదే వెర్రిమొహమా" అని తన శాస్త్రపరిజ్ఞానాన్ని వెల్లడిస్తూ మరో మెట్టుదిగి ఆమెకు మరింత దగ్గరగా వచ్చాడు.

"అయ్యా... వద్దయ్యా... నాకిట్లాంటివి ఇష్టముండవు"

"ఛ... వూరుకో. నేను మాత్రం ఎవురంటే వాళ్ళను ఇష్టపడతాననుకున్నావా? నేనసలే బ్రాహ్మణున్ని. నేను కో... అంటే కోటి మంది నా పక్కలో పడుకోవడానికి సిద్ధంగా వుంటారు. అయినా నేను వాళ్లందరితో పోతున్నానా? కానీ నిన్ను చూస్తుంటే మాత్రం నా మనసు గింగిర్లు తిరిగిపోతోంది. ఒక్కసారి ఒప్పుకో చాలు" అంటూ జారిపోతున్న పంచెను ఎగగట్టుకున్నాడు రాఘవయ్య.

ఆమెకు రోత కలుగుతోంది.

"నేను అట్టాంటిదాన్ని కాదయ్యా. నన్ను వదిలేయండయ్యా" అంది ఏడుపు వస్తుండగా.

"అది నిన్ను చూస్తుంటేనే తెలుస్తోంది. అందుకే నువ్వంటే నాకు అంత ఇదిగా

వుండేది. నువ్వు ఒక్కసారి ఒప్పుకో చాలు. ఇదిగో ఈ బంగారుచైను నీ సొంతమైపో తుంది" అంటూ మెడలోని చైనుతీసి ఆశపె ట్టాడు. ఆ చైను తళతళా మెరిసిపోతోంది.

"నాకు ఏ బంగారుచైనూ వద్దయ్యా. నా మానాన్న నన్ను బతకనిస్తే అదే పదివేలు" అంది బతిమాలుతున్నట్టుగా.

"ఒక్కసారంటే ఒక్కసారే... నిన్ను చూసి నప్పటినుండి నా మనసు మనసులో లేదు. ఈ సమయం కోసమే ఇంతసేపూ అల్లాడి పోయాను. నీకేం కావాలంటే అదిస్తాను. ఒక్కసారి ఒప్పుకో" అన్నాడు ప్రాధేయప డుతూ.

"వద్దేవద్దు... నాకేమీ వద్దు. నన్నొది లేయ్ చాలు"

"వద్దంటే ఔననీ, ఔనంటే వద్దనీ ఆడ వాళ్ళ మాటలకు అర్థమంట. నీ మాటలు నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నాయి. ఒక్కసారి... ఒక్కసారంటే ఒక్కసారే ఒప్పుకో" అంటూ చటుక్కున వంగి ఆమె చేతులు పట్టుకు న్నాడు.

ఆమెకు దుఃఖం పొంగుకొస్తోంది.

తన చేతులు పట్టుకుని మరీ అడుక్కుం టున్న అతన్ని చూసి ఏ మూలో జాలి కలు గుతున్నా, అతని కోరిక చూసి అసహ్యం... కంపరం పుడుతున్నాయి.

"వదులు... నా కిష్టంలేదు. నేనొప్పుకోను"

ఆమె చేతులు పట్టుకున్న రాఘవయ్య ఓవైపు ప్రాధేయపడుతూనే చేతుల్ని పైపైకి జరపసాగాడు.

గొంగళి పురుగులు పైపైకి ఎగబడి వస్తు న్నట్లనిపించిందామెకు. వళ్ళంతా అసహ్య కర జలదరింపుతో నిండిపోయినట్లనిపిం చింది.

అతని చేతులు కిందికి వెళ్ళి ఆమె చీరను మోకాళ్లపైదాకా లాగి మరింత పైకి పోతు న్నాయి.

ఇక ఏమాత్రం భరించలేకపోయింది.

ఏడుస్తూనే... చంకలోని బిందెను కొద్దిగా పైకెత్తి రాఘవయ్య బట్టతలనెత్తిన వేసింది.

దభేల్‌మన్న శబ్దంతో బావి ప్రతిధ్వనిం చింది.

★ ★ ★

మరుసటిరోజు

ఉషోదయవేళ

నాలుగుకాళ్ళ మండపం

మూడంకెల్లో కూలిజనం

పేదరికపు బీడీవాసన

పాలిపోయిన మోముతో గంగావతి.

మొదటి ట్రాక్టరొచ్చింది.

రాజారెడ్డి దిగాడు.

జనం ఎక్కారు.

ట్రాక్టరు కదిలింది.

గంగావతి మిగిలింది.

రెండో ట్రాక్టరు

మేస్త్రీ నాగరాజు

కూలీల ఎంపిక

కూలీలతో ట్రాక్టరు

మిగిలిపోయిన గంగావతి

మూడో ట్రాక్టరు

రాఘవయ్య

పిలవాల్సిన వాళ్ళను పిలిచాడు

ఎక్కాల్సిన వాళ్ళు ఎక్కారు.

మిగలాల్సిన వాళ్ళు మిగిలారు.

మిగిలిపోయిన వారిలో ఆమె ఒకతి.

మరో ట్రాక్టరొచ్చింది.

కొత్త వ్యక్తి

చూడగానే ఆశలమెరుపు

క్షణంలోనే మేనిసొగసుకు పిలుపు

కాని...

'భూమి గుండ్రంగా వుంది'

జీవకోన

జీవనసమర సముద్రంలా ఆమె

ఆలోచనలు ఎగసిపడే కెరటాలు

చేరేది ఆవేదనా తీరాలు

మెల్లగా మెలమెల్లగా

మళ్ళీ సంద్రంలోకే.

చేజారిన ఆత్మవిశ్వాసాన్ని

తిరిగి చేజిక్కించుకుని
ఎండిన చెట్టుకు చిగుర్లు తొడుగుకుంది.
రోజు మారుతుంది.
తెలవారుతుంది
అదే ప్రదేశం
అదే సమయం
అదే కూలీలు
అవే ట్రాక్టర్లు
అదే కాంట్రాక్టర్లు
అదే మేస్త్రీలు
దిగుతారు
ఎక్కుతారు
జనం తరుగుతారు.
గతంలో చూడని మేస్త్రీ
కాకుంటే కాంట్రాక్టరు.
ట్రాక్టరెక్కిన గంగావతి
పనిమారుతుంది.
ప్రదేశం మారుతుంది.
చుట్టూ వున్న మనుష్యులు మారుతారు.
ఆ వ్యక్తి చేష్టలు మారతాయి.
మాటలు మారతాయి.
ఇటూ- అటుగా
ఒక్కోసారి కొంత లేటుగా
ఒకే సారాన్ని తెలుపుతాయి.
ఒకే ముగింపును ఇస్తాయి.

'జనగణమన అధినాయక... జయహే' లాగే!

ఇది కథ కాదు
సినిమా కాదు
ఇది జీవితం
ఒకరిది మాత్రమే కాదు
ఒకచోట మాత్రమే కాదు
నవనాగరికతా అభివృద్ధిలో
మైలురాళ్ళలా ఈ సంఘటనలు
ఏళ్ళతరబడి కలవని
రెండువర్గాలు
ఒకటిపైన
ఒకటి కింద
అణగదొక్కుతూ,
అణగద్రొక్కబడుతూ.
ఎందరివో సుఖాల్ని
బలవంతంగా లాక్కుంటూ
వెనుదిరిగి చూడకుండా
విలాసాల ఆకాశంవైపు
పరుగులు తీస్తోందొకటి
తమ సుఖాల్ని
ఎందరికో
ధారపోస్తూ
మోసపోతూ
దినదినానికీ దిగజారిపోతూ
కష్టాల వూబిలో కూరుకుపోతోంది మరొకటి.

ఒకదానికొకటి
ఎంతెంత దూరంలో వున్నాయో!

★ ★ ★

దేవస్థానం కోరిక మేరకు కొత్తగా ఎయిర్ బస్‌లను ఏర్పాటు చేస్తున్నట్లు ప్రకటించాడు మంత్రి.

ఆ ప్రకటన వినగానే వేదిక మీదవున్న ఎం.ఎల్.ఎ.లు, సభికులు ఒక్కసారిగా హర్షధ్వానాలు చేశారు.

దేశంలోని పవిత్ర పుణ్యక్షేత్రాలలో ఇదీ ఒకటి. స్వామివారి దర్శనభాగ్యాన్ని ప్రజలకు మరింత సులువుగా కల్పించేందుకు వీలుగా మా వంతు సేవల్ని మేం అందిస్తాం" అన్నాడు మంత్రి తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ.

వీడియో కెమేరాలు ఆయన హావభావాలను తమలో బంధించేసుకుంటున్నాయి. వివిధ కోణాలనుండి స్టేజీమీద వున్నవారిని ఫొటోలు తీస్తున్నారు.

ముందు వరుసలో కూర్చున్న విలేకరులు తమ బుల్లి నోట్‌బుక్‌లలోకి ఆయన ప్రసంగాన్ని చకచకా ఎక్కించేసుకుంటున్నారు.

ఆరోజు తిరుపతి విమానాశ్రయాన్ని అభివృద్ధిపరచే కార్యక్రమంలో భాగంగా ఎయిర్ టెర్మినల్‌ను ఏర్పాటుచేసి ప్రారంభోత్సవానికి పెద్దపెద్ద వాళ్ళనే పిలిచారు.

మంత్రిగారు మొదట ముఖ్యమంత్రిని తెగపొగిడి, తరువాత తను ఏవిధంగా రేయింబవళ్లు నిద్రాహారాలు మాని రాష్ట్ర అభివృద్ధికి, తన నియోజకవర్గాభివృద్ధికి కృషిచేస్తున్నదీ వివరించసాగాడు.

మంత్రి చెబుతున్న విషయాల్లో కొత్తగా రాసుకోవాల్సినవీ, రాయాల్సినవీ ఏవీ కనిపించలేదు మురళీకి.

అయినా "ప్రారంభోత్సవ కార్యక్రమం చూస్తున్నది తను కాదు, తన కొలీగ్ రాజు. అతను చూసుకుంటాడులే" అనుకున్నాడు.

ప్రారంభోత్సవం తరువాత మంత్రి ప్రెస్ మీట్ వుంటే దాన్ని చూసుకుని సాయంత్రం మూడుగంటలకు జరిగే రాయలసీమ జిల్లాల సర్పంచ్‌ల సదస్సులో మంత్రి ప్రసంగం చూడడం తను చేయాల్సిన పనులు.

మంత్రిగారి ప్రెస్‌మీట్, ప్రారంభోత్సవ కార్యక్రమం, మంత్రితోపాటూ తిరగటం రాజు బాధ్యత.

ప్రారంభోత్సవ సభ అయిపోయింది.

మంత్రి ఎక్కడికి వెళతాడో, ఎక్కడ ప్రెస్ మీట్ అరేంజ్ చేయమంటాడో తెలుసుకోవడానికి పి.ఆర్.వో నానాతంటాలు పడుతున్నాడు. వి.ఐ.పి.లు పట్టణానికి అధికారిక కార్యక్రమాలపై వచ్చినప్పుడు వారి మినిట్ టు మినిట్ ప్రోగ్రామ్ మొత్తం పిఆర్‌వోకు చేరుతుంది.

అయితే మంత్రిగారు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ ప్రెస్‌తో మాట్లాడాలని కోరుకుంటారు. దాంతో పిఆర్‌వోలాంటి వాళ్ళ టెన్షన్ చెప్పనలవి కాదు.

పిఆర్‌వో అసలే టెన్షన్ మనిషి. ప్రతి చిన్న విషయానికీ కంగారుపడిపోతూ పరుగులు తీస్తుంటాడు. ఆరోజు చాలామంది వి.వి.ఐ.పి.లు రావడంతో ఆయన ఆదుర్దా అంతా ఇంతా కాదు కాని, ఎంత ఆదుర్దా పడ్డా ఎప్పటిలాగే మంత్రిగారి ప్రెస్‌మీట్ ఎప్పుడుంటుందో, ముఖ్యమంత్రి ఇప్పుడు ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకోలేకపోయాడు.

"ఏంటిసార్! ముఖ్యమంత్రిగారు ఇప్పుడు ఎక్కడికి వెళుతున్నారు? " అడిగాడు మురళీ.

అప్పటికే సభలో కూర్చునివున్న వారందరూ లేచి కదలడం ప్రారంభించారు.

"ఇంకా తెలియదు మురళీ" అన్నాడు పిఆర్‌వో పరుగులు తీస్తూనే.

ఈ మహానుభావుణ్ణి నమ్ముకుంటే అయినట్లేనని చకచకా సభాస్థలంనుండి బయట పడ్డాడు మురళీ. అక్కడ లోపలికి ప్రవేశించడానికి అనుమతిలేని వందలాదిమంది పార్టీ కార్యకర్తలు బ్యానర్లు పట్టుకుని నినాదాలిస్తున్నారు.

డజన్లకొద్దీ కార్లు ఒక్కసారిగా వరుసగా నిలబెట్టివున్నాయి.

కార్యకర్తలు లోపలికి పోవాలని ప్రయత్నిస్తున్నారు.

ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా అద్దాలతో కట్టిన ఎంట్రన్స్‌భాగం మొత్తం ధ్వంసం అయిపోతుంది. అందుకనే లాఠీలతో కార్యకర్తల్ని అదిలిస్తూ, బెదిరిస్తూ తిరుగుతున్నారు పోలీసులు.

"ఏయ్ ఎవర్రా నువ్వు? " అన్నాడొక పోలీస్ కానిస్టేబుల్ ఎంట్రన్స్ గేటువద్ద నిలబడి వున్న మురళీని చూసి.

ఆ మాటలకు కోపంగా వెనుదిరిగాడు మురళీ.

మురళీ జేబుకు వేలాడుతున్న కార్డుపై ప్రెస్ అని రాసుండడం చూసి నాలుక కరుచుకున్నాడు కానిస్టేబుల్.

అంతలోనే తన సహజగుణాన్ని ప్రదర్శిస్తూ, "ప్రెస్ అయినా అక్కడ నిలబడవద్దండి సార్. ఎస్.ఐ. చూస్తే మమ్మల్ని అరుస్తారు" అన్నాడు మురళీ మాట్లాడే లోపే.

పోలీస్ కానిస్టేబుల్‌తో గొడవ పెట్టుకోవడంకంటే మూర్ఖమైన పని మరొకటి

వుండదని భావించిన మురళీ పక్కగా వెళ్ళి నిల్చున్నాడు. అంతలో ముఖ్యమంత్రీ, కేంద్ర మంత్రీ ఇద్దరూ మాట్లాడుతూ బయటకు వచ్చారు.

కాన్వాయ్ సయ్...మని దూసుకుని ఎంట్రన్స్ దాటి కొంత ముందుకు వెళ్ళి ఆగింది. దాని వెనుకే మంత్రిగారి కారు వచ్చి ఆగింది.

ఆయన కారులో కూర్చోబోతూ అక్కడున్న కార్యకర్తల్ని చూసి ఒకసారి చేయివూపాడు.

దానికే తృప్తిపడిపోయిన కార్యకర్తలు ఆయనకు గట్టిగా జిందాబాద్‌లు కొట్టారు. ఆ కారు వెనుక ఎమ్మెల్యేల కారు వచ్చి ఆగింది. వారు తమ కార్యకర్తల్ని చూసి చేయివూపారు. వాళ్ళు వారికి కూడా జిందాబాద్‌లు కొట్టారు.

మంత్రిగారి కారు వెనుక స్పెషల్ పోలీసుల కారు కదిలింది.

మురళీకి ఏం చేయాలో పాలుబోలేదు.

ఈ పిఆర్వో ఎక్కడున్నాడో, ఎప్పుడొస్తాడో తెలియదు. ఆయన కోసం చూడకుండా ఎవరిదో ఒకరి కారులో మంత్రిని ఫాలో అయిపోవాలి అనుకుంటూ తెలిసిన మొహం ఏదైనా కనిపిస్తుందేమోనని కార్లన్నింటినీ పరిశీలనగా చూస్తున్నాడు మురళీ.

అప్పటికే ట్రాఫిక్ జాం అయిపోయింది

ఒక్కొక్క కారునే పంపిస్తున్నారు పోలీస్ వాళ్ళు.

జనం పరుగులతో రొదరొదగా వుంది.

అంతలో "మురళీ సార్" అన్న పిలుపు వినబడి తలతిప్పి చూశాడు.

రాంపాదరెడ్డి!

కారు వెనక డోర్ తెరచి తనను చూసి "వస్తారా" అడిగాడు రాంపాదరెడ్డి.

వెనుకాముందూ ఆలోచించకుండా చకచకా మెట్లు దిగి ఆ కారు ఎక్కేశాడు మురళీ. కారు వేగం పుంజుకుంది.

కార్లను తప్పించుకుంటూ వెళ్ళి పోలీస్‌ల కారు వెనుక పరుగులు తీస్తోంది రాంపాదరెడ్డి కారు.

డ్రైవర్ చాలా నేర్పుగా తోలుతున్నాడు.

ఒకసారి తలతిప్పి వెనుక అద్దంగుండా చూశాడు మురళీ.

ఒకదానివెనుక ఒకటి వరుసగా కనిపించినంతదూరం కార్లు వస్తూవున్నాయి. దారి పొడవునా అక్కడక్కడా పోలీసులు నిల్చుని ట్రాఫిక్‌కి అంతరాయం కలగకుండా చూస్తున్నారు.

దారి పొడవునా నాయకులను చూడడానికి జనం బారులు తీరి వున్నారు.

కార్లు దూసుకుపోతున్నాయి.

అప్పటికి సమయం మధ్యాహ్నం రెండు గంటలవుతోంది.

ఉదయం ఏడుగంటలకు టిఫిన్ చేశాడు మురళీ.

ఎనిమిదికంతా విమానాశ్రయంలో వుండాలని పిఆర్వో ఏడున్నరకే వెహికల్‌ను బయలుదేరదీశాడు. తీరా ప్రారంభ కార్యక్రమం మొదలయ్యేసరికి పదకొండయ్యింది.

రిపోర్టర్లకు చాలా సహనం వుండాలి. గంటలకొద్దీ వేచివుండే ఓర్పు అలవడాలి. ఎంత సీనియర్ రిపోర్టర్ అయినా, రెండు మూడు గంటలు వేచి వుండేసరికి విసుగు చెందిపోతాడు. విధిలేని పరిస్థితుల్లో ఐదారు గంటలు, ఒక్కోసారి రోజు మొత్తం కూడా వేచి వుండాల్సి వస్తుంది. వాటన్నిటికీ సిద్ధంగా వుండాలి రిపోర్టర్.

ఇది ఒక ఎత్తైతే ఆహారపు అలవాట్లు ఒక ఎత్తు. రిపోర్టర్లు రోజూ ఒకే సమయానికి భోంచేయలేరు. ఒక కార్యక్రమానికి వెళ్లడం వరకే రిపోర్టర్ పని. ఆ కార్యక్రమం ఎన్ని గంటలు జరిగితే అంతసేపూ భరించక తప్పదు. తనకు ఎంత ఆకలేస్తున్నా కార్యక్రమాన్ని విడిచిరాకూడదు. పస్తులనేవి రిపోర్టర్లకు బాగా అలవాటు అవుతుంది. ఉదయం తిన్న నాలుగు ఇడ్లీలు ఎప్పుడో



అరిగిపోయాయి. భోజన సమయం దాటు తుండడంతో మురళీకి బాగా ఆకలేస్తోంది. కానీ మంత్రి ఎక్కడ ప్రెస్‌మీట్ పెడతాడో, తాను మిస్సవుతాడోనన్న భయంతో బల వంతంగా అణచుకుంటున్నాడు.

ఇప్పుడు భోంచేయకపోతే మళ్లీ కుదరక పోవచ్చు మూడు గంటలకంతా జిల్లా సర్పంచ్‌ల సదస్సు ప్రారంభమైపోతుంది. అది ప్రారంభమైతే ఇక రాత్రికే భోజనం గురించి ఆలోచించాల్సి వుంటుంది.

కార్లు అతిథిగృహాన్ని చేరుకున్నాయి.

కారు గెస్ట్‌హౌస్ ఆవరణలోకి వెళ్ళి ఆగింది.

కారు దిగుతూ "ఇప్పుడెక్కడికి వెళ్ళాలి సార్" అడిగాడు రాంపాదరెడ్డి.

అప్పటికి స్వంత వాహనాలలో వచ్చే విలే కరులు ఎవరూ రాలేదు.

ప్రెస్‌మీట్ వుందా లేదా అని తెలిస్తే తను వెళ్ళి భోంచేసి వచ్చేయచ్చు అను కుంటూ "మంత్రిగారి ప్రెస్‌మీట్ వుంటుందో, వుండదో కనుక్కోవాలి. ఇంకా భోంచేయలేదు. టౌన్‌లోకి వెళ్ళి ఏదో ఒక హోటల్లో భోంచేసి సర్పంచ్‌ల సదస్సుకు రావాలి" అన్నాడు మురళీ.

"ఒక్క నిమిషం" అని చెప్పి లోనికి వెళ్ళి నేరుగా మంత్రినే అడిగి వచ్చాడు రాంపాద రెడ్డి.

"ఇప్పుడు భోజనసమయం కదా. ప్రెస్ మీట్ వుండదంట సార్. ఇక భోజనం సంగతి. నాక్కొంచెం పనుంది మంత్రిగా రితో. లేకపోతే నేనూ వచ్చేవాడినే. ఏం అనుకోకండి సార్. రేయ్... సార్‌ను హోటల్ ద్వారకాకు తీసుకెళ్ళండి" అన్నాడు తన అనుచరునికేసి తిరిగి.

అంతలోనే ఏదో గుర్తొచ్చినవాడిలా "వద్దొద్దు. సార్ నాన్‌వెజ్ తినడు. 'మయూర'కు తీసుకుపోండి. బిల్లు నా



లెక్కన రాయించండి. మళ్ళీ సార్ ఎక్కడ దించమంటే అక్కడ దించండి. నేను ఎవ రిదో ఒకరి కారులో అడ్జస్టయిపోతాను" అంటూ తన అనుచరులను ఆదేశించాడు.

ఉన్న అతితక్కువ సమయంలో తను ఇంటికెళ్ళి తినిరాలేడు. హోటల్‌కు వెళ్ళా లంటే కనీసం పదిహేను రూపాయలుం డాలి. జేబులో పదిరూపాయలే వున్నాయి. ఏదైనా టిఫిన్ తింటే పోతుందిలే అని అప్ప టిదాకా అనుకున్నాడు మురళీ.

తీరా రాంపాదరెడ్డి 'మయూర'కు తీసుకు వెళ్ళమని చెప్పడంతో ఏదో తెలియని సంతోషం కలిగింది అతనికి.

రాంపాదరెడ్డి చూపిస్తున్నది అభిమా నమో, ఆప్యాయతో అర్థంకాకపోయినా అత నిపట్ల మాత్రం ఎందుకో ఇష్టం కలుగు తోంది మురళీకి.

మొదట్లోనే రాంపాదరెడ్డి మాటల్ని తుంచేసి మయూరకు వెళ్ళనని చెప్పేద్దామ నుకున్నాడు. కానీ ఎందుకో చెప్పలేకపో యాడు. పైగా 'థ్యాంక్‌యూ' అన్నాడు.

అది అతనిమీద తనకున్న అభిమా నమా? లేక మనల్ని అతను గౌరవిస్తు న్నాడు కాబట్టి, అతన్ని తను హర్ట్ చేయలేక అలా ప్రవర్తించాడా?

లేక... ఆకలి అంత పని చేసిందా?

ఆలోచిస్తూనే కారులో ఎక్కి కూర్చు న్నాడు.

కారు కదిలింది.

అప్పటివరకు వి.ఐ.పిల రాకతో నిలిపి వుంచిన బస్సులు, కార్లు, ఇతర వాహనాలు రోడ్లపై గజిబిజిగా పరుగులు పెడుతు న్నాయి. కారు గాంధీరోడ్‌మీదుగా బస్టాండు దగ్గరవున్న మయూర రెస్టారెంట్ ముందుకెళ్ళి ఆగింది.

కారు దిగబోతుంటే, మురళీతోపాటూ కారులో వచ్చిన రాంపాదరెడ్డి అనుచరులు నలుగురిలో ఒకడు "సార్" అన్నాడు ఏదో

అడగబోతున్నట్లుగా.

ఏమిటీ? అన్నట్లుగా చూశాడు మురళీ.

"మీ గురించి మాకు సరిగా తెలియదు సార్. మీరేమీ అనుకోకపోతే, మళ్ళీ రాంపాదన్నకు చెప్పనంటే రెండునిమిషాలు అలా బయటదాకా వెళ్ళొస్తాం సార్" అన్నాడు.

మురళీకి అర్థమయ్యింది. వాళ్ళు 'మందు' కోసం వెళ్ళాలంటున్నారని.

వాళ్ళని తాగొద్దని తను చెప్పలేదు. కాబట్టి "సరే" అన్నాడు మురళీ.

"మళ్ళీ అన్నకు చెప్పరు కదా"

వాళ్ళమొహంలో ఓ పక్క సంతోషం కనపడుతోంది. మరోపక్క కొంత అనుమానం, భయం కనిపిస్తున్నాయి.

"చెప్పనులే" అన్నాడు మురళీ.

మురళీని రిజర్వుడు టేబుల్‌వద్ద కూర్చోబెట్టి కావల్సిన ఐటమ్స్‌ని ఆర్డరిచ్చేసి "రెండు నిమిషాలు సార్. ఇప్పుడే వచ్చేస్తాం" అంటూ వాళ్ళు బయటకు వెళ్ళిపోయారు.

అది ఎ.సి. రెస్టారెంటు కావడంతో లోపల చల్లగా వుంది. లైట్‌లు డిమ్‌గా వెలుగుతున్నాయి.

తడిచిన బట్టల్లో ప్రియురాలి అందం కనిపించీ కనిపించనట్లుగా వుందక్కడి చీకటి.

తన టేబుల్‌పై వున్న టిష్యూపేపర్‌ను పరిశీలనగా చూశాడు. దానిపై హోటల్ మయూర అని ఇంగ్లీషులో ప్రింట్‌చేసి వుంది. పక్కనే వున్న పేపర్‌ను దగ్గరకు తీసుకున్నాడు. అది మెనూ కార్డ్. అందులో ఏయే ఐటమ్స్ అక్కడ దొరుకుతాయి, వాటి రేట్ల వివరాలు వున్నాయి.

ఆ రేట్లు చూసిన మురళీకి కళ్ళు తిరిగినంత పనైంది.

అక్కడ ఓ పూట భోజనానికి చెల్లిస్తున్న ఖర్చుతో సాధారణ హోటల్‌లో సరిగ్గా పదిమంది భోంచేయవచ్చు

పేద కుటుంబానికి పదిరోజుల బత్తెం వస్తుంది.

కాఫీ పదిహేను రూపాయలు, రెండు ఇడ్లీ పదిహేను రూపాయలు... స్టార్ హోటల్ అంటే నక్షత్రాలు కనిపించేలా ధరలు పెట్టడమని అర్థమేమో!

కొందరికి పొట్టకూటికోసం రోజంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా జీవనం గడవడం కష్టమైతే రాంపాదరెడ్డి లాంటి రౌడీలు, రాజకీయనాయకులు, వ్యాపారవేత్తలు మోసాలూ, దౌర్జన్యాలు చేసి సంపాదించి ఒక పూట తిండికే వందల రూపాయలు ఖర్చుపెడుతూ విలాసంగా జీవిస్తున్నారు. ఈ ప్రజాస్వామ్యంలో ఎవరిది రాజ్యం! ఎవరిది భోజ్యం?

సూప్ తెచ్చి పెట్టిపోయాడు సర్వర్.

సూప్ తాగుతుండగా డ్రైవర్‌తోపాటూ, రాంపాదరెడ్డి అనుచరులు నలుగురూ వచ్చి ఎదురుగా వున్న కుర్చీల్లో కూర్చున్నారు.

అప్పుడప్పుడే నిషా ఎక్కుతున్నట్లు వాళ్ళ కళ్ళు చెబుతున్నాయి.

మురళీని చూసి "సార్... రాంపాదన్నకు చెప్పరు గదా" అన్నాడు ఒకతను అనుమానం వీడక.

మురళీ సమాధానం చెప్పేలోపే అతని పక్కనున్న వ్యక్తి ఫెడేల్‌మని ఆ అడిగిన వాడి వీపుమీద ఒక దెబ్బవేసి "చత్... నీయవ్వా. సార్ చెప్పనన్నాడుకదా. మళ్ళీ మళ్ళీ అడుగుతావేందిరా షఫీగా" అన్నాడు.

"నీయబ్బ చంపేశావు కదరా పుల్లిగా" అన్నాడు షఫీ అతనుకొట్టినచోట తడుముకుంటూ.

సర్వర్ వచ్చి వడ్డించసాగాడు.

రకరకాల కూరలు, తాళింపులు, పచ్చళ్ళు అన్నీ అమర్చాడు.

మౌనంగా తినసాగాడు మురళీ.

"రేయ్... ఇదేం బాగలేదురా ఇవన్నీ చప్పిడి కూరలేరా. కనీసం ఒక మటన్‌ముక్కైనా తినకపోతే... నోటికి కారంగా ఏదైనా తగలకపోతే... మరీ ఇట్లా చుక్కేసుకున్న తరువాత తినకపోతే ఆ తిండి తిండే కాదురా" అన్నాడొకతను.

"రేయ్ రాజా... నోర్మూసుకుని తినేది నేర్చుకో. ఎదురుగా ఆ సార్ వున్నాడు" అన్నాడు రంగడు.

రాజా తినడం ఆపి గట్టిగా నవ్వసాగాడు.

తింటున్నవారంతా వింతగా చూశారు అతనివైపు.

"ఏయ్... ఎందుకురా అట్లా నవ్వుతావు" అన్నాడు షఫీ కోపంగా.

"నోరుమూసుకుని ఎవరైనా తింటారా... వీడు చెబుతున్నాడు చూడు" అంటూ మళ్ళీ నవ్వసాగాడు రాజా.

"రంగా... వీన్ని పిలుచుకుని రావడమే తప్పయిపోయిందిరా... యాడ ఎట్ల నడుచుకోవాల్నో తెలసి చావదు నాకొడుక్కి" అన్నాడు పుల్లయ్య.

"నిజమే... ఈ పొద్దు రాత్రికి పనైపోతే రేపు పంపించేద్దాం" అన్నాడు రంగడు.

"నాకు మటన్ పెట్టకుండా, ఇంకో బ్రాందీ బాటిల్ ఇవ్వకుండా నన్ను పంపిస్తానంటే ఒప్పుకునేది లేదు. వీన్ని తేల్చేవరకు అసలు ఆ కొంపలు అంటించేందుకే పోను" అన్నాడు రాజా పౌరుషంగా.

అప్పటికే వాళ్ళకు అంతో ఇంతో కిక్కు ఎక్కడంతో ఎదురుగా మురళీ వున్న సంగతి మరచిపోయి మాట్లాడుకోసాగారు.

తింటూ వున్న మురళీ "కొంపలు అంటించడం" అన్న మాటలు విని ఒక్కక్షణం తినడం ఆపివేశాడు. మరింత శ్రద్ధగా వారి మాటల్ని వినసాగాడు.

రంగడు, షఫీలిద్దరూ 'రాజా'కు నచ్చజెప్పే ప్రయత్నాలు ప్రారంభించారు. అతను వినడంలేదు.

"ఏందిరా... ఆ జీవకోనేమైనా ఈడ వుందా. ఆ రోడ్డునుండి మబ్బులో అడివిలోకి నడచిపోవాల్నా. ఆ చీకట్లోనే వెళ్ళి ఆ కొంపలకు నిప్పుపెట్టాల్నా. ఈ లోపు ఎవడైనా చూసి పట్టేసుకుంటే చావుదెబ్బలు తినాల్నా, పోలీసులకు పట్టిస్తే జైలుకూడు తినాల్నా" అన్నాడు రాజా తాను చేయబోయేది ఎంత కష్టమైన పనో వివరిస్తూ.

"అందుకే గదరా నీకు పదివేల రూపాయలు ఇస్తావుండేది" అన్నాడు రంగడు.

"నేనేమన్నా నోట్లో ఏలుపెట్టుకున్న పిలగాని మాదిరి కనిపిస్తుండానా ఏమారించడానికి. ఆ జీవకోనలో వున్న గుడిసెలన్నీ కాల్చేస్తే ఆడుండేవాళ్లంతా తిరిగి గుడిసెలేసుకునేవరకు వేరే చోటకు వెళ్ళిపోతారు. అప్పుడు రాంపాదరెడ్డి బోయి ఆ స్థలాన్నంతా ఆక్రమించుకుని లక్షలకు అమ్ముకుంటాడు. నాకు తెల్దనుకుంటివా" అన్నాడు రాజా.

వింటున్న మురళీ మనసు మొద్దుబారిపోయింది.

తాను వింటున్నది నిజమేనా?

ఇందులో నమ్మకపోవడానికి ఏముంది. జీవకోనలో వున్న ఏ ఇంటికీ పట్టాలు లేవు. పట్టాలులేని భూములను పేదలు ఆక్రమించుకొని గుడిసెలు వేసుకుని నివశిస్తూవున్నారు. వాళ్ళను ఎలాగోలా తరిమేసి తను ఆక్రమించుకోవాలని ఎత్తువేసినట్లున్నాడు రాంపాదరెడ్డి. అది పోరంబోకు జాగా కాబట్టి ఎవరూ అడగలేరు. అడిగినా రాజకీయ పలుకుబడితోనో, దౌర్జన్యంతోనో వాళ్ళ నోరుమూయించేస్తాడు. ఆ తరువాత అదే స్థలాల్ని పట్టాలు లేకుండానే లక్షలకు అమ్ముకుంటాడు.

రాంపాదరెడ్డి ఇలాంటివెన్నో చేసే ఈరోజు ఇంత ధనవంతుడు కాగలిగాడు. మంత్రిగారి గదిలోకి నేరుగా వెళ్ళి ముఖాముఖీ మాట్లాడగలుగుతున్నాడు.

వీళ్ళు చెబుతున్నదాని ప్రకారం జరిగితే జీవకోన అగ్నికి ఆహుతికానుంది. వందలాది మంది పేదలు నిరాశ్రయులు కానున్నారు.

వీరికి వాళ్ళ గుడిసెలు అంటించడమే పనికావచ్చు. కానీ ఆ పని చేస్తే ఎంత మంది ముసలీముతకా, పిల్లలు చనిపోతారో?

ధగధగా మండుతున్న మంటలు, జనం హాహాకారాలు... ఆ వూహ తలపుకు రాగానే భోజనం సహించలేదు మురళీకి.

వెంటనే లేచి వెళ్ళి చేయి కడిగేసుకున్నాడు.

రాంపాదరెడ్డి అనుచరులెవరూ అతన్ని పట్టించుకునే పరిస్థితిలో లేరు. వాళ్ళ మాటల్లో వాళ్ళున్నారు.

ఇక అక్కడ ఒక నిమిషం కూడా వుండ బుద్ధి కాలేదు మురళీకి.

వారికి చెప్పకుండానే బయటకు అడుగులువేశాడు.

ఇంతకీ ఇప్పుడు జీవకోనకు వెళ్ళాలా? సర్పంచ్‌ల సదస్సుకు వెళ్ళాలా? అన్న సందిగ్ధంలో పడ్డాడు.

ఫోన్ చేస్తే?

జీవకోనకు ఇంకా కరెంటు సౌకర్యమే లేదు అలాంటి చోట ఫోన్ అంటే...

ఖచ్చితంగా జీవకోనకు వెళ్ళాల్సిందే!

జీవకోనకు వెళ్ళాలంటే కనీసం గంటకు పైగా పడుతుంది.

సమయం చూశాడు. మూడు కావొస్తోంది.

జీవకోనకు వెళ్ళకపోతే ఎంతోమంది నిరాశ్రయులైపోతారు. మంత్రి ప్రోగ్రామ్‌కు వెళ్ళకపోతే తన ఉద్యోగానికే ముప్పు రావచ్చు

ఏం నిర్ణయించుకోవాలి?

అప్పుడు తట్టిందా ఆలోచన.

జీవకోనలో వున్న వారంతా కూలికి వెళ్ళిపోయి వుంటారు. పొద్దుపోయేదాకా జీవకోనలో జనం వుండరు. వున్న ముసలివాళ్ళకు చెప్పినా ఒకటే చెప్పకపోయినా ఒకటే. కాబట్టి పొద్దుపోయేలోగా అక్కడికి చేరుకుంటే చాలు. జరగబోయే ప్రమాదం కూడా రాత్రికే కాబట్టి మరీ అంత వర్రీ చెందాల్సిన పనిలేదు.

టౌన్ బస్ ఎక్కి మీటింగ్ జరిగే స్టేడియం చేరుకున్నాడు.

అప్పటికే స్టేడియం కిక్కిరిసిపోయింది జనంతో.

స్టేడియం వెలుపలా, యూనివర్శిటీ ఆవరణలోనూ సర్పంచ్‌లను తీసుకువచ్చిన ఆర్.టి.సి బస్సులు నిలిపివున్నారు.

సెక్యూరిటీ సిబ్బంది, లోపలికి పోబోతున్న మురళీని అడ్డుకున్నారు. "ప్రెస్" అనగానే గభాల్న దారివదలి ప్రెస్ గ్యాలరీవైపు చేయిచూపించారు.

స్టేజీకి దగ్గరగా వున్న ప్రెస్ గ్యాలరీలోని సీట్లన్నీ అప్పటికే నిండిపోయి వున్నాయి.

ఫోటోగ్రాఫర్లు, వీడియో కెమేరామెన్‌లు స్టేజి ముందుకు వెళ్ళి అటూ ఇటూ తిరుగుతున్నారు.

మురళీని చూస్తూనే పి.ఆర్.వో లేచి ఎక్కడికి పోయావు మురళీ, నీకోసం ఎంత సేపు వెతికానో తెలుసా" అన్నాడు.

అది అబద్ధమని మురళీకి తెలుసు. అయినా అవన్నీ పట్టించుకునే స్థితిలో లేడు.

మురళీ కూర్చోవడానికి సీటులేకపోవడం చూసి తన సీటులో కూర్చోమని చెప్పి, మరో కుర్చీని తెమ్మని అటెండర్‌ని పురమాయించాడు పి.ఆర్.వో.

మురళీ కూర్చోగానే చిన్న ఫైల్ ఒకటి తెచ్చిచ్చాడు పి.ఆర్వో.

ఆ ఫైల్ తెరిచి చూశాడు మురళీ.

అందులో జిల్లాలోని మొత్తం సర్పంచ్‌ల సంఖ్య, సర్పంచ్‌లు నిర్వహించాల్సిన విధులు, కొత్తగా ప్రభుత్వం సర్పంచ్‌లకు ఇస్తున్న అధికారాలు, బాధ్యతలు వంటి వివరాలన్నీ వున్నాయి.

వాటిని చదవబుద్ధికాకపోవడంతో ఫైల్ మూసివేశాడు.

మూడున్నర దాటింది సమయం.

మంత్రి అప్పటికీ రాలేదు.

ఎమ్మెల్యే ఒకాయన మైక్ పట్టుకుని వదలకుండా ఉపన్యాసిస్తున్నాడు. తమ ప్రభుత్వం చేసిన ఘనకార్యాలను ఏకరువు పెడుతున్నాడు.

మురళీకి విసుగ్గానూ, ఆందోళనగానూ వుంది.

మంటల మధ్య గుడిసెలు, హాహాకారాలు అన్నీ కళ్ళముందే కనిపిస్తున్నట్లు, వినిపిస్తు న్నట్లే వుంది.

దాంతో ముళ్ళపైన కూర్చున్నట్లుగా వుంది అతనికి.

ఎప్పుడెప్పుడు మీటింగ్ పూర్తవుతుందా? వార్త రాసి పడేసి ఎప్పుడు జీవకోనకు చేరు దామా అని వుంది.

అవునూ. ఈ విషయం పోలీసులకు తెలి యజేస్తే, ఫైరింజన్ పంపించి ముందుజాగ్రత్త పడతారు. రాంపాదరెడ్డిని అరెస్టు చేస్తారు.

అంతలోనే తనకొచ్చిన ఆలోచనకు తనే తిట్టుకున్నాడు. అప్పుడంటే అక్కడ ఆర్రెడీ సారాయి అక్కడ వుంది కాబట్టి తెలివిగా పట్టించగలిగాడు.

ఇప్పుడేమని చెప్పగలడు?

రాత్రికి జీవకోనను అంటించబోతున్నారని చెప్పాలా?

నీకెలా తెలుసు అంటే?

తను రిపోర్టర్ కాబట్టి అలా అడగరనే అనుకుందాం. తన మాటలను నమ్మి కాని స్టేబుళ్లను జీవకోనకు పంపిస్తారు. అక్కడ రక్షణ ఏర్పాటు చేస్తారు. ఈ కానిస్టేబుళ్ల లోనే ఎవడో ఒకడు రాంపాదరెడ్డికి విష యాన్ని చేరవేస్తాడు. అంతెందుకు ఎస్. ఇ.నే ఫోన్ చేసి రాంపాదరెడ్డికి చెప్పినా ఆశ్చర్యపోనక్కరలేదు. ఒకవేళ చెప్పకపో యినా అంటించడానికి వచ్చిన వాళ్లు పోలీ సులను చూసి చల్లగా జారుకుంటారు. ఈ రోజుకు ఆ ప్రయత్నం మానుకుంటారు. కొద్దిరోజులపాటు తమ కార్యక్రమాన్ని వాయిదా వేసుకుంటారు.

పోలీసులు రెండు మూడు రోజులు చూసి వచ్చేస్తారు.

తనను ఫూల్ కింద లెక్కకడతారు.

మరోసారి తను నిజం చెప్పినా నమ్మరు.

అప్పుడు రాంపాదరెడ్డి మళ్లీ పావుల్ని కదుపుతాడు. తన పనిని తాను నిరా టంకంగా చేసుకుపోతాడు. కాబట్టి ఇది పరి ష్కారం కాదు. మరేం చేయాలి?

అప్పుడొచ్చాడు మంత్రి.

సభలోనుండి జనం జేజేలు కొట్టారు.

"ఆలస్యంగా రావడం గొప్ప విషయమను కుంటారేమోగానీ మూడు గంటలకు సదస్సు ప్రారంభం కావలసివుంటే నాలుగ్గం టలకు వస్తున్నాడు" అంటూ ఒక సీనియర్ రిపోర్టర్ విసుక్కుంటున్నాడు.

గంటసేపట్నుండి నాన్‌స్టాప్‌గా వాయి స్తున్న ఎమ్మెల్యే మంత్రి రాకతో తన ప్రసం గాన్ని అయిష్టంగానే నిలిపేశాడు. మిగతా విషయాలు చివర్లో మాట్లాడుతానని చెప్పి మంత్రికి మైక్‌ను అందించాడు.

"ఇంకా మాట్లాడతావా? వినేందుకు తలల్ని మిగల్చకుండా తినేశావుకదా" అని ఎవరో కామెంట్ విసరడంలో జనమంతా గొల్లుమన్నారు.

మంత్రి ప్రసంగం పూర్తయ్యేసరికి సమయం ఐదున్నర దాటింది.

సదస్సు పూర్తికాగానే మంత్రి గుడికి వెళ్లి పోయాడు.

ఇక్కడ ఏ సదస్సు, సమావేశం జరిగినా వాటిలో పాల్గొనడానికి వచ్చే మంత్రులు, అధికారులూ ఇతర సభ్యులూ అందరూ తప్పనిసరిగా గుడికి వెళ్లి శ్రీవారిని దర్శిం చడం రివాజు.

"ప్రెస్‌వాళ్లు ఎవరైనా తిరుమలకు వెళ్తు న్నారా" అని అడిగాడు పి.ఆర్.వో.

ఎవరైనా వెళ్లాలంటే వాళ్లకు వెహికల్ అరేంజ్‌చేసి పంపాలి. అయితే తిరుమలకు వెళ్లడానికి ఏ రిపోర్టరూ ఇష్టపడలేదు. దాంతో పి.ఆర్.వో వూపిరి పీల్చుకున్నాడు.

మంత్రి వేదిక దిగగానే సర్పంచ్‌లందరూ వచ్చినపని అయిపోయినట్లుగా లేచి వెళ్లిపో తున్నారు.

రిపోర్టర్స్ అందరూ వి.ఐ.పి గేట్‌గుండా వెళ్లి ప్రెస్ అని రాసున్న పేపర్ అతికించిన వెహికల్‌లో కూర్చున్నారు. అప్పటికే ట్రాఫిక్ జాం అయింది.

రోడ్డంతా జనం.

మురళీకి టెన్షన్‌గా వుంది.

ఓ పక్క పొద్దువాలుతోంది.

ఇప్పుడు వార్త రాయడానికి ఎడిషన్ సెంటర్‌కు వెళితే బాగా ఆలస్యం అయిపోతుంది. ఆలోపు జరగాల్సింది జరిగిపోతుంది.

ట్రాఫిక్‌లోనుండి బయటపడి వెహికల్ సెంటర్‌కి చేరుకునే సరికి ఆరున్నర దాటింది.

వ్యాన్ ఆగగానే మురళి దూకుతున్నట్లే దిగి పి.ఆర్.వో గదిలోకి వెళ్లి కొన్ని వైట్ పేపర్లు తీసుకుని నేరుగా ప్రెస్‌క్లబ్‌వైపు పరుగెత్తుతున్నట్లే నడిచాడు.

ప్రెస్‌క్లబ్‌లో కూర్చుని సర్పంచ్ సదస్సులో మంత్రి ప్రసంగాన్ని వార్తగా రాసే ప్రయత్నంలో పడ్డాడు.

వార్త రాస్తున్నా జీవకోనలో జరగబోయే దారుణమే గుర్తుకొస్తోంది.

ఎలా చేస్తే బావుంటుంది? ఏం చేస్తే జీవకోన వాసులను రక్షించవచ్చు? అన్యమనస్కంగానే వార్తను పూర్తి చేశాడు.

రేపు ఆ వార్త ఫ్రంట్ పేజీలో వస్తుంది.

సాధారణంగా ఫ్రంట్ పేజీ వార్తంటే మామూలుకంటే ఎక్కువ శ్రద్ధ పెట్టి రాయవలసి వుంటుంది. ఎందుకంటే అది రాష్ట్రంలోని పాఠకులందరూ ముందుగా చూసే వార్త. పక్క పేపరోళ్లు ఒకముక్క ఎక్కువగా ఇచ్చినా ఈ పేపర్‌ను చులకనగా చూసే అవకాశం వుంటుందని బ్యూరోఛీఫ్ ఎప్పుడూ కొంత శక్తి సామర్థ్యాలున్న రిపోర్టర్‌లనే ఫ్రంట్ పేజీ వార్తల కవరేజీకి పంపుతుంటాడు.

మురళీ కవర్ చేసే అస్సైన్‌మెంట్‌ను వార్తగా రాసేటప్పుడు సరిగా రాకపోతే ఎన్నిసార్లైనా చింపేసి తనకు నచ్చినప్పుడే దాన్ని డెస్క్‌కి ఇస్తాడు.

మురళీ వార్త రాశాడు అంటే ఇక ఏ సబ్ ఎడిటరూ దాన్ని చదివే ప్రయత్నంగానీ పొరబాటున చదివినా దానిలో కరెక్షన్స్ చేయాలనిగానీ ప్రయత్నం చేయరు. అంత బాగా రాస్తాడు మురళీ.

ఎప్పటిలాగే తను రాసిన వార్తను ఒకసారి చూసుకుందామనిపించింది. వార్త బాగా రాలేదని తెలుస్తూనే వుంది. అయినా మంత్రి ప్రసంగంలో జనం కొత్తగా తెలుసుకునే విషయాలుగానీ ఆసక్తికరమైన అంశాలుగానీ లేవు. కాబట్టి వార్త కొంచెం అటూ ఇటూగా వున్నా ఫరవాలేదులే అనుకుంటూ బయటకు నడిచాడు. అయిదు నిమిషాలు వెయిట్ చేసేసరికి పత్రికాఫీసు మీదుగా వెళ్లే ప్రైవేట్ వ్యాన్ వచ్చింది. వార్తను ఒక కవర్‌లో వుంచి డ్రైవర్ చేతికిచ్చి తమ ఎడిషన్ సెంటర్ వద్ద వాచ్‌మెన్‌కు ఇవ్వమని చెప్పి అతనికి అయిదు రూపాయలు ఇచ్చాడు.

"తప్పకుండా ఇస్తాను సార్" అన్నాడు డ్రైవర్.

మంత్రిగారి ప్రోగ్రామ్‌కు వెళ్లొచ్చి ఆఫీసుకు వెళ్లకుండా వార్తను పంపడం మురళీకి ఇదే ప్రథమం.

ఫ్రంట్ పేజీ వార్త కాబట్టి ఎవరికి ఏ సందేహం వచ్చినా దగ్గరుండి చూసుకోవాల్సి వుంటుంది. అవసరాన్నిబట్టి ఆ కార్యక్రమానికి సంబంధించిన రివ్యూలు, ఇతర విషయాలు రాయాల్సి వుంటుంది. కాబట్టి మంత్రి ప్రోగ్రామ్‌కు వెళ్లినవాళ్లు ఖచ్చితంగా ఆఫీసుకు అటెండ్ కావాలని బ్యూరోఛీఫ్‌లు ఆదేశిస్తుంటారు.

ఆ ఆదేశాలను ఖాతరు చేసే పరిస్థితిలో లేడు మురళి. కోనేటికట్ట వద్దే మంగళం

బస్సు ఎక్కి లీలామహల్ వద్ద దిగి జీవకో న వైపు నడవసాగాడు.



నాగరికత తాకిడి తగలకపోవడం వల్ల నేమో చెట్లన్నీ కళకళలాడుతున్నాయి జీవకో నలో.

పక్షులన్నీ తిరిగి తమ గూళ్లను చేరుకుం టున్నాయి.

రోజంతా చెమటోడ్చి శ్రమించిన కష్టజీ వులు మాసిన, అలసిన దేహాలతో తమ ఇళ్లకు చేరుతున్నారు.

ఒంట్లో నొప్పులు మగవాళ్లను సారాకొట్టు కేసి నడవమని చెబుతున్నాయి.

"ఏం భూలోకా ఒళ్లునొప్పులకు కిటుకు చెబుతా వస్తావా" అన్నాడు మల్లిగాడు. అతను చెప్పబోయేది అర్థమైన భూలోకడు "నీకో దండం, నీ కిటుకులకో దండం. నువ్వు పో స్వామీ" అన్నాడు.

"పిచ్చిమాలోకం" అని కామెంట్ చేస్తూ వెళ్లిపోయాడు మల్లిగాడు.

జీవకోనకు వచ్చిన నాటినుండి ప్రతిరోజూ ఎవరో ఒకరు పొద్దుపోగానే సారాకొట్టుకు పోదాం రమ్మంటూ పిలుస్తూనే వున్నారు. కానీ తనకు అలవాటులేదు. ఒకవేళ వుండి వున్నా ఇప్పుడున్న పరిస్థితుల్లో తాగలేడు.

తనకంటూ ఒక గుడిసె వేసుకోవాలి. అమ్మానాన్నలను ఇక్కడికే పిలుచుకొచ్చుకో వాలి. ఇంట్లోకి కావలసినవి, భార్యకు కావ లసినవి కొనుక్కోవాలి.

"ఈపాటికి వంట చేస్తూ వుంటుందేమో గంగావతి" అనుకున్నాడు భార్య గుర్తుకు రాగానే.

అతని ఆలోచనలు భార్య చుట్టూ పరిభ్ర మించసాగాయి.

తిరుపతికి వచ్చిన నాటినుండి ఎందుకో గంగావతి రోజురోజుకీ దిగులుపడిపోతు న్నట్లు కనిపిస్తోంది. కొత్తస్థలం కాబట్టి భయమేమో? పని దొరక్కపోతే భయపడా లికానీ పని దొరికినంత కాలం భయమెం దుకు? పని చేయడం కష్టంగా వుందేమో?

చిన్నప్పటినుండి పనికి అలవాటు పడిన వ్యక్తే. కాబట్టి అది కారణం కాదు. ఎప్పుడూ హుషారుగా వుంటుంది గంగావతి. అలాం టిది తిరుపతికి వచ్చిన నాటినుండి మౌనంగా వుంటోంది. తనలోతనే ఏదో ఆలోచిస్తూ వుంటుంది.

రాత్రి ఎప్పుడు లేచి చూసినా మేల్కొని ఏదో ఆలోచిస్తూ వుంటుంది.

ఏమైంది గంగావతికి?

చీకటి అప్పటికే బాగా చిక్కబడింది.

అయినా ఇంట్లో బుడ్డీ వెలగడంలేదు. వాకిలి తెరిచి వుందంటే గంగావతి వచ్చి వుంటుంది. వచ్చిన వ్యక్తి బుడ్డీ వెలిగించ కుండా ఏం చేస్తోంది?

"గంగా...గంగా" కొంచెం గట్టిగానే పిలి చాడు.

లోపల్నుంచి ఎటువంటి శబ్దమూ రాలేదు.

జేబులోనుండి అగ్గిపెట్టె తీసి అగ్గిపుల్ల గీశాడు.

ఆ వెలుగులో గంగావతి కనిపించింది.

మోకాళ్లపై తలపెట్టుకుని దీనంగా కని పించింది.

ఆ దృశ్యం ఎందుకో అతన్ని భయపె



ట్టింది.

ఎలా మాట్లాడాలో ఏం మాట్లాడాలో తోచలేదు. అలాగే నిల్చుండిపోయాడు. అగ్గిపుల్ల కాలుకుంటూ వచ్చి వేలుని చురుక్కుమనిపించడంతో చటుక్కున స్పృహలోకి వచ్చి అగ్గిపుల్లను కిందపడేశాడు. ఇంటి నిండా మళ్లీ చీకటి ప్రవేశించింది.

మరొక పుల్ల వెలిగించి బుడ్డీ వెలిగించాడు.

గంగావతికి దగ్గరగా వెళ్లాడు.

ఆమె తలపై నెమ్మదిగా చేయివేసి "గంగా..." అన్నాడు.

ఆ గొంతులోని ఆర్ద్రతకు ఆమె కదిలిపోయింది. ఆమె మౌనం బద్దలయ్యింది. గట్టు తెగిన చెరువే అయ్యిందామె.

గట్టిగా భూలోకని కౌగలించుకుని బావురుమంది. భూలోకడు బిక్కచచ్చిపోయాడు.

ఏం జరిగిందో అర్థంకాక ఆందోళన పడిపోయాడు.

"ఏం జరిగింది గంగా" మాటలు కూడదీసుకుంటూ అడిగాడు.

ఒక్కొక్కటిగా వచ్చిన నాటినుండి ఆ రోజు వరకు జరిగిన ఘటనలన్నింటినీ ఏడుస్తూనే వెక్కిళ్లమధ్యే వివరంగా చెప్పింది.

బాధల బరువు పంచుకుంటే తగ్గుతుందంటారు. కానీ ఆమెకు పుండును కెలికినట్లు మరింత ఎక్కువయ్యింది.

వింటున్న భూలోకడు నిశ్చేష్టుడైపోయాడు.

ఎంతకీ మాట్లాడని భర్తని చూసి ఏడుస్తూనే వెనక్కి జరిగి, మోకాళ్ల మధ్య తల దాచుకుంది.

ఇద్దరి మధ్యా భయంకరమైన నిశ్శబ్దం ఆవరించుకుంది.

ఏ కారణంగా తాము పల్లెనొదిలి ఇంత దూరం వచ్చారో అదే సమస్య ఇక్కడా ఎదురవుతోంది! ఎదురవ్వడం కాదు తరుముకొస్తోంది.



పల్లెల్లో కామాంధులైన భూస్వాములు ఏ కొందరో, అదీ ఎప్పుడో ఎవరూ చూడకుండా, అవకాశమొచ్చినప్పుడు ఆడవాళ్లను బలాత్కారం చేస్తుంటారు. కానీ ఇక్కడ ప్రతిరోజూ అందరూ చూస్తుండగా అవకాశం కల్పించుకుంటూ ప్రతి కాంట్రాక్టరూ ఆడవాళ్లని అనుభవిస్తున్నాడు.

ఇదేమని అడిగే వాళ్లులేరు.

గంగావతి చెప్పిందాంట్లో ఇసుమంత కూడా అబద్ధం వుండదు.

తాను పనిచేసేచోట కాంట్రాక్టర్ కూడా ప్రతిరోజూ పనికివచ్చిన వారిలో ఒకరిద్దరిని తన గదిలోకి పిలుచుకుపోవడం, పనిచేస్తున్న వాళ్లు రకరకాలుగా చెప్పుకోవడం చూస్తూనే వున్నాడు, వింటూనే వున్నాడు. అందునా గంగావతి సహజంగానే కొంత అందమైంది. అటువంటప్పుడు కాంట్రాక్టర్ల కన్ను పడకుండా ఎలా వుంటుంది.

అతని మనసు రగిలిపోయింది.

ఈ కాంట్రాక్టర్లను, మేస్త్రీలను నిలువునా నరికేయాలనిపించింది. ఒళ్లు దాచుకోకుండా కష్టపడుతూ వచ్చే కూలీతో జీవనం సాగిద్దామన్నా సాగనివ్వక అడుగడుగునా ఆటంకాలు కల్పిస్తున్న వ్యవస్థపై అతనికి అసహ్యం పుట్టింది.

గంగావతేకాదు. మానాభిమానాలు వున్న ఏ స్త్రీ అయినా కూలి కోసం మేస్త్రీలకింద పడుకోదు. మరయితే ఇప్పుడేం చేయాలి?

ఈ వూరిని వదిలి వెళ్లిపోవాలా?

ఎక్కడికని పోగలం?

పరస్త్రీవైపు కన్నెత్తి చూడడమే పాపమని భావించేవారు వుండే వూరెక్కడన్నా వుంటుందా? ఆ అవకాశమేలేదు. ఎక్కడికి వెళ్లినా ఇలాంటి సంఘటనలు జరగవన్న గ్యారెంటీ లేదు.

పోనీ గంగావతిని కూలికి పంపించకుండా తనొక్కడే కష్టపడితే? కుదరదు. ఈ పట్నంలో రేట్లు చూస్తే చుక్కల్ని తాకు

తున్నాయి. ఒక్కడి సంపాదనతో ఇద్దరికీ తిండి గడిచిపోతుందేమోగానీ గుడ్డ, గూడుకు అద్దె... ఇతర అవసరాలకు చాలదు. ఆపైన ఏ చిన్న జబ్బు వచ్చినా ప్రాణానికి వచ్చినట్లే, కాబట్టి ఖచ్చితంగా గంగావతి కూలికి వెళ్లాల్సిందే!

ఫోనీ తాను పనిచేస్తున్న చోటే మేస్త్రీని కాళ్లావేళ్లాపడి అడుక్కుని పని ఇప్పిస్తే?

ఒకరోజు, రెండురోజులు సాఫీగా జరగచ్చు. ఆపైన పరిస్థితులు మళ్లీ మొదటికొస్తాయి. అందులో సందేహంలేదు.

మేస్త్రీ ఆడవాళ్లను వాళ్ల భర్తలముందే లోపలికి తీసుకెళ్లడం తను ఎన్నిసార్లు చూడలేదు.

అవునూ తమ పెళ్లాల్ని తమ కళ్లముందే అనుభవిస్తుంటే వాళ్లెందుకు చూసీచూడనట్లు వుండిపోతున్నారు.

వాళ్లకు సిగ్గు, అభిమానం ఏమీలేవా?

అసలు సిగ్గూ, అభిమానం తనకున్నాయా? వుంటే తనెందుకు వూరుకున్నాడు. అయితే లేవా? లేవంటే లేవని కాదు తాను బలహీనుడు. వాళ్లు బలవంతులు. తమపై వాళ్లకు అన్ని హక్కులు, సర్వాధికారాలూ ఎక్కడా రాసిపెట్టకపోయినా ప్రభుత్వ గ్రంథాలు మా ప్రజలకు స్వాతంత్ర్యం వుందని ఘోషిస్తున్నా వాళ్ల చేతుల్లోనే అన్నీ వున్నాయి. తాము బానిసలు, వాళ్లు యజమానులు.

ఇప్పుడు తానేకాదు, ఎవడూ ఏమీ చేయలేడు. కూలివాడు బతకాలంటే వాడి పెళ్లానికి శీలం వుండాలన్న నిబంధన పెట్టకూడదు. పెళ్లాం రెకమండేషన్‌తో కూలిపనులు సంపాదించుకునే మగవాళ్లు కూడా తనకు తెలుసు. దీన్నిబట్టి చూస్తుంటే శీలం కన్నా కడుపేమిన్న అనిపిస్తోంది. నిజమే! కడుపుకోసం ఆ పని చేస్తున్నవారే అందరూ కానీ ఒళ్లుబలిసీ కొవ్వెక్కీ కాదుకదా!

అయినా ఇంతమంది భర్తలు రాజీ పడగాలేనిది తాను రాజీపడలేడా? బతకాలంటే కొన్ని భరించక తప్పదు.

అయినా ఈ గంగావతికి ఇంత మానాభిమానమెందుకు? నలుగురూ నడుచుకున్నట్లే నాకు తెలియకుండా, నాకు చెప్పకుండా ఆ దరిద్రపుగొట్టు మేస్త్రీలతో, కాంట్రాక్టర్లతో పడుకొనుంటే సరిపోయేదికదా!

కూలి వాడింట్లో పుట్టినవాళ్లు కూటికోసం ఏమైనా చేయాల్సి వుంటుందని తెలుసుండదు పాపం.

ఎక్కడో మహారాజుల కడుపున పుట్టినట్లు మడికట్టుకు కూర్చుంటే బతకగలమా?

కాదూకూడదంటే ఆత్మహత్యే శరణ్యం.

కాబట్టి దీనికి ఒకటే మార్గం!

అతను ఒక నిశ్చయానికి వచ్చాడు.

అప్పటికి సమయం వేకువజామున నాలుగు దాటుతోంది. ఇద్దరూ భోంచేయలేదు. నిద్రపోలేదు.

★ ★ ★

చీకట్లు బాగా అలుముకోవడంతో దారి సరిగా కనబడడంలేదు. నడుస్తుంటే ఎదురవుతున్న ఇబ్బందులనుబట్టి ఆ దారి ఎంత అధ్వాన్నంగా వుందో గ్రహించాడు మురళీ.

తాను నడుస్తున్న దారి, తాను వెళుతున్న కాలనీ వంటివికూడా ఈ ఊళ్లో వున్నాయంటే నమ్మబుద్ధికాదు.

వాగ్దానాలతో గెలిచి, గద్దె మీదున్న ఐదేళ్లూ వాటిని దాచిపెట్టుకుని మళ్లీ ఎన్నికల్లో బయటపెట్టుకుందామనుకునే రాజకీయనాయకులు వున్నంతకాలం ఇలాంటి మురికివాడలు విలసిల్లుతూనే వుంటాయి. విస్తరిస్తూనే వుంటాయి.

ప్రభుత్వం ఎన్ని పథకాలు పెట్టినా అవి పేద ప్రజలను చేరడం లేదు. మూడుపూటలా పస్తులుండకుండా ఎలా చూసుకోవాలి. అన్న ఆలోచనలతోనే కూలీల జీవితాలు గడచిపోతాయి. మధ్యలో చదువుకోసమో, మరో దానికోసమో సమయాన్ని కేటాయించే తీరిక వాళ్లకు కనిపించదు.

అందుకే బయటి ప్రపంచాన్ని గురించి వాళ్లు పట్టించుకోరు. పట్టించుకోలేరు. వాళ్లది అతి చిన్న ప్రపంచం. తాను, తన కుటుంబసభ్యులు, కాలనీవాసులు, తోటి కూలీలు, కాంట్రాక్టర్లు, పనులు... ఇవే లోకం. వాళ్ల ఆలోచనలు కూడా వీటి చుట్టూనే పరిభ్రమిస్తూ వుంటాయి. ఎవరైనా గట్టిగా 'నువ్వు చేసింది తప్పు' అన్నారంటే నిజమేనేమో అనుకునే రకం.

ఇలాంటి జనాన్ని రాంపాదరెడ్డిలాంటి రౌడీల, దౌర్జన్యకారుల కబంధహస్తాలనుండి ఎలా రక్షించాలి?

తనకొచ్చిన ఆలోచన ఆచరణ సాధ్యమా?

తన పథకాన్ని వీళ్లు అర్థం చేసుకోగలరా? వాళ్లకు అర్థమయ్యే విధంగా తను నచ్చజెప్పగలడా?

అన్నీ సమాధానాల్లేని సందేహాలే!

నేరుగా రాంనారాయణ వాళ్లింటికి పోయాడు మురళి.

లోపల కిరోసిన్‌బుడ్డీ వెలుగుతోంది.

ఇంటిలో ఒకపక్కగా కొయ్యదండెం వేలాడుతోంది. దానిపైన బట్టలు వేసి వున్నాయి. దండెం కిందుగా దొంతులు పేర్చివున్నారు. మరోపక్క మట్టిపాత్రలు, సొట్టపడ్డ స్టీలు పాత్రలు వున్నాయి. నట్టింట్లో కూర్చుని చిన్న పాపను ఆడిస్తున్నాడు రాంనారాయణ. అతని భార్య పొయ్యి దగ్గర కూర్చుని కొరివిలు ఎగదోస్తోంది. మురళిని చూసి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు రాంనారాయణ. "రండి సార్! రండి సార్" అన్నాడు ఆనందంతో తబ్బిబ్బవుతూ.

దొంతుల సందులో నుండి చినిగిపోయిన చాపను తీసి కిందేసి "కూర్చోండి సార్" అన్నాడు ఆ చాపను వేయాల్సి వచ్చినందుకు సిగ్గుపడిపోతూనే.

వాటన్నిటినీ పట్టించుకునే పరిస్థితిలో లేడు మురళీ.

"గోవిందు, వెంకటేశు, చిన్నబ్బులను పిలుచుకొస్తావా రాంనారాయణా" అన్నాడు మురళీ చాపపై కూర్చుంటూ.

వేళగాని వేళలో రావడం, వస్తూనే గోవిందు వాళ్ళని పిలుచుకుని రమ్మనడం... రాంనారాయణ మనసెందుకో కీడును శంకించింది. ఏంపని సార్? అందామనుకున్నాడు. కానీ బావుండదేమోననిపించింది.

"రెండు నిమిషాల్లో పిలుచుకొచ్చేస్తాను సార్" అంటూ చిన్న పాపను కిందకు దించి వీధిలోకి వెళ్లాడు రాంనారాయణ.

"నేనొచ్చిన సంగతి మిగతా ఎవరికీ చెప్పొద్దు" అన్నాడు మురళి బయటకు వెళ్తోన్న రాంనారాయణనుద్దేశించి.

ఎవరికీ చెప్పొద్దంటున్నాడంటే... అతనిలో రకరకాల అనుమానాలు కలగసాగాయి.

ఆలోచిస్తూనే పరుగెత్తుతున్నట్లే వీధిలోకి దూసుకుపోయాడు.

రాంనారాయణ, వెంకటేశు, గోవిందు, చిన్నబ్బులకు ఆర్‌డివో చేత స్థలాలు ఇప్పించింది మురళీ అని జీవకోన మొత్తం తెలిసిపోయింది. ఇప్పుడు అక్కడున్న వాళ్ళలో చాలామంది మురళీకి తెలియకపోవచ్చుగానీ, మురళీ తెలియని వారెవరూ లేరు. అంతగా ప్రచారం చేశారు ఆ నలుగురూ.

ఆ వాతావరణం ఇంకా పల్లెవాసనల్ని వదలలేదు. కాబట్టి తనొచ్చాడని తెలిస్తే జనం పరుగెత్తుకుంటూ వచ్చేస్తారు. అప్పుడు తన పథకం ఫెయిలవుతుంది. అందుకే తన రాకని తెలియజేయవద్దని రాంనారాయణను కోరాడు మురళి.

కూటికి సంపాదించుకోవడమే కష్టమైపోయి బతుకుతున్నవారికి అండగా నిలిచి, గూడు కట్టుకునేందుకు స్థలం ఇప్పించాడంటే అది కూలీల దృష్టిలో చాలా చాలా గొప్ప విషయం.

"అంత గొప్పవ్యక్తి మనకోసం వచ్చాడంటే,

ఏదో అవసరం వుండే వచ్చివుంటాడు. సార్‌కు ఏ అవసరమన్నా కానీ, ప్రాణాలకు తెగించైనా సాయం చేద్దాం" అన్నాడు గోవిందు.

"సార్ వచ్చిన విషయం బయటోళ్ళకెవరికీ చెప్పొద్దు. నేను బోయి వెంకటేశుని పిలుచుకొని వస్తాను. నువ్వు చిన్నబ్బు దగ్గరికి పోయి పిలుచుకుని రా" అని వీధిలోకి పోయాడు రాంనారాయణ. నలుగురూ రాంనారాయణ ఇంటికి చేరేసరికి మురళి రాంనారాయణ కూతుర్ని ఆడిస్తున్నాడు.

చదువుకున్నవాళ్ళు, అగ్రకులాలవాళ్ళు తమని చూసి ఛీదరించుకోవడమే తెలుసు. అలాంటిది తమ పాపను ఎత్తుకుని ఆడిస్తున్న మురళీని చూసి వాళ్ళు సంభ్రమానికి లోనయ్యారు.

వాళ్ళలో అతనిపట్ల మరింత అభిమానాన్ని కలిగించింది ఆ దృశ్యం.

"నమస్కారం సార్" అంటూ లోనికి వచ్చారు గోవిందు, వెంకటేశు, చిన్నబ్బులు.

వారి వెనగ్గా లోపలికి వచ్చాడు రాంనారాయణ.

"నమస్తే... బావున్నారా అందరూ" అడిగాడు మురళి.

"ఏదో తమరి దయవలన బాగానే వున్నాం సార్"

"కూర్చోండి. మాట్లాడుకుందాం"

అందరూ కూర్చున్నారు.

ఎలా మొదలుపెట్టాలి? ఎక్కడ మొదలు పెట్టాలి?

సూటిగా మీ గుడిసెల్ని రాత్రికి కాల్చేయబోతున్నారని చెబితే?

అది అంత మంచిది కాదు. పోనీ ఇంకొక విధంగా చెబితే?

మురళీ ఏదో చెప్పడానికి తటపటాయిస్తున్నాడని "ఫరవాలేదు సార్ మేం చేస్తాం చెప్పండి సార్" అన్నాడు గోవిందు.

గోవిందు కొంచెం చురుగ్గా వుంటాడు అందరిలోకీ.

"రాత్రికి మీరంతా నాతోనే వుండాలి" అన్నాడు మురళీ.

"అంతేనా సార్. తప్పకుండా వుంటాం సార్"

"రాత్రికి మనమంతా మేల్కొని కాపలా కాయాలి? "

"ఎందుకు సార్? " ఒకేసారి అడిగారు నలుగురూ.

సార్‌ను కొట్టడానికెవరైనా ప్రయత్నం చేస్తున్నారేమో. లేకుంటే ఇంత రాత్రి రావడం, రాత్రంతా కాపలా కాయాలని చెప్పడం ఏమిటి? సార్ ప్రాణానికి ఏదైనా ముప్పు వచ్చిందేమో. ఏదేమైనాగానీ మురళీ సార్‌కు ఏమీ కాకుండా అడ్డుకొని తీరాలి. సార్‌లాంటి మంచి మనిషిని కాపాడుకొని తీరాలి.

"రాత్రికి రాంపాదరెడ్డి మనుషులు జీవకోనకు వస్తున్నారు"

ఉలిక్కిపడ్డారు నలుగురూ.

"కొందరి ఇళ్ళను ఆక్రమించుకోవడానికి వాళ్ళు వస్తున్నట్లు తెలిసింది". అంతసేపూ మురళి వ్యక్తిగత సమస్యలతో వచ్చాడని, ఆయనకు అండగా నిలవాలనీ ఆలోచిస్తున్న వాళ్ళందరూ తమ ఆలోచనకు తామే సిగ్గుపడ్డారు.

ఎంత గొప్ప వ్యక్తి. తమకోసం... ఏమీ కాని తమకోసం ఇంత రాత్రిపూట వచ్చి తమ వారిని రక్షించడానికి పూనుకుంటుంటే... వాళ్ళలో అతనిపట్ల అభిమానం ఉప్పొంగింది. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అందరి గొంతులూ మూగబోయాయి.

తమను కూడా ఓ రాత్రి వచ్చి ఎలా హెచ్చరించిందీ, కొట్టి హింసించి తమ స్థలాన్ని ఆక్రమించుకున్నారో గుర్తొచ్చి రాంపాదరెడ్డి మనుషుల్ని నరికి పోగులు పెట్టెయ్యాలన్నంత కసి వారి కళ్ళలోకి ఉబికి వచ్చింది.

"ఆ నాకొడుకులు అప్పుడు నన్ను ఒక్కడ్నీ చేసి కొట్టడం మగతనమనుకున్నారు.

ఇప్పుడు రానీ మా వాళ్ళందరినీ పిలుచుకు వచ్చి ఒక్కొక్కడ్నీ పులుసులోకి ఎముకలు లేకుండా ఏరేసి నా సత్తా ఏమిటో చూపి స్తాను" అన్నాడు ఆవేశంగా గోవిందు.

మిగతావాళ్ళు కూడా అదే సరైందన్నారు.

"వద్దు... వద్దు అందర్నీ పిలవద్దు. ముందు మీరు గొంతు తగ్గించి మాట్లా డండి" కంగారుగా అన్నాడు మురళి.

అందరూ అర్థంకాక విచిత్రంగా చూశారు మురళీవైపు.

అందర్నీ పిలవద్దు. అలా పిలవడంవల్ల కాలనీలో ఒక్కరు కూడా నిద్రపోకుండా మేల్కొని వుండి ఇబ్బందిపడతారు. ఆ వచ్చే వాళ్ళూ, ఇంతమంది మేల్కొని వుండడం చూసి అటే ఉడాయిస్తారు అన్నాడు మురళి.

"అదీ నిజమే. అయితే ఏం చేద్దామం టారు సార్" అన్నాడు చిన్నబ్బు.

"ఏం మనం అయిదుమందిమి వాళ్ళను కొట్టలేమా" అన్నాడు మురళి.

మామూలుగా అయితే సందేహించేవాళ్ళే మోకానీ ఇప్పుడు మురళి వుండడంతో వాళ్ళలో పిరికితనమన్నది ఏ మూలా కని పించలేదు.

"కొట్టగలం సార్" అన్నారు అందరూ ధీమాగా.

ఒక్క నిముషం నిశ్శబ్దంగా వుండి చెప్పడం ప్రారంభించాడు మురళి.

"వాళ్ళు రాత్రికి వస్తున్నారని నాకు తెలి సింది. ఒకవేళ వాళ్ళు రాలేదనుకోండి. అప్పుడు అందరూ మనల్ని చెడ్డగా అనుకుం టారు. కాబట్టి ఎవరికీ చెప్పొద్దు అన్నాను. మనం అయిదుమందిమి చాలు. మనం కాపలా వుందాం. అవసరమనిపిస్తే మీకు నమ్మదగిన వ్యక్తులెవరయినా వుంటే వాళ్ళను మాత్రం పిలుచుకురండి. ఎక్కువ మంది వుంటే అది కూడా మంచిదే"

మురళీ సూచించిన పద్ధతి వాళ్ళకు నచ్చింది. తాము అయిదుమంది వచ్చేవా ళ్ళను ఎదుర్కొనగలరుకానీ, వస్తున్నవాళ్ళు రౌడీలు. ఒకరిద్దరు ఎక్కువ వుంటేనే మంచిది అనుకుని చెరో ముగ్గుర్ని పిలుచు కువస్తామని చెప్పి బయటకు వెళ్ళారు చిన్నబ్బు, గోవిందులు.

రాంనారాయణ, వెంకటేశులు అక్కడే కూర్చునివున్నారు.

"రాంనారాయణా! ఇక్కడివాళ్ళు నీళ్ళు ఎక్కడినుండి తెచ్చుకుంటారు? " అడిగాడు మురళి.

"ఈడ దగ్గర్లో ఒక బోరింగ్ వుందిసార్. అక్కడినుండి తెచ్చుకుంటాం" అన్నాడు రాంనారాయణ.

"దగ్గర్లో నీళ్ళ ట్యాంకు ఏదీలేదా? "

"జీవకోనకు ముందుగా వున్న క్రాంతినగ ర్‌లో బోరు వేసినారు సార్. దానికి మోటారు బిగించి తాగేనీళ్ళు వదులుతున్నా రుసార్. ట్యాంక్‌ను నిదానంగా కడతారట" అన్నాడు రాంనారాయణ.

"ఆ బోరునుండి ఇక్కడికి ఎంత దూరం వుంటుంది? "

"రెండు ఫర్లాంగులు సార్"

"దగ్గర్లో ఎవరైనా కొత్తగా ఇండ్లు కడుతు న్నారా? "

"క్రాంతినగర్‌లో రెండుమూడు మిద్దెలు కడుతున్నారు సార్"

"ఆ కట్టేవాళ్ళలో నీకెవరైనా తెలుసా? "

"అందరూ తెలుసు సార్!"

అంతలో గోవిందు, చిన్నబ్బులు ఇద్దరూ చెరో ముగ్గుర్నీ వెంటబెట్టుకునివచ్చారు.

కొత్తగా వచ్చిన వాళ్ళంతా యువకులే. సమరోత్సాహానికి సిద్ధంగా వున్న సైనికుల్లా వున్నారు. వాళ్ళ చేతుల్లో దుడ్డుకర్రలు న్నాయి. వాళ్ళ మొహాల్లో పట్టుదల కనిపి స్తోంది.

"రేయ్ వెంకటేశూ! నువ్వుపోయి అన్నం తినేసి వచ్చేయ్‌రా! నీ పెండ్లాం అరుస్తా వుంది" అన్నాడు గోవిందు.

"మీరంతా తినేసి వచ్చినారా? " అడిగాడు

వెంకటేశు.

"మేమంతా ఎప్పుడో ఏడుగంటలకాడ్నే తినేసినాం" అన్నారు వాళ్ళందరూ.

"సరే... నేనూ ఇప్పుడే తినేసి వచ్చేస్తా వుండండి" అంటూ వీధిలోకి పరుగెత్తాడు వెంకటేశు.

"ఏం నారాయణా, నువ్వు కూడా తినేస్తే ఒక పనైపోతుందిగదా" అన్నాడు చిన్నబ్బు.

రాంనారాయణకు అప్పటికే బాగా ఆకలేస్తోంది.

అయితే మురళీని ఎదురుగా పెట్టుకుని తినాలంటే నామోషీగా వుంది. భోం చేయమని పిలుద్దామా అంటే అతను పెద్దకులానికి చెందినవాడు. తమింట్లో భోంచేస్తాడో చేయడోనన్న సందేహం.

జీవకోనలో ఆవాసమేర్పరచుకున్నవారిలో తొంభైశాతానికి పైగా దళితులే. వారంతా గ్రామాలనుండి వలసవచ్చినవారే. అందరూ అగ్రకులాల అలవాట్లు, పెత్తనాలు రుచిచూసినవారే. అందువల్లే అక్కడున్న మిగతావారు కూడా ధైర్యంచేసి మురళీని తినమని అడగలేకపోయారు. తింటే తిననీ, తినకపోతే పోనీ మాట వరసకైనా పిలుద్దాం అనుకుని రాంనారాయణే ధైర్యంచేసి పిలిచాడు.

అప్పటికి సమయం పది కావస్తోంది.

"నాకొద్దు. నువ్వెళ్ళి భోంచేసేయ్" అన్నాడు మురళి.

"పెద్దకులాలోళ్ళు మన ఇళ్ళలో భోంచేయరని నీకు ముందుగానే తెలుసుకదా. ఆ సార్ మనింట్లో వచ్చి కూర్చోవడమే గొప్ప" అంది రాంనారాయణ భార్య.

ఆ మాటలకు విలవిలలాడిపోయాడు మురళి.

"అయ్యయ్యో... అలా అనుకోకండి. నాకు అలాంటి పట్టింపులేవీ లేవు. మీరు రోజంతా కష్టపడి తెచ్చుకున్న నాలుగ్గింజలు వుడకబెట్టుకుని వుంటారు. అది మీ ఇద్దరికే చాలీచాలకుండా వుంటుంది. నేను ఒక పూట తినకపోయినా ఫర్వాలేదుకానీ మీరిప్పుడు తినకుండా నాకు పెడితే రేపు మీరు పనిలోకి వెళ్ళలేరు. వెళ్ళినా పని బాగా చేయలేక అవస్థపడతారు. అందుకే వద్దన్నాను" అన్నాడు మురళీ సంజాయిషీ ఇచ్చుకుంటూ. ఒక్క నిమిషం ఆశ్చర్యంతో వాళ్ళ హృదయాలు ఆగిపోయి, ఆనందంతో కొట్టుకోసాగాయి.

నాగరికత తెలిసిన ఇంత పెద్ద పట్టణంలో కూడా తాము దళితులని తెలిస్తే నీళ్ళను చేతుల్లో పోసేవారిని చూసిన అక్కడివారికి ఆ మాటలు బీడుభూమిపై తొలకరిజల్లులా అనిపించింది. వారి మనసులు ఆర్ద్రమయ్యాయి. కళ్ళు చెమర్చాయి.

మురళీ మాటలు విన్నవెంటనే రాంనారాయణ భార్య వెళ్ళి గిన్నెత్తుకుని అందులోకి అన్నంవేసి, కూర పోసుకుని తెచ్చి మురళి ముందుపెట్టింది.

"మేం తెల్లారి చద్దికి కూడా ఇప్పుడే చేసుకుంటాం. రేపు మధ్యాహ్నానికి అన్నం ఎత్తుకొని పోవాల కాబట్టి తెల్లవార్తే మళ్ళీ అన్నం చేస్తాం. తెల్లవార్తే ఇంకో గ్లాసు బియ్యం ఎక్కువేసి చేసుకుంటే సరిపోతుంది మీరు తినండి" అంది రాంనారాయణ భార్య.

వాళ్ళు అంత అభిమానంతో పెడుతుంటే ఇక వద్దనలేకపోయాడు మురళి. తినడం ప్రారంభించాడు.

అక్కడున్న వాళ్ళందరికీ అదో అపురూప దృశ్యంలా అనిపించింది. మురళీసార్ చాలా గొప్పవాడేకాదు, తమవాడు కూడా అనుకున్నారు వాళ్ళు. భోజనానికి వెళ్ళిన వెంకటేశు తిరిగివచ్చాడు.

అప్పటికి సమయం పదిన్నర దాటుతోంది.

రోజంతా కష్టపడ్డంవల్ల తింటూనే నిద్రలోకి జారిపోయినట్లున్నారు కష్టజీవులు. వూరంతా నిశ్శబ్దంగా వుంది.

జీవకోనలోకి రావడానికి వున్న ప్రధానమైన నాలుగు మార్గాలను గుర్తించారు.

అన్నింటిలోకీ ముఖ్యమైనదీ, అందరూ సహజంగా వచ్చే దారివైపు కాపు కాశాడు మురళి.

మురళీతోపాటు రాంనారాయణ కూడా వున్నాడు.

మిగతావాళ్ళందర్నీ జట్లుజట్లుగా చేసి మిగతా మూడు మార్గాలవద్దా వుంచాడు.

ఎవరైనా కొత్తగా కనిపించినా, వెంటనే పట్టుకుని కొట్టకుండా ఆ వచ్చినవాళ్ళకు కనబడకుండా నక్కి వుండి వాళ్ళు ఏం చేస్తారో చూసిన తరువాత పట్టుకోవాలని అందరికీ సూచనలిచ్చి వున్నాడు మురళి.

సమయం పదకొండు దాటింది.

నెలవంక నెమ్మదిగా ఆకాశంలోకి రాసాగింది.

అంతదాకా వున్న చిమ్మచీకటి కొంత పలుచబడింది.

ఒంటిగంట దాటేసరికి నాలుగుబారలు పైకిసాగాడు చంద్రుడు.

చీకటి మరింత పలుచబడింది.

వస్తువుల్నీ, మనుషుల్నీ కొంత దగ్గరగా వస్తే గుర్తించే విధంగా కొద్దిపాటి వెలుగు పరుచుకొంది.

ఏ చిన్న శబ్దం వినిపించినా ఉలిక్కిపడి చూస్తున్నాడు మురళి. బొడ్డులో దాచుకున్న కత్తిని ఎంతసేపూ తడిమి చూసుకుంటున్నాడు రాంనారాయణ.

తను కత్తి తెచ్చుకున్న సంగతి మురళీకి చెప్పేద్దామని అనుకున్నాడు.

అతను అలా అనుకోవడం ఏ వందో సారో... చెబితే తిడతాడేమోనని కిమ్మనకుండా వున్నాడు.

పహరా కాస్తున్న వారందరికీ విసుగొస్తోంది. ఎవరూ రావడంలేదు. ఏమీ జరగడంలేదు. అనవసరంగా మేల్కొని వున్నామా? అనే సందేహం వస్తోంది.

"వెళ్ళి పడుకుంటే బావుణ్ణు" అని అందరికీ అనిపిస్తోంది. అయితే ఎవరూ బయటకు చెప్పడంలేదు.

మురళీ మీదున్న గౌరవం, నమ్మకం వాళ్ళని అక్కడే నిలబెట్టేస్తోంది.

సమయం రెండున్నర దాటుతుండగా ఎవరో వస్తున్న అలికిడయ్యింది.

మురళీ, రాంనారాయణలు పరిశీలనగా చూశారు.

దూరంగా ఇద్దరు వ్యక్తులు బీడీ వెలిగిస్తూ వస్తున్నారు.

బహుశా ఎవరైనా సినిమాకు వెళ్ళి ఇంకేదైనా పని చూసుకు వస్తున్నారేమో అనుకున్నాడు మురళి.

అయినా అనుమానంగా కళ్ళు వెడల్పు చేసి మరింత పరిశీలనగా చూశాడు.

అప్పుడు కనిపించారు మరో ఇద్దరు వ్యక్తులు.

ముందొస్తున్నవారికి కొంచెం వెనుకగా వస్తున్నవాళ్ళు.

తనతోపాటూ 'మయూర'లో భోంచేసిన వాళ్ళిద్దర్నీ గుర్తుపట్టాడు మురళి.

అప్పటికే రాంనారాయణ చేయి బొడ్డులోని కత్తిపైకి వెళ్ళింది.

అతను ముందొస్తున్న ఇద్దరినీ గుర్తుపట్టాడు. వాళ్ళిద్దరూ తనపై దౌర్జన్యంచేసి తన ఇంటిని కూలగొట్టినవాళ్ళు.

అతనిలో కసి రగులుకుంది. అతని చేయి కత్తిపై బిగుసుకుంది.

గబుక్కున రాంనారాయణ చేయి పట్టుకొని చింతచెట్టు మరుగుకు లాక్కెళ్ళాడు మురళి.

తనదగ్గర కత్తివున్న సంగతి తెలిసిపోయిందేమో అనుకున్నాడు రాంనారాయణ.

ఎంతకీ కత్తి గురించి మాట్లాడక, వస్తున్న వ్యక్తులకేసి చూస్తున్న మురళిని చూసి తన అనుమానం తప్పని నిర్ధారించుకున్నాడు.

వచ్చిన నలుగురూ నెమ్మదిగా చెట్టు దాటి వెళుతున్నారు.

"సార్... ఏం చేద్దాం సార్. వాళ్ళే దొంగనాకొడుకులు సార్" అన్నాడు రాంనారా

యణ గుసగుసగా.

"వద్దు" అన్నాడు మురళి శాసిస్తున్నట్లుగా.

వెళ్ళిన నలుగురూ ఒక గుడిసెముందు నిల్చుని లోగొంతుకతో ఏదో మాట్లాడుకుంటున్నారు.

అప్పుడప్పుడూ గుడిసెలవైపు చేయి చూపిస్తున్నారు.

"సార్ వాళ్ళు ఆ ఇంటిమీద పడతారేమో సార్. వెళ్దాంపదండి" అన్నాడు రాంనారాయణ ఆదుర్దాగా.

"కొంతసేపు వేచిచూద్దాం" అన్నట్లుగా చేయి ఊపాడు మురళి.

ఎప్పుడెప్పుడు వాళ్ళమీద పడదామా. కస కసా పొడుద్దామా అని వుంది రాంనారాయణకు.

వచ్చిన నలుగురిలో ఒకడు అగ్గిపుల్ల గీశాడు.

జరగబోయేది అర్థమయ్యింది.

"సార్... సార్... వాళ్ళంటించేస్తున్నారు. అయ్యొయ్యో అంటించేస్తున్నారు సార్. పరుగెత్తండిసార్ పోయి అడ్డుకుందాం" అన్నాడు కంగారుగా.

అగ్గిపుల్ల వెళ్ళి ఇంటిపై పడింది. చిన్నగా మంట రగులుకుంటోంది.

"రాంనారాయణా" పిలిచాడు మురళి.

ఆ గొంతులోని ప్రశాంతతను చూసి భయపడిపోయాడు రాంనారాయణ. ఓ పక్క ఇల్లు కాలిపోతుంటే... ఇంత ప్రశాంతంగా మాట్లాడుతున్నాడేంటి?

"సార్..." అన్నాడు ఆందోళనగానే. మురళీ పిలుపుకు స్పందిస్తూ.

"నువ్వు క్రాంతినగర్‌కు వెళ్ళి మిద్దెలకు నీళ్ళుపట్టే పైపుల్ని సంపాదించి... నువ్వు చెప్పావే గవర్నమెంట్ మోటారని దాన్ని వేసి, ఈ రోడ్డుమొదట్లో వున్న కుళాయికి పైపుని బిగించి, పైపు ఎత్తుకొని పరుగెత్తిరా" అంటూ ఆదేశించాడు.

రాంనారాయణకు అంతా అయోమయంగా వుంది. చివరకు మురళీపైన కూడా ఏదో మూల అనుమానం కలుగుతోంది.

అయినా ఏదో గుడ్డినమ్మకంతో ముందుకు కదిలాడు.

అప్పటికి రెండో ఇల్లు కూడా అంటించేశారు.

గాలి పెద్దగా వీచకపోవడంవలన అంటించిన గుడిసెలు నెమ్మదిగా రగులుతున్నాయి.

వాళ్ళు మూడో గుడిసెను అంటిస్తుండగా అడ్డదోవన పరుగెత్తి మరోదారిలో కాపలా వున్నవారిని కలుసుకున్నాడు మురళి. మురళీ పరుగెత్తి రావడంచూసి అంతసేపూ కునుకుపాట్లు పడుతున్న అక్కడివారందరూ అలెర్టయ్యారు.

"వెంకటేశూ... ఆ రాంపాదరెడ్డి మనుషులొచ్చారు. నలుగురున్నారు. మేముండిన వీధిలో వున్నారు. వాళ్ళని పట్టుకోవాలి"

"నేను మిగతా రెండు దోవల్లో ఉన్న వారిని కూడా పిలిచొస్తాను. మీరు అక్కడికి చేరుకోండి" అంటూ పరుగులు తీశాడు. గుడిసెలు అంటుకున్న సంగతిని మాత్రం చెప్పలేదు. అయినా వాళ్లు పరుగులు తీశారు.

మిగతా రెండు చోట్ల కాపలా కాస్తున్న వారిని పిలుచుకుని గుడిసెలు అంటుకున్న స్థలంలోకి వచ్చేసరికి మొదటి గుడిసెలో మంటలు ఉవ్వెత్తున లేచాయి.

అప్పటికి మేల్కొన్నట్లున్నారు ఆ ఇంటిలో వాళ్లు.

ఏం జరుగుతున్నదో అర్థం చేసుకుని ప్రాణభయంతో కేకలు వేస్తూ వీధిలోకి పరుగెత్తుకు వస్తున్నారు.

మిగతా మూడిండ్లు కూడా సరసరా కాలుతున్నాయి. తనతోపాటు వున్న వాళ్లందరికీ చకచకా పనులను ఆదేశించాడు.

"కాలుతున్న అన్ని ఇళ్లల్లోని మనుషుల్ని లాక్కురండి ముందు. తరువాత వీలైనంత ఎక్కువ సామాన్లు బయటకు లాక్కొచ్చే

ప్రయత్నం చేయండి" అని చెప్పి తనూ గుడిసెలో దూరాడు. ఆ ఇంట్లో మంచంపై పడుకునివున్న ముసలివ్యక్తి కాళ్లపై పడింది మండుతున్న ఇంటివాసం ఒకటి.

"అమ్మా" అని అరిచాడు అతను.

అతని పంచె అంటుకుంది.

అతను లేచి పరుగెత్తలేక భయంతో కేకలు పెడుతున్నాడు. ఇంటిలోకి దూసుకెళుతూనే ఆ ముసలివ్యక్తి పంచెను పీకి పక్కన పడేసి మనిషిని అలాగే చేతుల్లోకి ఎత్తుకుని బయటకు పరుగులు తీశాడు మురళీ.

మంటలకు దూరంగా అతన్ని పండబెట్టి మళ్లీ ఇంటిలోకి పరుగెత్తాడు మురళీ.

ముందుగా వచ్చిన వెంకటేశులు, అతని మిత్రులు రౌడీలను చూశారు. కాలుతున్న ఇళ్లను చూశారు.

ఎక్కడలేని ఆవేశంతో రేయ్... అని అరుస్తూ తమ దుడ్డుకర్రలతో రౌడీల బుర్రల్ని పగలగొట్టడానికి ప్రయత్నించారు.

ఒకటి రెండు దెబ్బలు పడగానే గ్రహించారు వాళ్లు. కాళ్లకు బుద్ధి చెప్పారు. కొంత దూరం తరుముకుంటూ వెళ్లిన వెంకటేశు, అతని మిత్రులు, మండుతున్న ఇళ్లను ఆర్పడానికి వెనుదిరిగారు.

క్రాంతినగర్‌కు వెళ్లి కొత్తగా ఇల్లు కడుతున్న వారిని లేపి వాళ్ల పైపును అడిగి తీసుకుని పరుగెత్తుకు వచ్చి బోరు మోటారు వేశాడు రాంనారాయణ. అక్కడి నుండి పరుగెత్తుకుంటూనే జీవకోనవాసులు నీళ్లుపట్టుకునే కుళాయి దగ్గరికి వెళ్లి నీళ్ల పైపు బిగించి ముందుకు కదిలాడు.

అప్పటికే గుడిసెలపై మంటలు ఎగసిపడుతున్నాయి.

తమ జీవితాలే కాలిపోతున్నట్లుగా జీవకోన వాసులు పెడుతున్న హాహాకారాలు అతని చెవిలో పడ్డాయి.

పైపును పట్టుకుని అంతులేని కసితో పరుగెత్తుకు వస్తున్నాడు రాంనారాయణ. అప్పుడు చూశాడు వాళ్లని.

కిందామీదా పడుతూ పరుగెత్తుకుంటూ వస్తున్నారు.

చీకటిలోకి కళ్లు బాగా అలవాటు పడ్డం వల్ల వాళ్లని చూడగానే గుర్తుపట్టాడు రాంనారాయణ.

నీళ్లపైపు కిందపడేశాడు.

బొడ్డులోకి చేయి దోపాడు. ఆవేశంగా కత్తిని బయటకు తీశాడు. వెనుకకు తిరిగి చూస్తూ తిరిగి చూస్తూ వస్తున్న నలుగురు రౌడీలలో ఒకడు తనని కొట్టి తన ఇంటిని ఆక్రమించుకొన్న వాళ్లలోని వ్యక్తి వచ్చివచ్చి రాంనారాయణను గుద్దుకున్నాడు. గమనించకుండా కెవ్వుమని కేకపెట్టాడు.

అప్పటికే రాంనారాయణ చేతిలోని కత్తి అతని కడుపులోకి దూసుకుపోయింది. రెండో మాటలేకుండా కూలిపోయాడతను.

తమతో వస్తూ వున్నవాడు ఎందుకో కెవ్వుమని కేకవేశాడే ఏం జరిగిందో? అని కూడా ఆలోచించకుండా పరుగెత్తారు మిగతావాళ్లు.

మొదట అంటుకున్న ఇల్లు పూర్తిగా కాలుతోంది.

అంతసేపూ ఎక్కడో నిద్రపోతున్న గాలి, ఈ వింత చూద్దామని అక్కడికి పరుగెత్తుకొచ్చింది.

మంటలు ఆకలిగా అటూ ఇటూ వూగసాగాయి.

పక్కనున్న ఇళ్లు కూడా అంటుకొనేటట్లు కనిపించగానే హాహాకారాలు మరింత ఎక్కువయ్యాయి.

మురళీలో ఆందోళన పెరిగిపోసాగింది.

రాంనారాయణ ఏమయ్యాడు?

నీళ్లు రాకపోతే మరిన్ని ఇళ్లు అంటుకోవడం ఖాయం.

తన పథకం మొత్తం అట్టర్‌ఫ్లాప్ అయ్యేట్లుంది. తన తెలివితేటలు వికటించనున్నాయి. జీవకోనంతా దగ్ధం కాబోతోంది.

రాంనారాయణ వెళ్లి చాలాసేపయిందే.

ఇంకా రాలేదంటే...

అతని మనసెందుకో కీడును శంకించింది.

ఇక అక్కడ ఒక్క నిమిషం కూడా వుండలేకపోయాడు.

వెంటనే క్రాంతినగర్‌వైపు దూసుకుపోయాడు.

మురళీ వెళ్లేసరికి నడిరోడ్డులో కదలకమెదలక రాతిస్తంభంలా నిలుచుని వున్నాడు రాంనారాయణ.

చేతిలో కత్తివుంది. కింద ఒక వ్యక్తి పడున్నాడు.

నీళ్లపైపు నుండి వస్తున్న నీళ్లు రోడ్డు మధ్యలో వున్న వెడల్పాటి గుంతను నింపుతున్నాయి.

"రాంనారాయణా" ఆదుర్దాగా పిలిచాడు.

అతనిలో వులుకూ పలుకూలేదు.

కిందపడి వున్న వ్యక్తికేసి పరిశీలనగా చూశాడు.

కడుపులో నుండి రక్తం స్రవిస్తోంది.

ఏం జరుగుంటుందో వూహించే ప్రయత్నం చేశాడు.

రాంనారాయణ చేయిపట్టి వూపాడు.

అతను ఉలిక్కిపడి స్పృహలోకి వచ్చాడు. కిందపడివున్న శవాన్ని చూసి గడగడా వణికిపోసాగాడు.

అతని చేతిలోని కత్తి కిందపడింది.

"రాంనారాయణా... భయపడకు" ధైర్యం చెప్పే ప్రయత్నం చేశాడు మురళీ.

"నేను...నేనే....నేనే...చంపేశాను" అన్నాడతను తడబడుతూ భయంభయంగా.

జరగాల్సిన దాన్ని చకచకా ప్లాన్ చేసుకున్నాడు మురళీ.

ఇటూ అటూ చూశాడు.

రోడ్డుపక్కగా ఆవులు నిలుచుని వున్నాయి. వాటిని కట్టివున్న గొత్తులకేసి చూశాడు. అవి మరీ మొద్దుబారిలేవు. కొంతవాటంగానే వున్నాయి. తనకు రక్తం అంటకుండా జాగ్రత్తపడుతూ శవాన్ని ఎత్తి సరిగ్గా శవం కడుపులో కత్తి దిగబడిన చోటే గొత్తి దూరేలా పండబెట్టాడు.

కొంచెం పక్కకి వెళ్లి చూశాడు.

గూటంపై బోర్లపడుకుని వున్నట్లుంది శవం.

ఓకే అనుకున్నాడు.

అప్పటికీ రక్తం స్రవిస్తూనే వుంది. తిరిగి చూశాడు.

నడిరోడ్డులో రక్తం చిన్న మడుగులా కనబడుతోంది.

ఆ మడుగు పక్కనే కత్తి పడుంది.

వెంటనే అనాలోచితంగా తన వేలిముద్రలు దానిపై పడతాయన్న విషయం మరచిపోయి ఆ కత్తిని చేతిలోకి తీసుకున్నాడు మురళీ.

బాగా తాగొచ్చి ఇక్కడి ఇళ్లను అంటించి పారిపోతూ మైకంలో జారిపడి, గూటం గుచ్చుకోవటంతో చచ్చాడనుకుంటారు కానీ రోడ్డుమధ్యలో వున్న రక్తం చూస్తే ఖచ్చితంగా తెలిసిపోతుంది ఇది హత్యేనని.

ఇప్పుడేం చేయాలి?

గబగబా ఆలోచించసాగాడు.

రక్తంపై మన్నుపోసినా తెలిసిపోతుంది.

గుంతలో వున్న నీళ్లని రక్తంపై చల్లితే?

అసలు శవం దగ్గరున్న గుంతలోనే నీళ్లెందుకు నిలిచాయన్న సందేహం వస్తే? పైపు ఎవరు తెచ్చారు? ప్లాన్ ఎవరిచ్చారు? అంటూ ఒక్కొక్కటి లాగుతూ వెళ్లి పోలీసులు తనని ఈ కేసులో ఇరికించేసినా ఆశ్చర్యపోనక్కరలేదు.

"అయ్యో! రాంనారాయణా, ఆవేశంలో ఎంతపని చేశావయ్యా" అనుకున్నాడు.

అప్పుడొచ్చిందా ఆలోచన అతనికి.

వెంటనే చేతిలోని కత్తితో నీళ్లపైపుకు గాటు పెట్టాడు.

కత్తిని శుభ్రంగా కడిగేస్తూ ఫౌంటేన్‌లా ఎగజిమ్మాయి నీళ్లు.

మట్టిలో ఇంకిపోతూవున్న రక్తం నీళ్లతో

కలిసి నెమ్మదిగా గుంతలోకి వెళ్లసాగింది.

రక్తపు ఆనవాళ్లు రోడ్డుమీద కనపడకుండా నీళ్లు పట్టేశాడు మురళీ.

ఇంకేం భయంలేదనిపించింది.

నెమ్మదిగా జీవకోనవైపు కదిలాడు.

అనాలోచితంగానే చేతిలోని కత్తిని జేబులో వేసుకున్నాడు మురళీ.



ఉదయం పది గంటల సమయం.

సూర్యుడు మళ్లీ అవకాశం వస్తుందో లేదో అన్నట్లుగా తన ప్రతాపాన్ని చూపుతున్నాడు.

జీవకోన వీధుల్లో పోలీసుల బూట్లు టకటకలాడాయి.

ఆరోజు చాలామంది కూలికి వెళ్లలేదు.

కాలనీలోవున్న వారందర్నీ గంగరావిచెట్టు కిందకు పిలిపించారు. గంగరావిచెట్టు వూరి మధ్యలోవుంది

ఏ వందో, వందాయాభై సంవత్సరాల క్రితమో పుట్టినట్లుగా చాలా లావుగా వుంది దాని మొదలు.

అందరూ అక్కడ చేరేసరికి ఎస్.ఐ. అల్లాబక్ష్ కోపంతో వూగిపోతున్నాడు.

కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు.

మామూలుగానే ఆ కాలనీవాసులకు పోలీసులంటేనే భయం.

అలాంటిది ఎస్.ఐ కోపంగా వుండడం చూసి ఏం జరగబోతుందోనని బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు.

ఏ దొంగతనం జరిగినా ఏ దోపిడీ జరిగినా పోలీసులు జీవకోన మీద పడతారు. ఎదురు తిరగడనిపించిన వ్యక్తిని పట్టుకెళ్లిపోయి చావబాదుతారు.

చేయని తప్పును చేశానని ఒప్పుకునేలా చేస్తారు. అలాంటి సంఘటనలు అక్కడివారికి మామూలయిపోయాయి.

కానిస్టేబుల్స్ "రేయ్... చేతులు కట్టండ్రా! సార్‌ముందు దర్జాగా నిలుచుని ఫోజులు పెడతారురా" అంటూ అదిలిస్తూ అందరిచేతా చేతులు కట్టించారు.

గంగరావిచెట్టుకింద కూర్చోడానికి వేసిన పెద్ద బండపై కూర్చున్నాడు ఎస్.ఐ.

"తిండికి ఠికానా లేని అలగాజనం, మీరు హత్య చేసే స్థాయికి వచ్చారన్న మాట" అన్నాడు ఎస్.ఐ గంభీరంగా.

చచ్చినవాడు కూడా తిండికి సంపాదించుకోలేక అక్రమ మార్గాలు తొక్కివచ్చి చచ్చాడని ఎస్.ఐకి కూడా తెలుసు. అయినా అక్కడున్న వాళ్లను కించపరుస్తూ అడగడంలో అతనికేదో ఆనందం.

ఎవరూ మాట్లాడ్డంలేదు.

అక్కడున్న వారందరినీ ఒకసారి పరిశీలనగా చూశాడు ఎస్.ఐ.

చూపులతోనే హంతకున్ని పట్టేస్తానన్నట్లుగా వుంది అతనిచూపు.

తమన్నెక్కడ చూపించి హంతకుడంటారోనని ఎవరికి వారు భయపడుతూ ఆందోళన చెందసాగారు.

"రేయ్... చెప్పండ్రా? ఎవరు ఎవరు రాత్రి క్రాంతినగర్‌లో హత్యచేసింది"

"వాడే తాగేసి కన్నుమిన్ను తెలియకుండా గూటం మీద పడి చచ్చిపోయి నాడంటగదా సార్" అన్నాడు జనంలోనుండి ఎవడో.

"ఎవర్రా... ఎవడ్రా అది" అంటూ గబ గబా ముందుకు వచ్చాడు ఎస్.ఐ. ఎవరూ పలకలేదు.

ఒకడుగు వెనక్కి వేసి "అది కట్టుకథ. ఈ అల్లాబక్ష్ ఇట్లాంటి కేసులు ఇన్ని చూశాడు" అంటూ తల మీద వెంట్రుకల్ని చూపించాడు.

"ఇంతకీ ఆ చచ్చినాయన ఎవరు సార్" అన్నారెవరో.

ఆ అడిగిన వ్యక్తిని కూడా గుర్తించలేకపోయాడు ఎస్.ఐ.

చచ్చినవాడు అత్యాచారయత్నం కింద గతంలో అరెస్టయివున్నాడు. ఒక హత్యాకేసులో బెయిల్ పై తిరుగుతున్నాడు. అతని గురించి ఎస్.ఐకి బాగా తెలుసు. అతడ్ని చంపిన వాడ్ని గుర్తించి అరెస్ట్ చేస్తే రాంపాదరెడ్డి ఇచ్చే బహుమతి ఎంతుంటుందో కూడా అతనికి తెలుసు.

"చచ్చినవాడు ఎవరైతే మీకెందుకు. మర్యాదగా హత్య చేసినదెవరో చెప్పండి. లేకపోతే..." అంటూ ఓరగా చూసి లుంగీలు ఎగగట్టుకుని అమాయకంగా నిలుచునివున్న నలుగురు యువకుల్ని చూపిస్తూ,

"ఈ నలుగుర్నీ అనుమానంపై అరెస్టు చేసి చావగొడ్తా" అన్నాడు తన చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ.

ఆ నలుగురు యువకులూ ఒక్కసారిగా భయపడిపోయారు. వారి కళ్లల్లో ఆందోళన కొట్టొచ్చినట్లు కనపడుతోంది.

ఎవరూ నోరు విప్పలేదు.

"ఓకే మీకు తెలియదనుకుందాం. రాత్రి ఎవరైనా కొత్త వ్యక్తి అంటే బయటనుండి వచ్చిన వాళ్లెవరైనా ఇక్కడికి వచ్చారా?" అడిగాడు ఎస్.ఐ.

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"రాలేదు" అన్నారు అందరూ ముక్తకంఠంతో.

అందరూ ఒకేసారి సమాధానం చెప్పడంతో ఎస్.ఐకి అనుమానం వచ్చింది. 'ఇన్వెస్టిగేషన్‌లో తనను మించిన ఎస్.ఐ రాష్ట్రంలోనే లేడు. అని చెప్పుకునే ఆ ఎస్.ఐ వెంటనే ప్రశ్నించడం మొదలుపెట్టాడు.

"గుడిసెలు అంటుకోవడాన్ని ముందుగా చూసిందెవరు?

క్రాంతినగర్ నుండి నీళ్లపైపును తెచ్చి మిగతా ఇళ్లు అంటుకోకుండా నీళ్లు పట్టిందెవరు? ఆ ఆలోచన మీకే వచ్చిందా? ఇంకెవరైనా ఇచ్చారా? మర్యాదగా చెప్పండి" అంటూ జనం ముందు అటూఇటూ ఒకసారి బూట్లను టకటకలాడిస్తూ తిరిగాడు.

అప్పుడు ముందుకు వచ్చాడు గోవిందు.

"సార్ మా పక్కిల్లు అంటుకుని ఆ ఇంట్లో వాళ్లు అరుస్తుంటే నేను లేచి చూశాను సార్. అప్పటికే మూడు గుడిసెల్ని అంటించేసి నాలుగో గుడిసెను అంటిస్తున్నారు సార్ నలుగురు. మావాళ్లు అయిదారుమంది రావడంతో మేమే బండి కూసులెత్తుకుని తరుంకున్నాము. ఆనాయాండ్లు తప్పించుకుని పారిపోయారు. అంటుకున్న ఇండ్లు ఆర్పకపోతే మా ఇండ్లు కూడా కాలిపోతాయని మేమే నీళ్లపైపు వేశాము సార్. ఆ చచ్చినవాడు ఈ ఇండ్లను కాల్చిన వాళ్లలో ఒకడు. వాడు ఎట్లా చచ్చినాడు అని అడుగుతున్నారుగానీ మా ఇండ్లు కాల్చేసి మాకు నిలువనీడ లేకుండా చేసిన ఆ రౌడీలను గురించిగానీ కనీసం వాళ్లు ఎలా వుంటారో కూడా ఎందుకు అడగడం లేదు సార్? " అన్నాడు ధైర్యంగా.

"మా ఇండ్లను కాల్చేసిన వాళ్లను ఎప్పుడు అరెస్టు చేస్తారు సార్? "

ముందుకొచ్చి నిలబడి అడిగాడు వెంకటేశు.

"వాళ్లను అరెస్టు చేయకపోతే రేపు ఆర్.డి.ఓ ఆఫీసువద్ద ధర్నా చేద్దాం" అన్నాడు చిన్నబ్బు.

"అవును చేద్దాం...చేద్దాం" అన్నారు మరి

కొందరు.

ఒకదాని వెంట ఒకటిగా జనం నుండి దూసుకువస్తున్న తూటాల్లాంటి ప్రశ్నలకు ఎస్.ఐ బిత్తరపోయాడు.

వాళ్లు అలా అడగడంలో న్యాయం వుంది.

నిజానికి ఇప్పటివరకూ తమవాడంటూ ఒక్కరు కూడా రాని రౌడీషీటర్ గురించి కాకుండా నాలుగు కుటుంబాలను నిరాశ్రయులను చేసి నలుగురి గాయాలకు కారకులైన వారిని గురించి ఆలోచించాలి తను.

అయితే అది తనకూ, తన ఉద్యోగానికి అంత మంచిదికాదు ఎందుకంటే గుడిసెల్ని అంటించినవాళ్లు తనకు తెలుసు. వాళ్లు రాంపాదరెడ్డి మనుషులు.

తను ఖాకీబట్టలకు గౌరవమిచ్చి డ్యూటీ చేస్తే రాంపాదరెడ్డి మనుషుల్నందర్నీ ఎత్తుకొచ్చి లోనవేసుకుని నాలుగు తగిలిస్తే నిజం బయటపడుతుంది. కాదూ కూడదన్నా రౌడీలను తరుముకున్న ఇక్కడి వాళ్లను పిలుచుకెళ్లినా రౌడీషీటర్స్ లిస్ట్ ముందరపెడితే ఎవరో ఒకర్నైనా గుర్తుపట్టకపోరు. వాడినుండి మిగతా వాళ్లను అరెస్ట్ చేయడానికి ఎక్కువసేపు పట్టదు.

కానీ అలా చేస్తే తనను ఆ రాంపాదరెడ్డి ఏం చేస్తాడో తెలియదు. రాంపాదరెడ్డిది భూకబ్జాలో అందెవేసిన చేయి.

పట్టణంలోని పలు రాజకీయ పార్టీల నాయకులు కూడా భూకబ్జాచేసి అమ్ముకుంటూ వుంటారు. వారందరితోనూ సంబంధాలున్న రాంపాదరెడ్డి చేయలేని పనంటూ ఏమీలేదు. తనను చంపినా చంపచ్చు లేదూ బదిలీ చేయించినా చేయించవచ్చు.

అలా కాకుండా రాంపాదరెడ్డికి అనుకూలంగా పనిచేస్తే అతను తనకు డబ్బు ఇస్తాడు.

ఇవన్నీ ఆలోచించే జీవకోనకు వచ్చాడు.

కాకపోతే ఇక్కడివాళ్లు ఇంతగట్టిగా మాట్లాడగలరని ఇన్నాళ్లూ తెలియలేదు. తను అసలు వూహించలేదు.

నోరు తెరవాలంటే భయపడే వాళ్లకు ఇంత ధైర్యం ఎక్కడిది?

ఇవన్నీ మాట్లాడుతున్నారంటే వాళ్లతో పెట్టుకోవడం అంత మంచిదికాదు.

వీళ్లు ఆర్డీవో ఆఫీసుకు వెళ్లి ధర్నా చేస్తే అది ఇష్యూ అయిపోయి మళ్లీ తనకే చుట్టుకుంటుంది.

కాబట్టి వీళ్లను చూసీచూడనట్లు వదిలేస్తేనే మంచిది అనుకున్నాడు.

“మీరన్నదీ నిజమే. ఆ రౌడీషీటర్‌గాడు తాగేసివచ్చి మీ ఇండ్లు అంటించి పారిపోతూ తాగిన మైకంలో గూటంపై పడి చచ్చాడు. రేయ్ సుబ్రమణ్యం! ప్రాథమిక దర్యాప్తులో దీన్నే రాసుకో” అని కానిస్టేబుల్‌ను ఆదేశించాడు.

“మీరు కోరకపోయినా మిగతా ముగ్గుర్నీ నేను త్వరలోనే పట్టుకుంటాను. నా సత్తా చూపిస్తాను. అయినా మీరు ఒక రోజులోనే ధర్నాకు పోతామని ఎట్టా అంటారయ్యా? ఏ కేసులో దోషిని పట్టుకోవాలన్నా రెండు మూడు రోజులు పడుతుంది” అంటూ వాళ్లు మాట్లాడింది ఎంత తప్పో అన్నట్లుగా నిష్ఠూరపోయాడు ఎస్.ఐ.

“ఎప్పుడు ధర్నా చేయాల్నో మాకు తెలుసులే నువ్వేం చెప్పక్కరలేదు” అన్నాడొకతను ముందుకువచ్చి.

మామూలుగా పోలీసులంటే భయపడి చచ్చే అతనికి కూడా అక్కడి వాతావరణం ఎందుకో ధైర్యాన్నిచ్చింది.

తనను తేలిక చేసి మాట్లాడిన వ్యక్తిని పట్టించుకోకుండా “డెడ్‌బాడీని పోస్ట్‌మార్టమ్ కోసం మెడికల్ కాలేజీకి పంపించాలి పదండి. పదండి” అంటూ కానిస్టేబుళ్లను అదిలిస్తూ అక్కడినుండి వెళ్లిపోయాడు ఎస్.ఐ.

“మెత్తగా వుంటే అందరూ నెత్తిన మొత్తే వాళ్లే” అన్నాడొకతను వెళ్లిపోతున్న పోలీసు

లను చూస్తూ.

"ఎంతైనా మురళీ సార్ పుణ్యమా అని మొదటిసారి ఈ పోలీసోళ్ల చేతిలో నుండి బయటపడ్డాం. ఇంతవరకు ఎప్పుడూ లేనివిధంగా పోలీసులనే తరిమివేయగలిగాం" అన్నాడొక ముసలాయన ఏదో విజయం సాధించినట్లుగా.

"మురళీసార్ ఏం చేసినా ఏంచెప్పినా అట్లే వుంటాది"అన్నాడొక యువకుడు తనకు మురళీ గురించి బాగా తెలుసన్నట్లుగా.

పోలీసులు వెళ్లిపోయారని తెలియగానే హాయిగా వూపిరిపీల్చుకున్నాడు రాంనారాయణ.

పోలీసులు జీవకోనకు వచ్చారని తెలిసినప్పటినుండి తన ప్రాణం మీదికొచ్చినట్లు భయపడిపోయాడు అతను.

రాత్రి జరిగిన సంఘటనతో జ్వరం వచ్చేసింది అతనికి. ఉదయం నుండి మంచం దిగకుండా పడివున్నాడు.

తను హత్యచేసి నిలువురాయిలా నిలబడిపోయినప్పుడు మురళీ సార్ రావడం అంతటి ఆపదలో కూడా తనని తిట్టకుండా నీళ్ళపైపు చేతికిచ్చి "వెంటనే పరుగెత్తు" అంటూ పంపించివేయడం వరకే తనకు తెలుసు. ఆ తరువాత అక్కడ మురళీ సార్ ఏం చేశాడో తెలియదు.

అతని ఆలోచనలు వెనక్కివెళ్లాయి.

నీళ్ళపైపు చేతబట్టుకుని జీవకోనకు పరుగెత్తుకొచ్చాడు. మురళీ సార్ చెప్పినట్లుగా మండుతున్న ఇళ్ళపైకి గాకుండా వాటిపక్కనున్న ఇళ్ళ కప్పులన్నీ తడిపి, తరువాత కాలుతున్న ఇళ్ళను ఆర్పడానికి ప్రయత్నించాడు.

నీళ్ళు పడుతున్నాడన్న మాటే కానీ వళ్ళంతా గడగడా వణికిపోతోంది. అతని ఆలోచనలన్నీ శవం చుట్టూనే పరిభ్రమిస్తున్నాయి.

తాను ఒక మనిషిని చంపేశాడన్న విషయాన్ని అతను జీర్ణించుకోలేకపోతున్నాడు. పరధ్యానంగా నీళ్లు పడుతున్న రాంనారాయణ చేతిలోని పైపును తీసుకుని మంటపైకి తిప్పాడు వెంకటేశు.

తాను చేసిన దారుణం గురించి ఎవరికో ఒకరికి చెప్పేయాలనిపిస్తోంది రాంనారాయణకు.

ఆ విషయం గుండెలు పగలగొట్టుకుని బయటకు వచ్చేటట్లు అనిపించడంతో ఇక ఆగలేక వెంకటేశుకు చెప్పేశాడు.

ఒక్కక్షణం వెంకటేశు ఆ విషయాన్ని నమ్మలేకపోయాడు.

కానీ రాంనారాయణ మళ్ళీ చెప్పడంతో నమ్మక తప్పలేదు.

అప్పుడే అక్కడకు వచ్చిన గోవిందు కూడా ఆ విషయాన్ని విన్నాడు. అప్పటికి జనం అందరూ ఇళ్లలోని నీళ్ళు తెచ్చి మంటలపై కుమ్మరిస్తున్నారు. మంటలు బాగా తగ్గుముఖం పట్టాయి. నీళ్ళపైపు వేరే వ్యక్తి చేతికిచ్చి ముందుకు కదిలాడు వెంకటేశు. క్షణాల్లో రాత్రి కాపలాకాసిన వారందరికీ విషయం తెలిసిపోయింది.

అందరూ ఒకచోట గుమికూడారు.

"ఇప్పుడేం చేద్దాం?"

"ఈ విషయం ఎవరికీ చెప్పకూడదు"

"చెప్పకపోయినా తెల్లారేసరికి ఒక్కడు చచ్చాడు అని అందరికీ తెలుస్తుంది కదా"

"చచ్చాడన్న విషయం తెలిస్తే ఫరవా లేదు. మన రాంనారాయణ చంపాడని తెలిస్తేనే సమస్య"

"మన ఇండ్లను అంటించేసి పారిపోతూ వుంటే రాంనారాయణ చంపేశాడు. అట్లానే చెబుదాం పోలీసులకు"

"పొరబాటున చేసినా, కావాలని చేసినా తప్పుతప్పేనని లోపలేస్తారు"

"మన ఇండ్లను అంటించిన వాళ్ళు దొరుకుంటే ఆ ఆవేశంలో మనం కూడా చంపేసుంటాం. కాబట్టి వీణ్ని చంపిందెవరు అంటే అందరం చేశామని చెప్పుదాం" తలా

ఒక అభిప్రాయం చెబుతున్నారు.

"అందరూ రాంనారాయణ ఇంటికి నడవండి. ఇలాంటివన్నీ ఇక్కడ మాట్లాడుకోకూడదు" అన్నాడు మురళీ అక్కడకు ఎప్పుడొచ్చాడోగానీ! హత్యచేశానని రాంనారాయణ ఎవరికీ చెప్పకుండా ఉంటే అక్కడున్నవారందరికీ కొన్ని సూచనలిచ్చి ఈ హత్య ఎవరిమీదకూ రాకుండా చూద్దామనుకున్నాడు తను. అయితే రాంనారాయణ టెన్షన్ తట్టుకోలేక చెప్పేశాడు.

గుడ్డిలోమెల్ల అన్నట్లుగా రాత్రి తనతోపాటు మేల్కొనివున్న వాళ్ళకు మాత్రమే చెప్పాడు. తను రావడం ఇంకొంత ఆలస్యం అయ్యుంటే విషయం వూరంతా తెలిసుండేది. అప్పుడు రాంనారాయణని కాపాడ్డం ఎవరి తరమూ అయ్యుండేది కాదు.

రాత్రంతా పహారా కాసిన వాళ్ళందరూ రాంనారాయణ ఇంట్లో సమావేశమయ్యారు. 'ఏంచేయాలి? ఎలా చేయాలి' అంటూ చర్చలు నడిచాయి. అందరూ ఒక నిర్ణయానికి వచ్చారు.

వెంటనే వూర్లోని అందర్నీ అక్కడికి పిలిపించారు.

నెలవంక పడమటివైపుకు జారిపోతోంది.

చలిగాలి ప్రారంభమైంది.

అందరూ ఏం చెబుతారా అని ఆసక్తిగా చూస్తున్నారు.

గోవిందు లేచి "ఇప్పుడు జరిగిన ప్రమాదం నాలుగిండ్లకే పరిమితమైందంటే అది మురళీ సార్ పుణ్యమే" అన్నాడు.

అందరూ మురళీకేసి చూశారు.

ఆ సమయంలో మురళీ సార్ అక్కడికి ఎలా వచ్చాడో చాలా మందికి అర్థం కాలేదు.

"ఆ సార్ ముందుగానే ఆ రాంపాదరెడ్డి మనుషులు వస్తారని పసిగట్టి వచ్చి మాకు చెప్పడంవలన ప్రమాదాన్ని కొంతలో కొంత తగ్గించుకోగలిగాం. ఆ రౌడీలను తరిమివేయగలిగాం"

అందరూ నిశ్శబ్దంగా వింటున్నారు.

"అయితే మన జీవకోనకు చెందిన, మన వ్యక్తొకరు ఆ రౌడీలలో ఒకన్ని చంపేశాడు"

అందరూ వులిక్కిపడ్డారు ఆ మాటలు విని.

"మన కడుపులు కొట్టబోయిన వారిని మనమైతే వూరికే వదులుతామా? మనల్ని వీధులపాలు చేయాలని చూసిన వాడు కనబడితే నేనైనా చంపేస్తాను. మీరైనా అదే పని చేస్తారు. అవునా? కాదా?"

"అవును... అవును" జనంలో కొంత మంది అరిచారు.

"మనం చేయాలనుకున్న పనిని మనలో ఒకడు చేశాడు. అతడు చేసింది న్యాయమే అయినా పోలీసులకు చెడ్డపనే!"

అందరి కళ్ళలో భయం కనిపించింది.

"మనవాడ్ని రక్షించుకోవాల్సిన బాధ్యత మనందరిదీ. అందుకు ఒకటే మార్గం వుంది" అంటూ ఒక్క నిమిషం చెప్పడం ఆపాడు.

అందరూ ఉత్కంఠగా అది ఏమై వుంటుందో వూహించే ప్రయత్నం చేశారు.

గోవిందు చెప్పాడు "మురళీ సార్ ఏం చెబితే అది చేయడమే"

అందరికి ఆ మాట వినగానే ధైర్యం వచ్చింది. ఈ సమస్యకు ఖచ్చితంగా మురళీ సార్ పరిష్కారం చూపించగలడని నమ్మకం కలిగింది.

"ఇప్పుడు మురళీ సార్ మాట్లాడతారు" అంటూ పక్కకి జరిగి నిలుచున్నాడు గోవిందు.

మురళీ లేచాడు.

నెమ్మదిగా చెప్పడం ప్రారంభించాడు.

"పోలీసులను గురించి, వాళ్ళు ఏయే ప్రశ్నలు అడుగుతారు, వాటికి జవాబులు ఎలా చెప్పాలి, మొదలుకొని అనేక విషయాలు చెప్పాడు.

"ఆ సార్ ఎంత బాగా చెప్పాడు. అచ్చం

అలాగే జరిగింది" అనుకుంటూ ఈ లోకం లోకి వచ్చాడు రాంనారాయణ.

మురళీ సార్ లేకుంటే జీవకోన ఏమయ్యుండేదో తనగతి ఏమయ్యుండేదోనన్న వూహ రావడంతో రాంనారాయణ వళ్ళు జలదరించింది. అంతలోనే సందేహం వచ్చింది.

మురళీ సార్ తనను ముందుగానే నీళ్ళ పైపులు ఎక్కడ దొరుకుతాయని విచారించాడు కదా. అంటే ఇక్కడి గుడిసెల్ని ఆ రాంపాదరెడ్డి మనుషులు అంటిస్తారని ఖచ్చితంగా ముందే తెలుసు. ముందుగా తెలియదనుకున్నా ఆ రౌడీనాయాండ్లు ఇండ్లు అంటించకముందే అడ్డుకునే అవకాశమున్నా ఎందుకు ఆపలేదు?

ఇంటిని అంటిస్తుంటే వెళ్ళి ఆపకుండా తనను నీళ్ళపైపుకు ఎందుకు పంపించాడు?

ఒకవేళ... ఇందులో మురళీ సార్‌కేమైనా...?

అంతలోనే తనకలాంటి సందేహం వచ్చినందుకు చెంపలేసుకున్నాడు. తనను జైలుకు పోకుండా కాపాడిన దేవుడినే అనుమానించడమా? అది ఎన్నటికీ జరగదు.

అందుకే ఆ అనుమానాన్ని మరెవరికీ చెప్పకుండా తనలోనే దాచేసుకున్నాడు.

★ ★ ★

"మురళీ... టైం పదకొండవుతోంది. ఏమిటా మొద్దు నిద్ర లే" అంటూ నిద్ర లేపాడు ఆర్ముగం.

కనులు బరువుగా మూతలు పడుతున్నాయి. అయినా బలవంతంగా తెరిచాడు మురళీ.

ఉదయం పదిగంటలకే ప్రెస్‌క్లబ్‌లో సందడి ప్రారంభమవుతుంది.

ఏదైనా ప్రోగ్రామ్ వుంటే రిపోర్టర్లందరూ బయటకు వెళ్ళిపోతారు. లేదూ అంటే ప్రెస్ క్లబ్‌లోనే క్యారమ్స్ ఆగడమో, టీ.వీ. చూడడమో చేస్తూ నిద్రపోయే వాళ్ళను నిద్రపోనివ్వకుండా అరుస్తూ వుంటారు. నైట్ డ్యూటీలు చేసే రిపోర్టర్లు ఏ రెండుకో, మూడుకో వస్తారు. ఆ టైంలో ఇంటికి వెళ్ళలేక ప్రెస్‌క్లబ్‌కు వచ్చి పడుకుంటారు. అలాంటి వాళ్లు ఉదయం పదిగంటలపైన కూడా లేవడానికి ఇబ్బంది పడుతూంటారు.

రాత్రి జీవకోననుండి ప్రెస్‌క్లబ్‌కు వచ్చేసరికి ఐదయ్యింది.

రాత్రంతా నిద్రలేకపోవడం వలన కనులు మంటలు పెడుతున్నాయి.

ఆర్ముగం మీదున్న గౌరవంతో "ఏంటండి ఆర్ముగంగారూ మమ్మల్ని కొంతసేపు ప్రశాంతంగా నిద్రపోనివ్వచ్చు కదా" అన్నాడు.

"ఏం లేదు మురళీ పి.ఆర్.వో ఫోన్ చేశాడు. నీటిపారుదల శాఖామంత్రి జీవకోనకు వెళ్తున్నాడట. ఆయన వెనుక ఆర్.డి.వో., ఎం.ఆర్.వో, కమీషనర్ వాళ్ళందరూ వెళుతున్నారని చెప్పాడు. మనకోసం వెహికల్ పంపిస్తామన్నారు. లేచి మొహం కడుక్కునిరా పోదాం" అన్నాడు ఆర్ముగం.

ఇక తప్పదని లేచాడు.

"ఓట్లు అడుక్కోవడానికి వెళుతూ ప్రభుత్వ అధికారులను వెంటబెట్టుకుని వెళ్ళడమూ, ప్రభుత్వ వాహనం పెట్టి ప్రెస్‌ను పిలిపించడమూనా? దీన్ని వార్తగా రాయాల్సిందే" అన్నాడు మురళీ కోపం నటిస్తూ.

"నువ్వెప్పుడూ అంతే. ఎవడేం తప్పుచేస్తాడా అని కాసుక్కూర్చుంటావ్. నువ్వనుకున్నట్లుగా ఓట్లు అడుక్కోవడానికి కాదు మినిస్టర్ పోతోంది" అన్నాడు ఆర్ముగం.

"మరి? " అన్నాడు మురళీ ఆసక్తిని ప్రదర్శిస్తూ.

"జీవకోనలో రాత్రి అగ్నిప్రమాదం జరిగింది. ఇండ్లు కాలిపోయి నిరాశ్రయులైన వారికి బియ్యం పంచడానికి పోతున్నారు. ఎంతైనా పబ్లిసిటీ కార్యక్రమం కదా. మంత్రి ఉత్సాహంగా వెళుతున్నట్లున్నాడు" అన్నాడు ఆర్ముగం.

"అరరె... అగ్నిప్రమాదం జరిగిందా?

ఎంతమంది చనిపోయారు? " అడిగాడు మురళీ ఆత్రంగా.

ఏ యాక్సిడెంట్ జరిగినా, ఏ ప్రమాదం జరిగినా రిపోర్టర్ ముందుగా అడిగేది "ఎంతమంది చచ్చారు ఎంతమందికి సీరియస్" అనే. అలా అడగాల్సిరావడం దురదృష్టం. అయినా అది వారి విధి.

"ఎవరూ చనిపోలేదు. కొంతమందికి గాయాలయ్యాయంట. వివరాలన్నీ అక్కడికి పోతే తెలుస్తాయి. వెహికల్ వచ్చే టైం అయ్యింది. నువ్వెళ్ళి తొందరగా మొహం కడుక్కునిరా" అన్నాడు ఆర్ముగం తొందరపెడుతూ.

మురళీ మొహం కడుక్కుని వచ్చేసరికి వెహికల్ వచ్చి ప్రెస్‌క్లబ్ ముందు ఆగింది.

రాత్రంతా మేల్కొని వుండడంవలన విపరీతమైన ఆకలిగా వుంది. మొహమంతా పీక్కుపోయి వుంది.

అద్దంముందు నిలబడి చకచకా తల దువ్వుకుని ఇక ఈ పూట ఉపవాసమే అనుకుంటూ వెహికల్ దగ్గరకు వెళ్ళాడు.

రిపోర్టర్‌లు పస్తులుండడం అలవాటు చేసుకోవాలి. అది సరిపోయేంత జీతం రాకపోవడం వలనా కావచ్చు, సమయం కుదరకపోవడం వలనా కావచ్చు.

మురళీ వెహికల్ దగ్గరకు వెళ్ళేసరికి అది రిపోర్టర్‌లు, ఫొటోగ్రాఫర్లతో నిండిపోయి వుంది. ఆర్ముగంను జరగమని చెప్పి ఇరుక్కుని కూర్చున్నాడు.

జీపు కదిలింది.

"ఇప్పటివరకు అనుకున్నవి అనుకున్నట్లుగా జరిగాయి. ఇప్పుడు తన పథకంలోని ఆఖరు ఘట్టాన్ని పూర్తిచేయాలి" అనుకున్నాడు మురళీ. జీవకోనలోకి వెహికల్స్ వెళ్ళలేకపోవడంతో క్రాంతినగర్‌లోనే దిగాల్సి వచ్చింది.

అందరూ అక్కడినుండి నడుచుకుంటూ వెళుతున్నారు.

దారిలో రాత్రి చచ్చినవ్యక్తి శవం కనిపిస్తుందేమో అనుకున్నాడు. కానీ కనిపించలేదు. బహుశా పోస్ట్‌మార్టమ్‌కు పంపించారేమో అనుకున్నాడు.

"విలేకరులు వెళ్ళేసరికి ఎం.ఆర్.ఓ., ఆర్.డి.వో, మునిసిపల్ కమీషనర్, రూరల్ సి.ఐ, పట్టణ సి.ఐ. వారి వెంట వుండే అధికారగణం అక్కడ చేరిపోయివున్నారు.

మినిస్టర్ కొంత ఆలస్యంగా వచ్చాడు.

అతనికి అందరూ లేచి నమస్కరించారు.

ఎక్కడినుండి తెప్పించారోగానీ కుర్చీలు తెచ్చి వేశారు.

మినిస్టర్ కుర్చీలో కూర్చోకుండా నిలబడే అడుగుతున్నాడు.

"ఎవరిండ్లు కాలిపోయింది? "

ఎం.ఆర్.ఓ. చూపించాడు.

"ఎట్లా జరిగింది? అయ్యో...పాపం" అంటూ పరామర్శించాడు.

"మీరేం బాధపడకండి. రేయింబవళ్ళు కష్టపడే మన ముఖ్యమంత్రి అధికారంలో వున్నంతకాలం మీకు ఏ ఇబ్బందీ వుండదు. మీకిప్పుడు ఒక్కక్క కుటుంబానికి పది కేజీల బియ్యం, అయిదు వందల రూపాయల ఆర్థికసహాయం అందజేస్తాం" అంటూ గొప్పగా చెప్పాడు, అదేదో పెద్ద మొత్తం అయిపోయినట్లు.

వాళ్ళు ఏమీ మాట్లాడలేదు.

అంతలో అటెండర్లు బియ్యం మూటల్ని మోసుకొచ్చి మినిస్టర్ ముందు పెట్టారు. ఆర్.డి.వో దగ్గరుండి మూటను విప్పి, పది కేజీలు చొప్పున కొలిచి మంత్రికేసి చూశాడు.

మంత్రి ఆ బియ్యాన్ని ఇచ్చేందుకు సిద్ధపడ్డాడు.

అయితే ఆశ్చర్యంగా ఒకరు కూడా ముందుకురాలేదు, ఆ బియ్యాన్ని తీసుకోవడానికి.

"రండి... రండి. మంత్రిగారు బియ్యం ఇస్తుంటే తీసుకోరేంటి" అన్నాడు కమీషనర్ అదేదో పెద్ద వరమైనట్లు.

ఎవరూ ముందుకురాలేదు.

ఎం.ఆర్.ఓ. వాళ్ళను ఒక నెట్టు నెట్టాడు మంత్రిముందుకు.

వాళ్ళు ఒకడుగు ముందుకైతే వేశారు బియ్యం తీసుకోలేదు.

"ఈనాకొడుకులకు పొగరెక్కింది" అని గొణుక్కుంటూ "రేయ్ తీసుకోండ్రా" అంటూ గట్టిగా అరిచాడు ఎం.ఆర్.ఓ

మంత్రి ఫీలయితే తమకు అంతకంటే అవమానమేముంటుంది అన్నట్లుంది అధికారుల ప్రవర్తన.

వాళ్ళు ఎవరి మాటల్నీ పట్టించుకోలేదు.

అక్కడ పిన్‌డ్రాప్ సైలెన్స్ ఏర్పడింది.

ఈరోజు తమకేదో మంచి వార్త దొరకనుందని విలేకరులకు అర్థమైపోయింది. అందరూ ఆసక్తిగా చూడసాగారు.

అది ఇబ్బందికరమైన పరిస్థితిలా అనిపించింది మంత్రికి.

పెదాలపై చిరునవ్వును పులుముకుంటూ "రండి...రండి... తీసుకోండి" అన్నాడు సందేహిస్తూనే.

"వద్దు" అన్నారు అందరూ ఒకేసారి.

అప్పటికే మురళీ వెళ్ళి టీ.వీ. సిటీకేబుల్ కెమేరామెన్‌ల చెవిలో ఏదో వూదేశాడు.

వాళ్ళు రెండడుగులు ముందుకువేసి ఆ సన్నివేశాన్ని రికార్డు చేయసాగారు.

వీడియో, కెమేరాలు పనిచేస్తుండడం చూసి మంత్రికి కంగారెక్కువైంది. అతనికి అక్కడివాళ్ళ మనసులో ఏముందో అర్థంకావడంలేదు.

"ఏం! బియ్యం తక్కువగా ఇస్తున్నామని వద్దంటున్నారా? ఆర్.డి.వో.గారూ ఇంకో బస్తా తీసుకురమ్మని చెప్పండి" అన్నాడు మంత్రి, అంతటితో సమస్య తీరిపోయినట్లుగా ఫీలవుతూ.

"అసలు బియ్యమే మాకొద్దు" అన్నారు వాళ్ళు గట్టిగా.

అక్కడున్న అందరితోపాటూ మంత్రి కూడా షాక్ తిన్నాడు. ఆ మాటలకు విపరీతమైన కోపం ముంచుకువచ్చింది. బూతులు నోటిదాకా వచ్చాయి. కెమేరా కన్నులు తెరిచి వుండడం, ప్రెస్‌వాళ్ళు అక్కడే వుండడంతో బలవంతంగా మాటలు మింగేశాడు.

"డబ్బులు ఇంకా ఎక్కువ ఇమ్మంటారా? "

అడిగాడు మునిసిపల్ కమీషనర్ ముందుకువస్తూ.

"వద్దు" అన్నారు వాళ్ళు మళ్ళీ

రిపోర్టర్లందరికీ తెగ ఉత్సాహాన్నిస్తోంది ఆ సన్నివేశం. దీన్ని ఎలా రాస్తే బాగా క్లిక్ అవుతుందోనని అప్పుడే ఆలోచించసాగారు. మంత్రికి అయోమయంగా వుంది పరిస్థితి.

"అన్నిటికీ వద్దువద్దు అంటే ఎట్లా. ఏం కావాలో అదైనా చెప్పండి" అన్నాడు మంత్రి. కోపాన్ని గొంతులోనే అదిమిపెట్టినట్లు తెలుస్తూనే వుంది.

అతని భయం అతనిది. అసలే ఎన్నికల సమయం. ఇప్పుడు ఇక్కడ పరువుపోతే అపోజిషన్‌వాళ్ళు దీన్ని నాలుగింతలుచేసి పబ్లిసిటీ చేస్తారు. ఓట్లకు ఓట్లుపోగా, ముఖ్యమంత్రి దగ్గర అక్షింతలు చల్లించుకోవాల్సివస్తుంది.

"మేమడిగింది ఇస్తారా? " అన్నారు వాళ్ళు ధైర్యంగా.

వాళ్ళు ఏం అడుగుతారో, ఎక్కడ తనని ఇబ్బందిలో పడేస్తారోనని సంకోచిస్తూనే "ఏం కావాల్నో అడగండి" అనేశాడు మంత్రి.

"మాకు కాలనీ ఇండ్లు కట్టించివ్వండి" అన్నాడు వెంకటేశు ముందుకు వస్తూ.

ఒక్కక్షణం ఏం చేయాలో తోచలేదు మంత్రికి.

ఏం చేద్దామన్నట్లుగా పి.ఎ వైపు చూశాడు.

అతను వంగి "ఎన్నికల సమయం సార్. మనం ఎన్ని హామీలు ఇవ్వడం లేదూ. ఇప్పుడు ఇచ్చేయండి సార్. శాశ్వత గృహనిర్మాణాలంటే ఒకరోజుతో పూర్తయ్యేవి

కావు. కాబట్టి తర్వాత ఈ మన హామీని గాలికొదిలేస్తే సరిపోతుంది" అన్నాడు గుసగుసగా.

మంత్రి మొహం కళకళలాడింది ఆ సలహా వినగానే.

ఒకసారి రిపోర్టర్లకేసి గర్వంగా చూసి "జీవకోన వాసులకు శాశ్వత గృహనిర్మాణ పథకం కింద నా కోటాలో వందిండ్లు మంజూరు చేస్తున్నాను" అని ప్రకటించాడు.

అధికారులంతా చప్పట్లు కొట్టారు.

"ఎన్నికల సమయంలో మంజూరు చేస్తే ఎలక్షన్ కమీషన్ ఒప్పుకోదనుకుంటాను సార్" అన్నాడు మురళీ.

"అత్యవసర పరిస్థితులలో సహాయం చేయవచ్చు" అన్నాడు మంత్రి.

"అయినా మీ ప్రకటన ఆచరణ సాధ్యం కాదు సార్" అన్నాడు మురళీ.

"ఎందుకని? "

"ఎందుకంటే మంగళం టౌన్‌షిప్ మంజూరయి ఏడాది కావస్తున్నా ఇంతవరకూ నిర్మాణం ప్రారంభం కాలేదు"

"మంగళంలో భూవివాదం వుండడం వలన అది పెండింగ్ పడుతోంది. జీవకోనలో పరిస్థితి అలా వుండదు. మంగళం టౌన్‌షిప్‌కంటే ముందుగా కట్టించేస్తాం" అన్నాడు మంత్రి సమర్ధవంతంగా జవాబిచ్చానని ఫీలవుతూ.

"ఇక్కడున్న వాళ్లందరూ ఐదారేళ్ళకుపైగా ఇక్కడే నివశిస్తున్నా, ఇంతవరకూ వాళ్ళకు పట్టాలే ఇవ్వలేదు. అలాంటిది మీరు ఏకంగా ఇండ్లు కట్టించేస్తామంటున్నారంటే" అంటూ అర్ధాంతరంగా ఆపేశాడు మురళీ.

విలేకరులందరూ ఆసక్తిగా నోట్ చేసుకుంటున్నారు.

మంత్రి ఏం చెబుతాడా అని ఆసక్తిగా చూడసాగారు.

వీడియో, కెమేరాలు నాన్‌స్టాప్‌గా పనిచేస్తున్నాయి.

మురళీ సంధించిన ప్రశ్నకు మంత్రిదగ్గర సమాధానం లేదు.

కానీ ఎక్కడా యిరుక్కోకుండా బయటపడడమే రాజకీయనాయకుల లక్షణం. ప్రతి రాజకీయనాయకుడూ ఎప్పుడో ఒకప్పుడు విలేకరుల దగ్గర ఇరుక్కుని ఇబ్బందిపడే వుంటారు.

ఇప్పుడు తాను సమస్యను ఎవరో ఒకరి మీదికి నెట్టేసి బయటపడకుంటే 'మంత్రిగారి మాటలు గాలి మూటలు' అనో, 'గాల్లో మేడలు కట్టిస్తానన్న మంత్రి' అనో రేపు పేపర్లో వచ్చేస్తుంది అని ఆలోచించి,

"ఏమండీ ఆర్. డి. వోగారూ నిజమేనా! వీళ్ళు ఐదేళ్ళుగా ఇక్కడ వుంటున్నా పట్టాలివ్వలేదంట. మీరంతా ఏమి చేస్తున్నట్లు" అంటూ హుంకరించాడు.

వున్నట్లుండి తను బలిపశువు కావడంతో ఆర్. డి. వో బిత్తరపోయాడు.

అతనికి నోట మాటరాలేదు.

"సార్... అది కాదు సార్.." అంటూ తడబడుతూ ఏదో చెప్పబోయాడు.

అతన్ని చెప్పనిస్తే తనెక్కడ ఇరుక్కోవలసి వస్తుందోనని "అవన్నీ నాకు తెలియదు. మీరు వెంటనే సర్వే చేయించి వారంలోపు పట్టాలు ఇవ్వండి. వెంటనే ఇళ్ళ నిర్మాణం ప్రారంభం కావాలి" అన్నాడు మంత్రి.

"సర్వేయర్, సూపరిరంటెండెంట్, మిగతా అధికారులూ అందరూ ఇక్కడే వున్నారు కదా సార్. ఎటూ వచ్చేశారు కాబట్టి ఇప్పుడే మీ చేతులమీదుగానే సర్వే ప్రారంభిస్తే బావుంటుందనుకుంటా, ఏమంటారు సార్? " అన్నాడు మురళీ అందరికీ వినిపించేటట్లుగా.

"అడకత్తెరలో ఇరికించేసి ఏమంటారు సార్ అంటే ఏమంటాను. నా పిండాకూడు" అని తిట్టుకున్నా "మీ చేతులమీదుగా" అన్న పదాలు ఎందుకో బాగా వున్నట్లనిపించింది మంత్రికి.

వెంటనే ఆర్.డి.వో.కి సైగ చేశాడు.

అధికారగణం కదిలింది.

సర్వే ప్రారంభమైంది.

"యాహూ" అని ఆనందంతో అరవాలనిపించింది మురళీకి.

తను అనుకున్నది సాధించాడు.

మంత్రి చెప్పినట్లు శాశ్వత గృహనిర్మాణ పథకం కింద ఇండ్లు ఇప్పటికిప్పుడు నిర్మాణమవుతాయన్న నమ్మకం తనకు లేదు. అసలు ఎన్నికల సమయం. ఎన్నికల ముందు ఇలాంటి ఇళ్ళు కట్టించే కార్యక్రమాలను చేపట్టడాన్ని, మంత్రి ఎన్ని చెప్పినా ఎలక్షన్ కమీషన్ ఒప్పుకోదు. ప్రభుత్వం వీళ్ళకు ఇళ్ళు కట్టివ్వకపోయినా ఫరవాలేదు. వాళ్ళ స్థలాల్ని వేరెవరూ ఆక్రమించుకోకుండా పట్టాలిస్తే అదే పదివేలు. ఇప్పుడు సర్వే పూర్తయితే నాలుగైదురోజుల్లో ఎవరి పట్టాలు వాళ్ళకు చేరుతాయి. వాళ్ళు ఇవ్వడం ఆలస్యం చేసినా నాలుగు ధర్నాలు చేయించడమో ఎన్నికల సీజన్ కాబట్టి ఏ మంత్రి కారుకో జనాన్ని అడ్డుపడమని చెబితేనో పనైపోతుంది. ఆ తరువాత జీవకోనలోని స్థలాల్ని ఆక్రమించుకోగలగడం ఎవరి తరమూ కాదు.

తను పథకం వేసినప్పుడు ఎంత భయపడ్డాడు.

తెలిసితెలిసీ నాలుగిళ్ళను అగ్నికి ఆహుతి చేయాలంటే ఎలా అని బాధపడ్డాడు. కొన్ని వదులుకుంటే తప్ప కొన్ని లభించవు. కనీసం నాలుగిళ్ళయినా కాలకపోతే ఈ ఆర్.డి.వోలు, ఎం.ఎల్.ఏలు, మంత్రులు కదిలిరారు. వాళ్ళు కదిలిరానంత కాలం వీరి జీవితాలకు శాశ్వత పరిష్కారం లేదు.

ఈ ప్రమాదం గురించి తను విన్నాడు కాబట్టి ఇప్పుడు రక్షించి వుండవచ్చు కానీ మరోసారి ప్లాన్ చేసినప్పుడు తనకు తెలియకపోవచ్చు. అప్పుడెవరు రక్షిస్తారు. అందుకే రాంనారాయణ ఎంత గింజుకున్నా వదల్లేదు. పైగా వాళ్ళు ఇంటిని అంటించడం మొదలుపెట్టగానే నీళ్ళపైపును తెమ్మని పంపించివేశాడు.

ముందే చెబితే రాంనారాయణే కాదు. ఎవరూ దీన్ని అర్థంచేసుకోలేరు. అందుకే ఎవరికీ చెప్పకుండా పథకం ప్రకారం ఒక్కొక్క అంశాన్ని అమలుచేస్తూ సాహసం చేయాలని నిశ్చయించుకున్నాడు. అదృష్టవశాత్తు ఆ కష్టం, సాహసం వూరికే పోలేదు. ఛీఫ్‌రిపోర్టర్ పదవి లభించినపుడు కలిగే ఆనందంకంటే ఎక్కువ ఆనందం కలిగింది మురళీకి.

★ ★ ★

పక్షుల కువకువలు ఉదయానికి స్వాగతం పలుకుతున్నాయి.

గంగావతి గబగబా నడుస్తోంది.

ఆమె ఆలోచనలు భగభగా మండుతున్నాయి.

జీవితంలో ఇలాంటి రోజొకటి వస్తుందని ఆమె కలలో కూడా వూహించలేదు.

ఎంత సుళువుగా చెప్పాడు.

"ఇక్కడ అలాంటివన్నీ మామూలే. అలాంటి విషయాలను గురించి నాకు చెప్పొద్దు. నేనూ నిన్ను అడగను. పది నిమిషాలు ఈ వళ్ళు నీది కాదనుకో చాలు"

ఆ చెప్పింది సాక్షాత్తూ తన భర్త!

అయినా భర్తే చెప్పగా లేనిది తనకెందుకు ఈ మానాభిమానం? ఓ రకంగా ఆయన చెప్పిందీ నిజమే కదా!

"కూలోళ్లు కూడుకోసం కూలికెళ్లాలి, కూలి చేస్తూనే బతకాలి. కూలి చేస్తూనే చావాలి"

తమకు కూడే బతుకు. కూలే బతుకు.

ఆ కూలికోసం ఏమైనా చేయవచ్చు కాదు, చేసి తీరాలి.

ఈ రోజునుండి తను మారాలి.

బతకడం కోసమైనా మారాలి.

అందరిలాగే తనూ నడచుకోవాలి.

తన భర్త చెప్పినందుకైనా నడచుకోవాలి.

"కూలిదాన్ని... కూలిదానిలాగే నడచుకుంటాను" మళ్ళీమళ్ళీ అదే మాటను గొణు

క్కొంటోంది గంగావతి.

ఆ రోజు అందరికంటే ముందుగా నాలు గుకాళ్ళ మండపం చేరింది. నెమ్మదిగా అక్కడ చేరుతున్న వారి సంఖ్య పెరుగు తోంది.

మొదటి ట్రాక్టరు వచ్చింది.

రాజారెడ్డి దిగాడు.

ముందుగా మగవాళ్ళను ఎంపిక చేశాడు.

వాళ్ళందరూ వెళ్ళి ట్రాలీలో కూర్చు న్నారు.

ఆడవాళ్ళవైపు వచ్చాడు.

ఎలాగైనా ఈరోజు కూలికి వెళ్ళాలను కున్న గంగావతికి రాజారెడ్డి తన దగ్గరికి వస్తున్నకొద్దీ భయం, ఆదుర్దా కలగసా గాయి.

గుండె కొట్టుకోవడంలో వచ్చిన మార్పు పైకే తెలుస్తోంది.

పక్కనున్న ఆడమనిషితో ఏదో మాట్లాడు తున్నాడు. ఆమెని పిలవగానే తనని చూస్తాడు. తను వెళుతుంది.

పనిలోకి దిగుతారు. సిమెంటుగోడలు... కర్టెన్... ఆఫీసు... కుర్చీ.. టేబులు.

వేలిముద్ర, అతని స్పర్శ... గొంగళిపురు గులు.

ఒక్కొక్కటిగా ఆమె మనసులోకి పరుగె త్తుకుంటూ వస్తున్నాయి.

జ్ఞాపకాలు, ఘాటైన, చేదైన జ్ఞాపకాలు; ఇప్పుడే జరిగినట్లుగా.

వళ్ళంతా వణుకుకు లోనవుతోంది.

పిలుస్తాడేమో? పిలిస్తే...?

తను వెళ్ళాలా? వెళ్ళాలి!

వెళుతుందా? వెళ్ళగలుగుతుందా?

వద్దు... వద్దు... మనసు గావుకేక పెట్టింది.

వెళ్ళు... వెళ్ళు.. ఇన్ని జరిగినా తెలిసిరా లేదా? ఇంతసేపూ నువ్వు అనుకున్నది మరచిపోయావా? అని బుద్ధి మందలిం చింది.

అతను మామూలుగానే గంగావతివైపు చూశాడు.

అదురుతున్న ఆమె కళ్ళలో ఏవో భావా లకై వెతికాడు.

ఆమెలో వణుకు మరింత ఎక్కువైంది.

అతను ముందుకు కదిలాడు. ఆమెను పిలవకనే.

"నువ్వు చేసిన పనికి మళ్ళీ అతను నిన్నెలా పిలుస్తాడు. అవకాశం కావాలంటే, పని దొరకాలంటే, నువ్వే వెళ్ళి అడుగు" అంటూ బుద్ధి మనసుకు హితబోధ చేసే లోపే ట్రాక్టరు వెళ్ళిపోయింది.

ఒక నిట్టూర్పు విడిచింది గంగావతి.

ఇంతసేపూ వున్న ఆలోచన...ధైర్యం... రాజారెడ్డి వచ్చేసరికి ఏమయ్యాయి. ఏమైంది తనకి? ఎందుకలా భయపడిపో యింది.

భయపడితే బతకలేం. ఈసారి వచ్చే ట్రాక్టర్‌లోనైనా వెళ్ళిపోవాలి. అవును. ఖచ్చి తంగా వెళ్ళిపోవాలి.

సమయం నెమ్మదిగా దొర్లుతోంది.

రెండో ట్రాక్టరు వచ్చింది.

దాన్ని చూడగానే చెప్పొచ్చు అది నాగ రాజు మేస్త్రీదని.

పిరికి ఆలోచనలు రాకూడదని గట్టిగా అనుకొంది.

ట్రాక్టరు ఆగగానే మేస్త్రీ దిగాడు.

ఒక్కొక్కరినే పిలుస్తున్నాడు.

తననూ పిలుస్తాడు. ఖచ్చితంగా పిలు స్తాడు. వెళ్ళిపోతాను. ఈసారితప్పకుండా వెళ్ళిపోతాను... అనుకుంది! అతను ఆడవా ళ్ళవైపు వచ్చాడు.

అంత ఉదయాన్నే పచ్చిబూతు జోకు వేశాడు. ఆడాళ్ళు నవ్వారు. అతనికే పెద్దగా నవ్వొచ్చి పకపకా నవ్వాడు.

ఆ నవ్వు డబ్బాలో రాళ్ళు పోసి గిలకరిం చినట్లుంది.

ఆ నవ్వు... అదే నవ్వు... అసహ్యం కల గజేసే నవ్వు.

ఆమె మనసులో ఏహ్యాభావం జల్లులా

కురిసింది.

ఆమె ఎంత ఆపుకుందామన్నా ఆనాటి అతని చేష్టలు గుర్తుకువస్తున్నాయి.

పచ్చి బూతులు...

మోటు సరసం...

వైపు ఇలా పట్టుకోవాలి...

పురుగులు పారాడినట్లుండే స్పర్శ అతనిది!

డబ్బిస్తాను... ఒప్పుకో... ఇంకెక్కడో తగులుతున్న అతని చేయి...

ఒక్కొక్కటిగా జారిపడిన వర్షపు చుక్కలన్నీ ఒకటై... అవి వాగై, వంకై, మహానదిలా పరవళ్ళు తొక్కుతూ... ఆనకట్టల్ని తెంపుకుంటూ...

"వద్దు... వద్దు" మనసు గింజుకుంటోంది.

తనపైన తనకే కోపం వస్తోంది. ఏడుపొస్తోంది.

వద్దంటే కుదరదు. అడుగు... ధైర్యం చెయ్... అంటూ బుద్ధి చెబుతోంది.

వద్దు... తట్టుకోలేను... దీనికన్నా నన్ను చంపేసెయ్ ఫరవాలేదు అంటోంది మనసు.

అడగకుంటే వెళ్ళిపోతాడు.

పని దొరకదు.

బతుకుబండి సాగదు.

అడుగు... వూ కానీ అడుగు...

వద్దు... వద్దు నావల్లకాదు.

ఏయ్... నోర్ముయ్... పని దొరక్కపోతే, కడుపుకు గడిచేదెట్లా, సిగ్గుపడితే కడుపు నిండుతుందా? అడుగు... వెళ్ళు... పో... నువ్వడిగితే ఖచ్చితంగా పని ఇస్తాడు.

అతికష్టంపై మాటలు పెగల్చుకుని 'నేనొస్తా' అన్న గంగావతి మాటలు అప్పటికే కదిలిన ట్రాక్టర్ ఇంజన్ శబ్దంలో కలిసిపోయింది.

మళ్ళీ ట్రాక్టరొచ్చింది.

అతను దిగాడు.

ఒక్కొక్కర్నే పిలుస్తున్నాడు. ఒక్కొక్కరే వెళ్ళి ట్రాక్టరెక్కుతున్నారు.

అతను గంగావతికేసి చూశాడు.

అతను పిలవకముందే "వస్తాను" అన్నట్లుగా చొరవ చూపుతూ ముందుకు వచ్చింది మనసును బంధించి.

"వస్తావా"

ఎగసిపడుతూ వస్తోన్న ఆలోచనలను బలవంతంగా తొక్కిపట్టి వస్తానన్నట్లుగా తలూపింది.

అతను ఫెళ్ళున నవ్వాడు.

ఆ నవ్వు వ్యంగ్యంగా వుంది. ఆమెను అవమానపరిచేట్లుగా వుంది.

"కూలికి వస్తావా? లేక పనికి వస్తావా? " అన్నాడు 'పని'ని వత్తి పలుకుతూ.

అందరూ ఆమెవైపే చూస్తున్నారు.

అందరిముందూ... అతను నిస్సిగ్గుగా అడుగుతుంటే..?

ఆమె మాట్లాడలేదు.

లజ్జతో తలదించుకుంది. మొహమంతా అవమానభారంతో కమిలిపోయిన తమలపాకులా తయారైంది.

"నువ్వు కూలికి పనికొస్తావుగానీ, నాకు పనికి రావుగదా. నిన్నెందుకు పనిలోకి పిలుచుకోవాలి. అయినా ఏం పొగరే నీకు. కూలిదానివి. కాళ్ళదగ్గర పడుండాల్సిన దానివి. నామీదే ఎదురుతిరుగుతావా. పతివ్రత ఫోజులు పెడతావా" అంటూ బూతులు తిట్టాడు.

ఆమె బిక్కచచ్చిపోయింది. మాటలు రాని కొయ్యబొమ్మలా బిగుసుకుపోయింది. ఆ దృశ్యాన్ని కొంతమంది వింతగా చూస్తుంటే... మరికొంతమంది అవన్నీ మామూలే అన్నట్లుగా చూస్తున్నారు.

మరో ట్రాక్టరు.

మరొకతను.

"పోనీలే... జరిగిందేదో జరిగిపోయింది. నీకిప్పుడు పని కావాలని నువ్వే అడుగుతున్నావు. కూలికోసమే అయితే నాకు లెక్కలే

నంత మంది వున్నారు. వాళ్లందర్నీ పిలుచుకోవచ్చు నిన్ను పిలవాల్సిన అవసరం లేదు. అయినా నీకిప్పుడు కూలీ ఇస్తా... అయితే ఒకటి. అది నీకు తెలుసు. నువ్వు నాతో పడుకోవడానికి ఒప్పుకుంటేనే. ఎందుకంటే నిన్ను ముందు అడక్కుండా పిలుచుకుపోయి మేం నడుములు విరగ్గొట్టుకోలేం కదా"

అంతమందిలో నిర్లజ్జగా... నిస్సిగ్గుగా... తనతో పడుకుంటేనే కూలీ ఇస్తానంటున్న అతని మాటలు ఆమెలో రోతని కలిగించాయి. పొంగుకొస్తున్న అసహ్యంతో ఆమె మనసు స్థబ్దమైపోయింది.

ఒక్కసారిగా ఏడుపు ముంచుకొచ్చింది.

గట్టిగానే ఏడుస్తూ కూలబడిపోయింది.

"ఏడిస్తే ఏమవుతుంది. కంట్లో నీళ్ళొస్తాయి. అంతే కదా. ఆ ఏడుపు కావాలంటే తీరిగ్గా ఏడుద్దువు. ఇంతకీ నువ్వు వస్తావా రావా? " అని, కొంతసేపు చూసి వెళ్ళిపోయాడతను. సూర్యుడు పైపైకి ఎగబాకుతున్నాడు.

వీధుల్లో తిరిగే జనం క్రమంగా పెరుగుతున్నారు.

తిరిగే వాహనాలు పెరుగుతున్నాయి.

కూలీల గుంపు తరుగుతోంది.

మనసు మార్చుకొని వచ్చినా... మిగిలిపోతూనే వుంది గంగావతి.

సమయం పది దాటింది.

ఇప్పుడు అక్కడ వేళ్ళమీద లెక్కపెట్టగలిగేంత మందే వున్నారు. వారిలో ఒక గంగావతి తప్ప మిగతా వారందరూ ముసలివాళ్ళు. అందవికారులు, బలంలేని బక్కప్రాణులే.

ఇలాంటివారిని కూలికి పిలిస్తే కూలీ నష్టమని కాంట్రాక్టర్లు భావించడంవలనే వాళ్ళు మిగిలిపోయారు.

"ఏమక్కా... వెళ్ళిపోదామా. ఈ పొద్దు మన అదృష్టం బాగా లేనట్లుంది" అంది నెల్లెమ్మ.

"వెళ్ళిపోక ఇంకా ఎవడొస్తాడని కాచుక్కూర్చుంటాము. వచ్చినా మనల్ని పిలుస్తాడన్న నమ్మకం ఎక్కడిదిగానీ వెళ్దాం పద" అంది లక్షుమమ్మ.

వారి వయసు అటూ ఇటుగా అరవై వుండొచ్చు చాలా సీనియర్ కూలీలు. గవర్నమెంట్ వారి భాషలో చెప్పాలంటే రిటైర్ కావలసిన కూలీలు. కానీ వాళ్ళుచేసే ఉద్యోగానికి రిటైర్మెంట్స్ లేవు.

రెక్కాడినంతకాలం కూలీకి వెళ్ళాల్సిందే. చచ్చేదాకా పనిచేసి తీరాల్సిందే!

"ఇళ్లలో పనిచేసేందుకు ఎవరైనా పిలుస్తారేమో, కొంతసేపుండిపోదాం. ఎట్లానూ ఇంటికిపోయి చెండాడేదేమీ లేదుకదా" అంది నారాయణమ్మ కల్పించుకుంటూ.

"అవును... అదీ నిజమే. ఇంకొంతసేపుండి పోదాంలే" అంది నెల్లెమ్మ.

"పోదామని చెప్పిందీ నువ్వే... వద్దనేదీ నువ్వే" నిష్ఠూరపోయింది లక్షుమమ్మ.

వాళ్ళ దృష్టి గంగావతిపై పడింది.

"ఏవమ్మాయ్ మేమంటే ముసలివాళ్ళం. మాకు కూలి దొరకలేదంటే అర్థం వుంది. కానీ నీకేం లోటు. కుందనపు బొమ్మలాగున్నావు" అంది నెల్లెమ్మ.

అంతలో లక్షుమమ్మ అందుకుంది.

"ఆ మాత్రం తెలియదా. ఆ కాంట్రాక్టర్ గాడు ఇందాకా సిగ్గులేకుండా అడగనుకూడా అడిగాడు కదా. ఆ దరిద్రపు ముండాకొడుకులకింద పడుకోకపోవడమే ఆ బిడ్డ చేసిన తప్పు. ఈ బిడ్డేగానీ ఒప్పుకునుంటే పువ్వుల్లో పెట్టుకుని పనియ్యరూ" అంది.

"నీ పేరేమిటమ్మాయ్? " నారాయణమ్మ అడిగింది.

"గంగావతి"

"ఎక్కడవుంటున్నావు? "

"జీవకోనలో"

"జీవకోనలోనా...మేం వుండేది కూడా జీవకోనలోనే. కొత్తగా వచ్చినారా. ఎన్నిరోజులయింది చేరి? " అడిగింది ఆసక్తిగా.



చెప్పింది గంగావతి.

"చూడమ్మాయ్! నిన్ను చూస్తుంటే జాలేస్తుందనుకో. కొత్తగా వచ్చినావుకదా! ఇక్కడ అలవాట్లు నీకు తెలుసుండవు. మనం రోజూ పనికోసం కుక్కల్లాగా పడిగాపులు గాసే ఈ జాగాను ఏమంటారో తెలుసా? " అంది నెల్లెమ్మ.

గంగావతి తలెత్తి ఏమంటారు? అన్నట్లుగా చూసింది.

"పతివ్రతల నిలయం అంటారు" అంటూ పకపకా నవ్వింది నారాయణమ్మ. ఆమె నవ్వుతో మిగతావారు కూడా జత కలిపారు.

ఆ నవ్వులో వ్యంగ్యం వుంది. బాధ వుంది. అనుభవమూ వుంది. నెల్లెమ్మ అందుకుంది మళ్లీ.

"అవునమ్మాయ్... ఆ కనిపిస్తావుండే గోవిందరాజుల స్వామి సాక్షిగా దీన్ని పతివ్రతల నిలయమని అంటారు. ఎందుకంటే అందమైన అమ్మణ్ణుల నుండి మాలాంటి వయసుడిగిన ముసలివారివరకూ అందరూ వాళ్లవాళ్ల మానాన్ని ఇదిగో ఈ జాగాలోనే ముందుగా వదిలేయాలి. అప్పుడే పని దొరికేది. మనలాంటోళ్ల కడుపు నిండేది" ఆమె గొంతులో బాధ కనపడలేదు. విరక్తితో కూడిన అసహ్యం, కసి కనిపించాయి.

"ఆ ముండాదేవుడు ఈ కూలిజనానికి కడుపు ఇచ్చాడు. కష్టపడే గుణమిచ్చాడు. కానీ మిగతావాటన్నిటినీ ఇచ్చినట్టేఇచ్చి లాగేసుకుంటాడు. అందులో మన మానం కూడా ఒకటి అర్థమయ్యిందా" అంది నారాయణమ్మ వేదాంతిలాగా. అంతలో లక్షమమ్మ అందుకుంది.

"చూడమ్మాయ్... ఇది కలికాలం. మనం అభిమానాలు, సిగ్గు ఎగ్గులూ పెట్టుకుని బతకలేం. నన్నేచూడు, ఇప్పుడిట్లా వయసయి పోవడంతో ముడతలుపడి ముసలిదానిలాగా కనిపిస్తున్నాను కానీ వయసులో



వున్నప్పుడు నీకంటే అందంగా వుండేదాన్ని. పెద్దపెద్ద వాళ్లంతా నేనంటే పడి చచ్చే వాళ్లు. వాళ్లకి నేను లొంగలేదు. తినో, తినకో, చినిగిన గుడ్లో కట్టుకుని తిరిగినా ఏనాడూ ఈ వంటిమీద నా మొగున్ని తప్ప మరొకరిని చేయి వేయనివ్వలేదు.

"పదేళ్లకిందటిదాకా మానాన్ని కాపాడు కుంటూ వచ్చిన నేను కూలి పనులు దొరక కపోవడంతో పల్లెలో బతకలేక పట్నానికి వచ్చినాను. ఇక్కడ బతకాలంటే మానాన్ని వీధిన పడేయాలని కండీషన్ పెట్టింది పట్నం.

"మంచి వయసులో వున్నప్పుడంతా మానం కాపాడుకొచ్చిన నేను వయసుగాని వయసులో ఇదిగో ఇక్కడే ఈ జాగాలోనే వదిలేసుకున్నాను. వదిలేశాననుకున్న తరు వాతే నాకు పని దొరికింది.

"ముసలిదాన్ని నాకే తప్పలా, నీలాంటి వయసులోవున్న అందమైన అమ్మాయిని వూరికే వదిలేస్తారా?

"నీ మానాన్ని కాదని కూలీ ఇచ్చి దుడ్లిచ్చి పంపేంత ఎర్రోళ్లు కాదు ఇక్కడి కాంట్రా క్టర్లు, మేస్త్రీలు" అంది తన జీవితసారాన్ని చెబుతూ. అంతలో ఒక ట్రాక్టరొచ్చింది.

అది ఉదయాన వచ్చి కూలీలను తీసుకె ళ్లినదే.

తిరుమల ఘాట్ రోడ్‌లో రోడ్‌వేసే పనికి మనుషుల్ని పిలుచుకుపోయాడు. ఎవరో మంత్రి రెండు రోజుల్లో తిరుమలకు వస్తు న్నాడనీ, ఆయన వచ్చేలోగా రోడ్డుపని పూర్తి చేయాలని పైఅధికారులు ఆజ్ఞాపించడంతో మరింతమంది కూలీలకోసం మళ్లీ వచ్చాడు కాంట్రాక్టరు.

"ఏవమ్మాయ్... నీకోసమే వచ్చినట్టుంది. ఇంకేం ఆలోచించకుండా వెళ్లిపో" అంది లక్షుమమ్మ.

వున్న ముసలీ ముతకలో కొంత ఆరో

గ్యంగా కనిపిస్తున్న వారిని ఎంపిక చేసుకున్నాడు కాంట్రాక్టరు.

"ఇందాకా మేం చెప్పింది గుర్తుందికదా! తిక్కతిక్క ఆలోచనలు చేయవద్దు. నువ్వు మానవతిగా లేకుంటే దేశానికొచ్చిన నష్టం ఏమీలేదు. నువ్వు నీ మానాన్ని వదులుకుంటున్నది పేరుకోసం కాదు. పదవులకో సమూ కాదు. కడుపుకోసం. కడుపులో నాలుగు మెతుకులు వేయడం కోసం నువ్వు ఆ పని చేస్తున్నావు. కడుపుకోసం ఏం చేసినా తప్పులేదు" అంటూ కాంట్రాక్టర్ వైపు తిరిగి "సింహాద్రిసారూ ఈ అమ్మాయి కూడా పనికి వస్తుంది తీసుకెళ్లండి" అంది నారాయణమ్మ.

అక్కడున్న వారంతా గంగావతివైపు విచిత్రంగా చూడసాగారు. కొన్ని విషయాలు అందరికీ తెలిసినా వాటిని బహిరంగ రహస్యంలాగే వుంచాలి తప్ప బహిర్గతం చేయకూడదు.

పెళ్లికూతుర్ని శోభనం గదిలోకి నెట్టి తలుపేసినంత సులువుగా కాంట్రాక్టరు కింద పడుకోమంటూ ట్రాక్టరు ఎక్కమనడంతో గంగావతి శరీరంలో అణువణువూ అతివేగంగా కదలసాగింది. నరనరాల్లో ఫారుతున్న రక్తం నరాలు తెగిపోతాయా అన్నంత వేగంగా పరుగులు తీయసాగింది.

వణుకు ప్రారంభమైంది.

అప్పటికే మనసు బాధల అగాధంలోకి జారిపోయింది.

వాళ్ల మాటలతో గడ్డకట్టుకుపోయిన బాధ, కసి, నిస్సహాయత అన్నీ ఒక్కసారిగా కరిగిపోయి కంట్లో కన్నీరై పొంగుకువచ్చాయి. టపటపమంటూ కన్నీటి బొట్లు, ఆమె బుగ్గలమీదుగా జారి గుండెలపై పడుతున్నాయి.

తన వల్లకాదు. "కాదు... నా వల్లకాదు" అంటూ గట్టిగా చెప్పాలనుకుంది.

కానీ ఒక్కటంటే ఒక్కమాట కూడా నోట్లోంచి బయటపడలేదు.

అంతమంది రికమెండ్ చేస్తుంటే ఆమె గురించి తెలిసి కూడా సరే వస్తే తీసుకెళ్దామని కొంతసేపు వేచి చూశాడు కాంట్రాక్టరు.

ఎంతకీ ఎక్కకపోయేసరికి వెకిలిగా నవ్వుతూ వెళ్లి ట్రాక్టరెక్కి డ్రైవర్ నుద్దేశించి "పోనీ రేయ్, ఫోజులు కొడుతోంది కూలిముండ. పెద్ద ఆమెకే స్పెషల్‌గా వున్నట్లు" అంటూ ఏదో బూతు పదాలు వాడాడు గట్టిగానే.

సిగ్గూలజ్జలతో తలను భూమిలోకి కూరేయాలనిపించింది గంగావతికి.

"హూ... ఇట్లయితే అయినట్లే సంబడం" కామెంట్ చేసిందొకామె.

ఎక్కడ దాగున్నాయోగానీ ధారలాగా గంగావతి కన్నుల్లోనుండి కన్నీళ్లు ప్రవహిస్తూనే వున్నాయి.

కొంతసేపటికి పాచిపని దొరకడంతో నారాయణమ్మ, లక్షుమమ్మలు వెళ్లిపోయారు.

ముసలివాళ్లైతే ఎంత చేయించుకున్నా ఓపిగ్గా చేస్తారు. ఎంత తక్కువ డబ్బులిచ్చినా నోరు మెదపకుండా తీసుకుంటారు కాబట్టి ఇంటిపనులు చేయడానికి ముసలివాళ్లనే పిలుచుకుపోతుంటారు బాగా డబ్బుండేవాళ్లు.

నెల్లెమ్మ తనను కూడా ఎవరైనా పాచిపనికి పిలుస్తారేమోనని కొంతసేపు చూసింది.

పొద్దు నడినెత్తికొచ్చేస్తుండగా విసుగొచ్చి ఇంటిదారిపట్టింది.

ఎవరైనా వచ్చి పని ఇస్తారేమోనన్న దింపుడు కళ్లం ఆశతో ఇంకా ఆరేడుగురు మగవాళ్లు, ఏడెనిమిది మంది ఆడవాళ్లు అక్కడే నిరాశగా మొహాలు వాడేసుకుని వున్నారు.

ఇప్పుడెళ్లిపోదాం, ఇంకెళ్లిపోదాం అనుకుంటూనే ఎదురు చూస్తున్నారు.

ఉదయం నుండి నిమిషం కూడా కూర్చోక పోవడంతో గంగావతికి కాళ్లు పీకు తున్నాయి.

రాత్రి ఏడుస్తూ కూర్చోవడంతో వంట చేయలేదు. భోంచేయనూలేదు. తెల్లవారి వంటయితే చేసిందిగానీ తినకనే వచ్చే సింది.

అంతసేపూ ఆలోచనలే బాధపెడుతూ వుంటే ఇప్పుడు ఆకలి కూడా బాధపెట్టసా గింది.

చేతిలో అన్నం బక్కెట్టయితే వుందికానీ దాన్ని ఎక్కడ తినాలి? అసలు తినాలనిపిం చడంలేదే!

పైన ఎండ పొగలేస్తోంది.

రాత్రంతా నిద్రలేకుండా ఏడ్వడంవలన కళ్లు నిప్పులు పోసినట్లు మండుతున్నాయి.

నీరసంగా వుంది.

ఒక్కొక్కరే ఇళ్లకు తిరిగి వెళ్లిపోతున్నారు.

ఒకరిద్దరు గంగావతిని వెళ్లిపొమ్మని సూచించారు.

గంగావతికి వెళ్లాలనిపించడంలేదు.

అసలు తను ఇప్పుడు జీవకోనకు వెళ్లగ లుగుతుందా?

నడిచే ఓపికలేదు.

ఒకవేళ ఓపిక తెచ్చుకున్నా ఇంటికి వెళ్లి ఏం చేస్తుంది. ఏముందక్కడ? ఎవరున్నా రక్కడ? దేనికోసం వెళ్లాలి? తిండికోస మేగా. ఆ తిండి సంపాదించుకోవడానికేగా ఇన్ని తిప్పలు...

సైకిళ్లు, స్కూటర్లు, బస్సులు, కార్లు... గజి బిజిగా తిరుగుతున్నాయి.

కయ్... కయ్‌మంటూ హారన్ మోత లతో చెవులు గింగిర్లు మనిపిస్తున్నాయి.

వాటిమధ్యన నడిచిపోతున్న జనం తమ జీవితాల్ని ఎక్కడో ధారబోసుకుని వెదు క్కుంటున్నట్లు అటూఇటూ హడావుడిగా తిరుగుతున్నారు.

వాటన్నిటినీ గమనించే పరిస్థితిలో లేదు.

అసలు ఈ ప్రపంచంలోనే వున్నట్లు లేదు..

కాళ్లు పీకుతున్నా కూర్చోవాలన్న ధ్యాస లేదు.

తడారిపోయి పిడచకట్టుకుపోయిన నాలుక...

ఆకలితో ఉంగలు చుట్టుకుపోతున్న పేగులు...

జివ్వుజివ్వున గుంజుతున్న నరాలు...

ఆర్పడం మరచిపోయిన కనులు...

ఇప్పుడో ఇంకాసేపట్లోనో చిట్లిపోయేలా నొస్తున్న తల...

మసకబారుతున్న చూపు...

వింతవింత శబ్దాలు వింటున్న చెవులు...

ఏదో ఆలోచన... మరేదో వూహ...

ఒక రూపం దిద్దుకుంటూ అంతలోనే అది గుండ్రంగా అచ్చం భూమిలాగే భవ నాలు, వాహనాలు, మనుషులూ... అన్నీ...

అరరే... తిరుగుతోంది... మరింత వేగంగా...

శ్వాసపెద్దగా శబ్దం చేస్తూ...

ఏయ్... ఏమిటిది... ఏమి జరుగు తోంది... ఇదేంటి భూమి.... అయస్కాం తంలా లాగేస్తోంది. తన వడిలోకి లాక్కొం టోంది.

ధబ్‌మన్న శబ్దంతో గంగావతి స్పృహ తప్పి పడిపోయింది.

★ ★ ★

స్టార్‌హోటల్ ఏసి కాన్ఫరెన్స్ హాల్‌లో సదస్సు జరుగుతోంది.

ముఖ్యఅతిథి రాష్ట్ర కార్మికశాఖామంత్రి మైక్‌ముందు నిలబడి ఉపన్యాసం దంచేస్తు న్నాడు.

"బాలకార్మికులను చూసి మనం సిగ్గుప డాలి. వాళ్ల కష్టాన్ని చూసి మన కళ్లు చెమ ర్చాలి. మన హృదయాలు ద్రవించాలి. వారిపట్ల మనకు అపార సానుభూతి వుండాలి.

"మనరాష్ట్రంలో లక్షలాది మంది బాలకా ర్మికులున్నారు. వారందరికీ నిర్బంధంగా

నైనా చదువు చెప్పించాలి. ఈ వ్యవస్థను రూపుమాపేందుకు ప్రతి ఒక్కరూ కంకణం కట్టుకోవాలి.

"నాకు జరిగిన ఒక సంఘటన మీకు చెబుతాను. మొన్నటికి మొన్న నేను దిగిన హోటల్లో సర్వింగ్‌కు వచ్చాడు ఒకబ్బాయి. నెలకు ఎంత జీతం ఇస్తారని అడిగాను. మూడొందలన్నాడు. నేను ఆశ్చర్యపోయి ఎన్ని గంటలు పని చేస్తావని అడిగాను. తెల్లవారి నాలుగునుండి రాత్రి పదివరకు అన్నాడు. నా కళ్లలో నీళ్లు తిరిగాయి. వెంటనే వంద రూపాయలు జేబులోనుండి తీసి ఇచ్చేశాను" అన్నాడు.

ఆయన చేసిన గొప్పపనికి అందరూ హర్షం వ్యక్తం చేస్తూ చప్పట్లు కొట్టారు. మరింత ఉత్సాహంతో ఉపన్యాసం కొనసాగించాడు మంత్రి.

ఆ ఉపన్యాసం నోట్ చేసుకుంటున్న మురళీ మనసంతా పాడయి అసహ్యంతో నిండిపోయింది.

ఎ.సి కాన్ఫరెన్స్ హాల్‌లో బాల కార్మికులపై సదస్సు పెట్టడం, పైగా మొసలి కన్నీరు కార్చడం వెగటుగా అనిపించింది.

"బాలకార్మిక వ్యవస్థను రద్దు చేయాలి. సుప్రీంకోర్టు ఆదేశాలను అమలు చేయకపోతే ముందూ వెనుకా చూడకుండా శిక్షిస్తాం" అంటూ అతను చెబుతున్న మాటలు గతంలో అనేకమంది చెప్పారు. ఫలితం మాత్రం శూన్యం. ఈ రోజు మంత్రి మాట్లాడిన మాటలన్నీ రేపు పేపర్లో అందంగా ప్రజలందరి ముందుకూ వెళతాయి. ఆహా మన కార్మిక శాఖామంత్రి ఎంత విశాల హృదయుడో కదా అని ఖచ్చితంగా ఎక్కువమంది పాఠకులు అనుకుంటారు. మురళీకి ఇక అక్కడ కూర్చోబుద్ధి కాలేదు.

ఇలాంటి వారిని పాలకులుగా భరించాల్సి రావడానికి కారణమైన ఈ వ్యవస్థ రూపాన్ని తిట్టుకుంటూ లేచి బయటకొచ్చేశాడు.

సైకిల్ తీసుకుని ఇంటిదారి పట్టాడు.

నాలుక్కాళ్ల మండపం మీదుగా వెళుతుంటే అక్కడ జనం గుంపుగా చేరి వున్నారు. సైకిలుకు బ్రేకువేశాడు.

రిపోర్టర్‌కున్న సహజలక్షణంతో సైకిల్ పక్కన నిలబెట్టి జనాన్ని నెట్టుకుంటూ వెళ్లి తొంగిచూశాడు.

ఎవరో ఒక యువతి స్పృహ తప్పి పడి వుంది.

అందరూ రకరకాల వ్యాఖ్యానాలు చేస్తున్నారు. కొందరైతే ఏవో సలహాలనిస్తున్నారు. అక్కడి పరిస్థితిని చూసి వెంటనే కదిలాడు మురళీ. పక్కనున్న అంగట్లో నుండి సోడాబుడ్డీని ఎత్తుకుని జనాన్ని నెట్టుకుంటూ వెళ్లి ఆమె ముఖంపై సోడా నీళ్లు చిలకరించాడు.

ఆమెకు తెలివి వచ్చింది.

అంతలోనే గడగడా వణికిపోతూ కళ్లు తేలేయసాగింది. మురళీ ఆమె వంటిపై చేయివేసి చూశాడు. ఒళ్లు కాలిపోతూ వుంది. వెంటనే ఆటోని పిలిచాడు.

జనం పక్కకు జరిగి ఆటోకు దారిచ్చారు.

ఆమెను రెండు చేతులతో ఎత్తి ఆటోలో పెట్టబోతుంటే ఎప్పుడొచ్చారో నారాయణమ్మ, లక్షుమమ్మలు అతనికి సాయం పట్టారు.

★ ★ ★

ఆ రోజు మురళీకి నైట్ డ్యూటీ.

రాత్రి పన్నెండు గంటలవరకూ వచ్చే వార్తల్ని, ముఖ్యంగా క్రైం వార్తల్ని మిస్‌కాకుండా చూడడమే నైట్ డ్యూటీ.

సిటీ ఎడిషన్ టైం కూడా అయిపోవడంతో డెస్క్ ఇంచార్జ్‌కు గుడ్‌నైట్ చెప్పేసి రోడ్డులోకి వచ్చాడు.

ఆ టైంలో ఏ బస్సులూ వుండవు. లారీ పట్టుకుని ఇల్లు చేరేసరికి రెండవుతోంది.

ఆకలిగా వుంది. తల్లిని లేపడం ఇష్టంలేక తనే వడ్డించుకుని తిన్నాడు. చాపవేసుకుని

పడుకున్నాడు. కళ్లు మూసుకున్నా నిద్ర రావడంలేదు.

ఏదో దిగులు మనసును బాధపెడుతోంది.

ఆలోచనలు తేనెటీగల్లా చుట్టుముడుతున్నాయి.

పడుకొని వుండబుద్ధికాలేదు. లేచి నెమ్మదిగా మిద్దెపైకి వెళ్లాడు. పిల్లగాలి జిల్లున తాకింది.

పట్టణానికి ఎక్కువ, నగరానికి తక్కువ అనిపించే ఊరి వీధులన్నీ నియాన్‌లైట్ల వెలుగులో వింత శోభను సంతరించుకున్నాయి. పశ్చిమవైపున కొండలు కనిపిస్తున్నాయిగానీ స్పష్టతలేదు. కాలి నడకన వెళ్లే వారి కోసం దారి పొడవునా వేసినలైట్లు చూస్తే కొండపైనుండి వెలుగు పిల్లకాలువై ప్రవహిస్తూన్నట్లుంది.

ఆ విషయాన్ని అతడు నమ్మలేకపోతున్నాడు. అసలు అది వూహించడానికి కూడా సాధ్యం కావడంలేదు.

ఎంతటి దారుణం. కేవలం కూటికోసం, కూలికోసం... తనకు ఏమాత్రం ఇష్టంలేకున్నా... అసహ్యం వున్నా మేస్త్రీల కింద పడుకుంటున్నారు.

గంగావతి ఎవరో తెలియకపోయినా నారాయణమ్మతో పరిచయం వుంది మురళీకి. నారాయణమ్మ వెంకటేశుకు అత్త అవుతుంది. జీవకోనలోనే నివాసం.

గంగావతిని ప్రభుత్వ ఆసుపత్రిలో చేర్చి, తనకున్న పరిచయంతో మంచి ట్రీట్‌మెంట్ ఇప్పించాడు.

అక్కడ చెప్పింది నారాయణమ్మ జరిగిన విషయాలన్నిటినీ వరుసగా.

చెబుతున్నంతసేపూ ఏదో కథ వింటున్నట్లుగా వుందే తప్పించి ఏమాత్రం వాస్తవానికి దగ్గరగా వున్నట్లు అనిపించలేదు.

తిన్నది అరగడానికి మాత్రలేసుకునే వాడికి ఆకలి బాధ ఇలా వుంటుందంటే నమ్మలేరు.

తను కూలి పనులకు వెళ్లడంలేదు.

మన చుట్టూ వున్న మనుషుల ప్రవర్తన బట్టే ఈ సమాజం ఇలా వుంది అని అంచనా కట్టగలం. తన పరిధిలో లేని విషయాలు అవి ఎక్కువ స్థాయిలోవున్నా తక్కువ స్థాయిలో వున్నా తను నమ్మలేడు. ఎవరు నమ్మినా ఎవరు నమ్మకపోయినా ఇది నిజం. దానికి సాక్ష్యం గంగావతి. ఆమె ఆరోగ్యానికి మంచి ట్రీట్‌మెంట్ ఇప్పించగలిగాడు తను. మరి ఆమె సమస్యకు, ఈ సమాజానికి అంటుకున్న రోగానికీ ఏం ట్రీట్‌మెంట్ ఇవ్వగలడు?

వ్యాపారం చేయాలంటే పెట్టుబడి కావాలి. అది ధనరూపేణా కావచ్చు. వస్తురూపేణా కావచ్చు. మేధస్సు రూపేణా కావచ్చు. మరోరకంగానైనా వుండొచ్చు.

కానీ... కానీ తమ శ్రమను అమ్ముకోవడానికి శీలాన్ని పెట్టుబడిగా పెట్టాలి ఇక్కడ?

ఆ వూహే వెగటుగా, అసహ్యంగా అనిపించింది.

వూహే ఇంత భయంకరంగా వుందే. మరి అనుభవిస్తున్న వాళ్లకు అది ఎంతటి నరకమో?

అతని గుండెల్ని ఎవరో పిండివేస్తున్నట్లనిపించింది.

ఎలా భరిస్తున్నారు. అసహ్యాన్ని గుండెల్లో అదిమిపెట్టి శరీరాన్ని ఇతరుల కింద పండబెట్టి...

గట్టిగా తల విదిల్చాడు మురళీ.

నో...నో అని గట్టిగా అరవాలనిపిస్తోంది.

తలంతా చిట్లిపోయేలా వుంది.

ఇక్కడ వ్యభిచారం ఎక్కువే. యాత్రాస్థలం కాబట్టి బ్రోతల్ కంపెనీలు పచ్చగానే నడుస్తున్నాయి.

తమకు ఇష్టం లేకున్నా డబ్బులకోసం వళ్లమ్ముకుంటారు అక్కడ వాళ్లు. ఆ లెక్కన వీళ్లూ వ్యభిచారులేనా?

వ్యభిచారులైతే కేవలం మేస్త్రీకింద పడుకున్నదానికే డబ్బులు తీసుకుని బతికేయాలి. కానీ మేస్త్రీలు ఒక్క పైసా కూడా వీళ్లకు ఇవ్వడంలేదు. పైగా రోజంతా పని చేయించుకుని తక్కువ కూలీ ఇచ్చి పంపిస్తున్నాడు. అందులోనూ మోసం. అన్నింటా మోసం. ఆ లెక్కన వీళ్లందరూ ఆ కూలీ పనులకు వెళ్లేకంటే వ్యభిచారం చేసుకోవడం మంచిదికదా? కనీసం కష్టపడే పనైనా తగ్గుతుంది.

అయినా ఈ అభివృద్ధి చెందిన నవనాగరికతా సమాజంలో శరీరాన్ని అమ్ముకోవాలన్నా అంత సులువేమీకాదు. అందుకు చదువుండాలి. తెలివుండాలి. నటనుండాలి. మాటకారితనం వుండాలి.

అవన్నీ వున్నా రాబందుల్లా నిరంతరం వేధింపులతో పీల్చి పిప్పిచేసే పోలీసుల నుండీ, కంపెనీ యజమానులనుండీ ఎదురయ్యే రకరకాల మోసగాళ్ళనుండీ, శాడిస్టులనుండీ వచ్చే సమస్యలతో సహజీవనం చేస్తూ బతకడమంటే కత్తిమీద సామే.

ఈ చదువులేని మనుషులు, అమాయకమైన మనుషులు ఈ సమాజంలో వ్యభిచారం చేసుకోవడానికి కూడా అనర్హులే.

అవునూ! ఈ నీచమైన దారుణం ఎలా ప్రారంభమైంది. తాను పల్లెనుండి వచ్చినవాడే. పల్లెల్లో భూస్వాములు తమ పొలాల్లో పనులు చేయడానికి వచ్చే కూలీలను బలాత్కారం చేయడం తనకు తెలుసు. కానీ పట్టణాలలో వ్యక్తిగత స్వాతంత్ర్యం వుంది. ఎవడిపైనా మరొకడు ఆధిపత్యం చెలాయించలేడు.

పదేళ్ళక్రితం పట్టణాల్లో పనులు చేయించుకోవడానికి పల్లెలకు లారీలను తీసుకొచ్చి కొంత ఎక్కువ మొత్తం కూలీని ఆశచూపి కూలీలను పిలుచుకుపోయేవారు. అప్పుడే వ్యవసాయంలోకి యంత్రాలు ప్రవేశించాయి. వందలాదిమంది కూలీలపనిని అతి తక్కువ సమయంలో ఒక యంత్రమే చేసేయడం మొదలైంది. వ్యవసాయకూలీలకు పనులు కరువయ్యాయి. వలస మొదలైంది. ఫలితంగా ప్రతిపట్టణం చుట్టూ మురికివాడలు విపరీతంగా పెరిగిపోయాయి. ఇప్పటికీ పెరిగిపోతూనే వున్నాయి.

ప్రభుత్వం దేశ పరిస్థితులతో నిమిత్తం లేకుండా యంత్రాల ప్రవేశానికి ఆహ్వానం పలికింది. అప్పటివరకూ కూలీలకోసం లారీలు తీసుకెళ్తున్న మేస్త్రీలు, కాంట్రాక్టర్ల చుట్టూ పనికోసం కూలీలే తిరగాల్సి వచ్చింది. దాంతో వారి అజమాయిషీ పెరిగింది. ఈ అజమాయిషీని తమ వ్యక్తిగత అవసరాలకు వాడుకొంటూ, తాము కూలీల నుండి పొందగలవనుకున్న వాటినన్నిటినీ గుంజుకోవడం మొదలుపెట్టారు.

ఆ సమయంలో రాంపాదరెడ్డి గుర్తొచ్చాడు.

రాంపాదరెడ్డి రౌడీనే. అతను వందా, రెండువందలమంది కడుపుకొట్టి తాను బతికేందుకు ప్రయత్నిస్తున్నాడు. కానీ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం కోట్లాదిమంది కూలీల కడుపులను కొల్లగొడుతోంది. ధనవంతులను మరింత ధనవంతులను చేస్తోంది. పాలకులు చేస్తున్న పనితో పోలిస్తే రాంపాదరెడ్డి చేసేవి లెక్కలోకి రావు.

అలా అనిపించగానే విరక్తితో కూడిన నవ్వు వచ్చింది మురళికి.

ప్రభుత్వ విధానాలు ఏ విధంగా ప్రభావితం చేస్తున్నాయో వార్తగా రాస్తే ఎలా వుంటుందనిపించింది ఒక్కక్షణం.

ఎప్పుడో వార్తలు లేక పేజీలు ఖాళీగా వున్నాయనుకున్నరోజున ఇలాంటి వార్తను, అదీ మంచి రిపోర్టర్ రాశాడు కాబట్టి అందులో ఏదో వుండే వుంటుందన్న నమ్మకంతో అచ్చేస్తారు. ఆ వార్తను డెస్క్‌లో వాళ్ళే ఓపిగ్గా చదవరు. చదివినా అర్థంచేసుకోరు. అలాంటిది సాధారణ పాఠకులు

ఎంతమంది చదువుతారో లెక్కబెట్టుకో వచ్చు. విధానపరమైన విషయాలను వార్త లుగా రాస్తే చదివే పాఠకులసంఖ్య చాలా తక్కువ. క్రైం వార్తలు, రాజకీయ నాయ కుల విసుర్లు, సినీతారల గాసిప్స్‌లపట్ల వున్నంత ఆసక్తిలో నూరోవంతు కూడా ఇలాంటి వార్తలపట్ల చూపరు. కాబట్టి ఆ ప్రయత్నమే వృథా.

అయినా ఈ దారుణాన్ని వార్తగా రాసి నంత మాత్రాన అది పరిష్కారంకాదు. అందులో సందేహంలేదు. శ్రమించడమంటే ఏమిటో తెలియని, స్వార్థం మూర్తీభవించిన పాలకులు కూలీలకు కనీస వేతనాలను అమలుపరిచి వారికి భద్రత కల్పించి, ధన వంతులను దూరం చేసుకుంటారని ఆలో చించడం మూర్ఖత్వం.

మరయితే ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి?

వాళ్ళకు వాళ్ళుగా పరిష్కరించుకోలేరు. పాలకులూ పరిష్కరించరు. ఈ దారుణం ఎప్పటికీ కొనసాగాల్సిందేనా?

లేదు... లేదు. అలా జరగడానికి వీల్లేదు. ఈ దారుణానికి చరమగీతం రాయాల్సిందే.

ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం కచ్చి తంగా వుండే వుంటుంది.

ఈ సమస్యకూ ఓ ముగింపు వుంటుంది. వుంది... ఏమిటది?

తీవ్రమైన ఆలోచనల్లో మునిగిపోయాడు.

★ ★ ★

రాత్రి ఎనిమిదిగంటల సమయం.

గంగరావి చెట్టుకింద దివిటీ పట్టుకుని నిలుచున్నాడు చిన్నబ్బు.

దివిటీ వెలుగు వందలాది ముఖాలపై పడి ప్రతిఫలిస్తోంది. వారి మొహాల్లో సంశయం, ఆత్రుతత కనిపిస్తున్నాయి.

అందరికీ మధ్యలో దివిటీకి దగ్గరగా నిలుచుని వున్నాడు మురళి. అతనికి ఎడంగా రాంనారాయణ, గోవిందులు కుడిగా వెంకటేశు, లక్షుమమ్మ, నారాయణ మ్మలు నిల్చుని వున్నారు.

"మురళీసార్ వచ్చాడు. అందర్నీ రచ్చబం డకాడికి రమ్మన్నాడు" అనగానే వూరు వూరంతా నిమిషాల్లో అక్కడికి చేరిపో యింది.

ఇప్పుడు అక్కడివాళ్ళు మురళి ఏం చెబితే అది చేయడానికి సిద్ధంగా వున్నారు. మురళీ మాటలు వాళ్ళకు వేదవాక్కులు.

"అందరూ కూర్చోండి" అన్నాడు మురళి.

అందరూ కూర్చున్నారు. అందరికళ్ళూ మురళీమీదే వున్నాయి.

ఏం చెబుతాడా అని అటుపోతున్న గాలి అక్కడే ఆగింది.

శ్రద్ధగా వినదలచుకున్నట్లు చెట్లు కూడా వూగడం మానేశాయి.

"గంగావతీ ఇటురా" అన్నాడు మురళి.

తల వంచుకుని చిన్నగా వచ్చింది గంగా వతి.

"ఈమె మీకందరికీ తెలుసనుకుంటాను. పేరు గంగావతి. నిజంగా గంగలాంటిది. పవిత్రమైనది.

"ఈమె పల్లెనుండి వచ్చింది. పనికోసం వెళ్ళింది. పని ఇచ్చిన ప్రతివాడూ బలా త్కారం చేశాడు. ఆత్మాభిమానం గల మని షిగా గంగావతి ఎవరికీ లొంగలేదు.

"ఫలితంగా పని కూడా దొరకని పరిస్థితి వచ్చింది.

"గంగావతిలాగా ఎవరు లొంగకపోయినా వాళ్ళకు ఇక్కడ అదే పరిస్థితి ఎదురవు తుంది. అందులో సందేహంలేదు.

"ఆడవాళ్ళకు పనివ్వాలంటే తమతో పడు కోవాలని మేస్త్రీలు, కాంట్రాక్టర్లు బలవంతపె ట్టడం మీ అందరికీ తెలుసనుకుంటా" అన్నాడు.

అందరి మొహాలూ కళ తప్పాయి. అంద రికళ్ళూ నేలవైపుకు చూడసాగాయి.

"మీకు తెలిసీ సైలెంట్‌గా వున్నారంటే మీరు మీ ఆత్మాభిమానాన్ని చంపుకుని

# ఏరిన ముత్యాలు

★ మన తప్పులను గుర్తుకు తెచ్చుకున్నప్పుడు ఇతరుల తప్పులను మరచి పోగలుగుతాం.

—జాన్.ఎఫ్. కెనడీ

★ కృతజ్ఞత సంస్కారంనుంచి పుట్టిన ఫలం. సాధారణ ప్రజలలో ఈ ఫలాన్ని చూడలేం.

—శామ్యూల్ జాన్సన్

★ మంచి, చెడు కార్యాలవైపు లాక్కువెళ్ళేది మన మనస్సే.

—రామాయణం

★ బుద్ధిహీనుడి మనసును భగవంతుడు కూడా మార్చలేడు.

—భర్తృహరి

★ మనకి ఇష్టమైనది చేయడంగాక, మనం చేస్తున్నదాన్ని ఇష్టపడటమే కష్టపడి నేర్చుకోవలసిన పాఠం.

—బ్లాక్

★ అన్యాయానికి పాల్పడకుండా మీరు ఎంత ఖచ్చితంగా ఉన్నా తప్పులేదు.

—రూసో

★ అశాంతత, అసంతృప్తి ప్రగతికి అవసరమైన ప్రథమ అవసరాలు.

—ఎడిసన్

★ సంసిద్ధంగా ఉన్న మనసునే అదృష్టం వరిస్తుంది.

—లూయిస్ పాశ్చర్

★ చిరునవ్వులు చిందించలేని వ్యక్తి దుకాణం తెరవలేడు.

—చైనా సామెత

★ ప్రశ్నించేవాడు ఆ క్షణం మూర్ఖుడు. కానీ ప్రశ్నించలేనివాడు కలకాలం మూర్ఖుడు.

—రష్యా సామెత

★ అందమైనది మంచిగా ఉంటుంది. మంచిగా ఉన్నవాడు త్వరలో అందాన్ని పొందుతాడు.

—హెచ్.డి. నెల్స్

★ శరీరానికి వ్యాయామం లాంటిది మనసుకు అధ్యయనం.

—జోసెఫ్ అడిసన్

★ మీరు చేసేపని ఎప్పుడూ మధ్యరకంగా ఉండకూడదు. ప్రథమశ్రేణిగా ఉండాలి.

—హంట్

★ ఆత్మవిశ్వాసం నిజమైన సంతోషానికి గీటురాయి.

—మనువు

★ ఇతరులపై ఆధారపడకుండా మీమీద మీరే ఆధారపడండి.

—జాన్ డేవిడ్

సేకరణ: పి.వి.రమణకుమార్

బతుకుతున్నట్లే. ఒకసారి మనసుని చంపుకుంటే మళ్ళీమళ్ళీ చంపుకోవడం అంత కష్టమేమీకాదు. అందుకే మీ చెల్లెళ్ళను, తల్లులను, అక్కలను, పెళ్ళాలను మీముందే ఆ మేస్త్రీలు లోపలికి తీసుకువెళుతుంటే మీకు రోషం రావడంలేదు. చివరకు మీ పెళ్ళాల రికమెండేషన్‌తో మీరుకూడా పనులు ఇప్పించుకునే స్థాయికి దిగజారింది. అది మీ తప్పుకాదు. మీ పరిస్థితులది అని నాకు తెలుసు" అన్నాడు.

ఎప్పుడో చనిపోయిన ఆత్మాభిమానానికి అతను ఊపిరి పోయడంతో అక్కడివాళ్ళు లజ్జతో విలవిలలాడిపోయారు.

"ఈ పరిస్థితులను ఇలా ఎప్పటికీ భరిస్తూనే వుండాలా? " ప్రశ్నించాడు.

ఎవరూ మాట్లాడలేదు.

"ఇది నా సమస్యకాదు. మీ సమస్య. మీరు మాట్లాడకుంటే నేనేమీ చేయలేను" అన్నాడు మురళి.

"మనిషిగా పుట్టినోడెవడూ దీన్ని భరించాలనుకోడు సార్" అంటూ ముందుకొచ్చాడొక యువకుడు.

"నాకు తెలుసు సార్. ఆ మునిరెడ్డి మేస్త్రీ ఆయనకింద పనిచేసే ఆడవాళ్ళనంతా బలాత్కారం చేస్తాడు సార్. నేను చాలాసార్లు చూశాను. నేను అడ్డుకోబోయినందుకు ఆ పొద్దుట్నుంచి నన్ను కూలికి పిలవడంలేదు సార్" అన్నాడొక వ్యక్తి లేచి.

"మా చిన్నాయన మా చిన్నమ్మను బలాత్కారం చేయబోయిన కాంట్రాక్టర్‌ని చంపేసి జైలుకు బోయినాడు సార్" అన్నాడొకతను.

ఒక్కొక్కరుగా... ఒకరి తర్వాత ఒకరు చెబుతున్నారు.

ఇన్నాళ్ళూ ఎవరికీ చెప్పుకోనివి, చెప్పుకోలేనివి అన్నీ... అన్నీ... చెబుతున్నారు.

ఇన్నాళ్ళూ తమలోనే ఎవరికివాళ్ళు దాచుకుంటూ వచ్చిన బహిరంగ రహస్యాన్ని బహిరంగంగానే చెబుతున్నారు.

అందరి మాటల్నీ శ్రద్ధగా విన్నాడు మురళి.

అందర్నీ చెప్పనిచ్చాడు. తరువాత తను మొదలుపెట్టాడు.

"మీరు చెప్పినట్లు ఆ మేస్త్రీలు, కాంట్రాక్టర్ల ఆగడాలు ఇక కొనసాగించే ప్రసక్తిలేదు. అందుకు ఏంచేయాలి. తప్పు అని చెబితే కూలీ ఇవ్వరు. కొట్టినా, చంపినా పోలీసులు మనల్నే జైలుకు తోస్తారు.

"పోతే పోయాం జైలుకు అని చంపేద్దామనుకుంటే ఎంతమందినని చంపుకుంటూ పోతాం. మీరు చెప్పిన ప్రకారమైతే మేస్త్రీ అనేవాడ్నెవడ్నీ బ్రతకనివ్వకూడదు. అది పరిష్కారంకాదు. మరయితే ఏం చేయాలి" అన్నాడు.

వాళ్ళ దగ్గర సమాధానం లేదు. కొంతసేపు చూశాడు మురళి.

ఎవరూ మాట్లాడకపోయేసరికి "నేను చెబుతాను" అన్నాడు.

అందరి మొహాల్లోకి ఒక్కసారిగా కళ వచ్చింది.

సంతోషం, ఉత్సుకత, ఏదో తెలియని ధైర్యం. తాము నిస్సహాయులం కామనీ, తమకూ ఆసరా వుందన్న ధీమా అన్నీ ఒక్కసారిగా వాళ్ళలో ముప్పిరిగొన్నాయి.

"అయితే... నేను చెప్పినట్లు అందరూ ఖచ్చితంగా చేయాలి" అన్నాడు.

"చేస్తాం... చేస్తాం..." అంటూ కోరస్‌గా అరిచారు అందరూ.

దీన్ని చేయడానికి సాహసం కావాలి. చొరవ కావాలి. పట్టుదల కావాలి. త్యాగం చేయగలిగే గుణం వుండాలి. రేయింబవళ్ళు కష్టపడాల్సి వుంటుంది. అలాంటివాళ్ళు కనీసం ఐదారుమందైనా ముందు నిలబడగలగాలి. మీలో అలాంటి సత్తా ఎవరికుందో వాళ్ళు ముందుకు రండి అన్నాడు. అతని కంఠంలో గాంభీర్యం వాళ్ళలోని పిరికితనాన్ని తరిమికొడుతోంది. వాళ్ళకు తెలియకనే వాళ్ళలో ఆత్మవిశ్వాసం పెరిగిపో

తోంది.

అయినా అక్కడ పిన్‌డ్రాప్ సైలెన్స్ ఏర్ప డింది.

ఎవరు ముందుకొస్తారా అని మురళీ చూస్తున్నాడు.

అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసు కుంటూ వున్నారు.

తన ప్రయత్నం ఆదిలోనే అట్టర్‌ఫ్లాప్ అయ్యేట్లుందే. తను వీళ్ళనే మోటివేట్ చేయలేకపోయాడు. తను ఇంకేం సాధి స్తాడు. ఆలోచనలు సాగిపోతున్నాయి.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ముందుకొచ్చింది గంగావతి.

"నేను ముందుంటాను. ఏం చెబితే అది చేస్తాను. నా ప్రాణాలు పోయినా ఫరవా లేదు. నాకు జరిగిన సంఘటనలు, అవమా నాలు మరెవరికీ జరక్కూడదు" అంది.

ఆమె గొంతులోని స్థిరత్వం ఎలాంటివారి నైనా ఎదుర్కొనేలా వుంది.

ఆ మాటలు అక్కడివారి గుండెల్లో పుల కింతలు లేపాయి.

ఆ మాటలకు ఉత్తేజితుడైన రాంనారా యణ ముందుకొచ్చాడు.

ఆవేశంగా "సార్ ఏం చెబితే అది నేను చేస్తానని, దానికి నా ప్రాణాలైనా అర్పిస్తా నని ప్రతిజ్ఞ చేస్తున్నా"నన్నాడు.

ఒక్కసారిగా అక్కడున్నవారిలో కలకలం వచ్చింది. తాము కూడా అందుకు సిద్ధమని ప్రతిజ్ఞ చేయాలని చాలామందికి అనిపిం చింది. వెంకటేశు, చిన్నబ్బు, గోవిందులు ప్రతిజ్ఞలు చేశారు.

వరుసగా ఒక్కొక్కరే వస్తున్నారు. ముర ళీసార్ అగ్గిలో దూకమంటే ముందూవెనకా చూడకుండా దూకుతామంటూ శపథాలు చేస్తున్నారు.

ఆ దృశ్యాన్ని చూసి మురళీ చలించిపో యాడు.

వారిమాటలు అతని హృదయాన్ని ఆర్ద్రం చేశాయి. వాళ్ళకు తనమీదున్న అభిమానా నికీ, నమ్మకానికీ అతని కళ్ళలో నీళ్ళు తిరి గాయి. అశ్రువులు ఆగకుండా దూకేశాయి.

అతనిలోని బాధ్యత ఇప్పుడు రెండురెట్లు అయింది.

కళ్ళు తుడుచుకుని చెప్పడం ప్రారంభిం చాడు.

"చాలా సంతోషం. ఇక విజయం మనదే. ఇక ఏ శక్తీ మనల్ని ఆపలేదు. ఇంతమంది అవసరంలేదు. వీళ్ళలో కొంత మందిని ఎన్నుకోండి. వాళ్ళు ఈరోజునుండి కూలికిపోరు. కానీ మీ కూలీనుండి ప్రతి ఒక్కరూ ఒక్కొక్క రూపాయిని వారికి కేటా యించాలి. వాళ్ళు నేను చెప్పే పనిమీదనే వుంటారు. అనుకున్నది అనుకున్నట్లుగా జరిగితే మీ కూలీ కూడా రెండింతలవు తుంది" అన్నాడు.

అందరూ ఏకాగ్రతతో వింటున్నారు.

"ఎక్కడైనా ఎప్పుడైనా అణగదొక్కేవాడు ఒక్కడైతే, అణగదొక్కబడేవారు వందలు, వేలమంది వుంటారు.

"పరిస్థితులు అణగదొక్కేవాడికి ఆ అవకా శాన్ని ఇచ్చాయి. అతను తన ఇష్టానుసా రంగా నీలుగుతున్నాడు.

"కానీ బలవంతమైన సర్పం కూడా చలి చీమలచేత చిక్కి ఎలా చస్తుందో మీకు తెలి సిందే.

"అది ఎలా సాధ్యమయ్యింది...

"ఐకమత్యం!

"ఒకే ఒకటి ఐకమత్యం.

"మనమందరం ఒక్కటైతే ఎలాంటివా డ్నైనా తలకిందులు చేయవచ్చు" అని వివ రిస్తూ పోయాడు.

ఆపైన తన ప్రణాళికను విపులంగా సర ళంగా వాళ్ళకు అర్థమయ్యే రీతిలో తెలియ చెప్పాడు.

అందరూ నిశ్చేష్టులై విన్నారు. ఆనం దంతో వారి గుండెలు పగిలిపోయేలా వున్నాయి. అనుకున్నవి అనుకున్నట్లుగా... మురళీసార్ చెప్పినట్లుగా జరిగితే తమ జీవి

తాల్లోకి వెలుగు ప్రవేశిస్తుంది. తమ కష్టాలన్నీ తీరిపోతాయి. ఈ దరిద్రం వదిలిపోతుంది.

దిక్కుతోచని చీమలన్నిటికీ ఒక బాట ఏర్పడింది.

ఇప్పుడు ఆ చీమలకు పామును చంపే శక్తి వచ్చింది.



తన ప్రసంగం ముగించి అందరిదగ్గరా సెలవు తీసుకొని జీవకోననుండి బయలుదేరేసరికి పదకొండున్నర దాటింది.

"సార్... ఇంత రాత్రిపూట ఎక్కడ వెళతారుగానీ ఇక్కడే పడుకోండి. తెల్లవారాక వెళ్దురుగాని" అన్నాడు రాంనారాయణ.

"లేదు రాంనారాయణా. కొన్ని ఆర్టికల్స్ రాత్రికి రాయాల్సివుంది. ఎంత రాత్రయినా ఇంటికి వెళ్ళిపోవాలి" అని చెప్పి బయలుదేరాడు మురళీ.

మురళీకి తోడుగా రాంనారాయణ, వెంకటేశు, చిన్నబ్బు, గోవిందులు వచ్చారు.

తిరుపతిలో వున్న మిగతా కాలనీల్లోని కూలీలను ఎవరెవరు ఎప్పుడెప్పుడు కలవాలో చెబుతూ క్రాంతినగర్ దాటారు.

"సరే సార్. అలాగే చేస్తాం సార్" అన్నారు వాళ్ళు.

కొంత ముందుకు నడిచాక "నాకేం భయంలేదుగానీ, ఇక మీరెళ్ళి. పడుకోండి. నేను రేపు కలుస్తాను" అన్నాడు మురళి.

"ఫరవాలేదు సార్. మాకు అలవాటే. మిమ్మల్ని వదిలేసి వస్తాం" అన్నారు వాళ్ళు.

"మీరు రోడ్డుదాకా వచ్చి మళ్ళీ వెనక్కి రావడం ఎందుకు? నేను వెళ్ళగలను" అని చెప్పి బలవంతంగా వారిని నిలబెట్టేసి ముందుకు కదిలాడు మురళి.

అయిష్టంగానే వెనుదిరిగారు వాళ్ళు.

గబగబా అడుగులు వేయసాగాడు మురళి.

చలి పెడుతోంది.

చుట్టూ నిర్మానుష్యంగా వుంది.

దారి గుంతలు, మిట్టలుగా వుంది. జాగ్రత్తగా నడుస్తున్నాడు.

దూరంగా ఎవరో వస్తూ కనిపించారు. ఒకరుకాదు... ఇద్దరుకాదు... పదిమంది దాకా వున్నట్లున్నారు.

అరె... ముందు నడుస్తున్నది రాంపాద రెడ్డిలాగుందే. నో డౌట్... రాంపాదరెడ్డే!

జీవకోనలో ఇళ్ళస్థలాల్ని ఆక్రమించుకోవడానికి కొత్త ప్లాన్‌తో ఏకంగా రాంపాదరెడ్డే రంగంలోకి దిగినట్టున్నాడు.

తన ఆలోచనలు ముగియకముందే రాంపాదరెడ్డి దగ్గరకు వచ్చేశాడు.

"నమస్తే మురళీసార్!"

"నమస్తే" అన్నాడు మురళి పొడిపొడిగా.

"బావున్నారా సార్"

"వూ..."

ఇంత రాత్రిపూట ఎక్కడికో వెళ్ళివస్తున్నారే? "

"జీవకోనకి"

"పైసా ఆదాయం లేకుండా పనులు చేసే వాళ్ళను దద్దమ్మలనీ, మూర్ఖులనీ అంటారట నిజమేనా సార్? "

అది తననుద్దేశించి అంటున్నాడని తెలి

సినా సమాధానం ఇవ్వడం ఇష్టంలేక నిశ్శబ్దంగా వుండిపోయాడు మురళి.

"నాకు తెలుసు సార్. పేదలకు, కార్మికులకు కష్టాల్ని తొలగించేందుకు మీరు ఎన్నైనా కష్టాలు పడతారు. బహుశా మీరు పుట్టిందే అందుకననుకుంటాను" అన్నాడు రాంపాదరెడ్డి.

రాంపాదరెడ్డి మాటల్లో వ్యంగ్యం వుందేమోననిపించింది. అయినా అలా మాట్లాడ్డంలో అతని ఉద్దేశమేమిటో అర్థంకాలేదు. అతను కొనసాగించాడు.

"అందుకే... అందుకే మీరంటే నాకిష్టం సార్. నేనున్నాను చూడండి. నాకోసం, నా సుఖంకోసం అందర్నీ హింసిస్తాను. మరి మీరు అందరికోసం కష్టపడతారు. మీకు ఏమీకానివాళ్ళకోసం ఇలా అర్ధరాత్రి అపరాత్రి అనకుండా తిరుగుతున్నారు. చివరకు వాళ్ళకోసం ఒక హత్య కూడా చేయగలిగారంటే... నిజంగా మీరు చాలా గొప్పవాళ్ళు సార్" అన్నాడు రాంపాదరెడ్డి.

"నేనేమిటి, హత్య చేయడమేమిటి?" అన్నాడు మురళి అసహనంగా.

"మీరు అందర్నీ బోల్తా కొట్టించగల తెలివైనవాళ్ళే. రాజకీయ నాయకులను ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించగలవాళ్ళే. నేను మీ అంత చదువుకున్నోణ్ణి, తెలివితేటలు వున్నవాణ్ణి కాకపోవచ్చు కానీ అమాయకుడ్ని మాత్రంకాదు" అన్నాడు.

మురళికి అయోమయంగా అనిపించింది.

"ఆరోజు... సి.ఎం. వచ్చినరోజు, మా వాళ్ళు తాగి మాట్లాడుకుంటుంటే జీవకోనను తగలబెట్టబోతుంటే తెలుసుకుని, ఆ రాత్రి ఇక్కడే వుండి గుడిసెలన్నీ కాలిపోకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. మా వాళ్ళను తరుముకుంటూ వచ్చి దొరికిన వాడ్ని మీ దగ్గరున్న కత్తితో పొడిచి చంపేశారు. ప్రమాదవశాత్తూ చనిపోయినట్లుగా శవాన్ని గూటంపై వేసి తిరిగి వెళ్ళిపోయారు. ఈ విషయం ఎక్కడ ఇన్వెస్టిగేషన్‌లో తేలుతుందోనని అంత రాత్రిపూటే అందర్నీ ఒకచోట చేర్చి మీటింగ్ పెట్టారు. మీ తెలివితేటల్తో వాళ్ళని మాయచేసి జీవకోనకు అసలు కొత్త వ్యక్తెవరూ రాలేదని చెప్పించారు. పోలీసుల చెవుల్లో పువ్వుపెట్టారు. కానీ నా చెవిలో పెట్టలేరు సార్"

అతని మాటల్లో తాను చాలా తెలివైనవాడినన్న భావన వుట్టిపడుతోంది. విషయాలన్నీ తెలిసిన వ్యక్తి 'నేరుగా చూస్తే తప్ప' మిగతా అన్ని సందర్భాల్లోనూ తనను హంతకుడనే అనుకుంటారు. పోలీసుల ముందు తాను చెప్పినట్లు నడుచుకున్న వాళ్ళలోనే ఎవరో ఒకరు రాంపాదరెడ్డికి జరిగిన విషయాన్ని నాలుగింతలుగా చెప్పి వుంటాడు. దాని ఆధారంగా తనను హంతకుడని రాంపాదరెడ్డి అంచనా కట్టి వుంటాడు. అయినా ఇన్ని మాట్లాడిన వ్యక్తిని నిజం చెప్పి కన్విన్స్ చేయలేమనిపించడంతో మరోమాట మాట్లాడలేదు మురళి.

"నా మనిషిపైన చేయి వేసిన వాడినెవడినీ ఇంతవరకూ ప్రాణాలతో వుంచింది లేదు. అలాంటిది మీరు ఏకంగా నా మనిషినే చంపేశారు" అంటూ ఆగాడు రాంపాదరెడ్డి.

ఒక్కక్షణం గుండె లయతప్పింది మురళికి. అంటే తనని కూడా...

"అయినాసరే! మీరంటే నాకిష్టం. నేను మా అమ్మనూ ఇష్టపడలేదు. నాన్ననూ ఇష్టపడలేదు. కానీ అదేం విచిత్రమోగానీ మిమ్మల్ని ఇష్టపడ్డాను. అందుకే మీరు నా మనిషిని చంపినా మిమ్మల్ని చంపదలుచుకోలేదు" అన్నాడు.

హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాడు మురళి.

"కానీ..." అంటూ మళ్ళీ కొనసాగిస్తూ ఆపాడు రాంపాదరెడ్డి.

మురళి గుండె వేగంలో మళ్ళీ మార్పువచ్చింది.

"మీరు ఏకంగా గోపీనాథరెడ్డినే సారా కేసులో ఇరికించే ప్రయత్నం చేశారు" అన్నాడు.

మురళీ ఉలిక్కిపడ్డాడు ఆ మాటలకి.

"మీరు చేసిన పనివల్ల అతనిపై దుమారం లేచింది. పదవి ఊడింది. ఎలక్షన్ సీజన్ కదా ప్రతిపక్షాలవాళ్ళు బాగా వాడుకున్నారు దీన్ని. ఇప్పుడు పది, పదిహేను సీట్లలో ఓడిపోయే పరిస్థితి వచ్చింది"

వింటున్న మురళి ఊపిరి బిగపట్టాడు.

"ఈ విషయం పైవాళ్ళదాకా పోయింది. ఎంక్వైరీ చేయించారు. మీ పేరు బయటకొచ్చింది. మీ గురించి ఇప్పటివరకు పార్టీకి జరిగిన నష్టాన్ని అంచనా వేశారు. ఇప్పటికే ఇద్దరు ముగ్గురు పెద్దవాళ్ళు మిమ్మల్ని శాశ్వతంగా అడ్డు తొలగించాలని కోరి వున్నారు. ఇప్పుడు వాళ్ళో నిర్ణయం తీసుకున్నారు" అన్నాడు.

తానెంత ప్రమాదంలో ఇరుక్కున్నదీ అర్థమయ్యింది మురళీకి.

"ఆ పెద్దలు ఆ పనిని నాకే అప్పజెప్పారు. అంత పెద్దోళ్లు చెప్పాక కూడా చేయకపోతే తప్పైపోతుందికదా" అన్నాడు రాంపాదరెడ్డి.

అప్పటికే రక్తం గడ్డకట్టిపోయినట్లు నిలబడిపోయివున్నాడు మురళీ. తను చేసిన పని తన ప్రాణాలపైకే తెచ్చింది. తను చేసింది తప్పా ఒప్పా అని ఆలోచించుకునే సమయం కాదిది. జరిగింది జరిగిపోయింది. ఇప్పుడు ఏంచేయాలి అనుకుంటూ చకచకా ఆలోచించసాగాడు.

"ఆ పని నాకప్పగించినప్పుడు నేను చాలా బాధపడ్డాను. మిమ్మల్ని చంపకుండా వదిలేద్దామనుకున్నాను" అన్నాడు రాంపాదరెడ్డి.

మురళీ ఆలోచనలు ఆ మాటలతో ఒక్కసారిగా ఆగిపోయాయి. అంతలోనే ఏవో సందేహాలు కలిగాయి.

"చెప్పినపని చేయకపోతే వారితో నాకున్న సంబంధాలు దెబ్బతింటాయి. నా అభివృద్ధంతా ఆగిపోతుంది. నేను కావాలనే చెప్పిన పనిచేయలేదని తెలిసిందనుకోండి. నన్ను ఏదో ఒక కేసులో ఇరికించి లోపలేయించడమో, లేక నన్నే లేపేయడమో ఖచ్చితంగా చేస్తారు. అంతజేసీ మిమ్మల్నేమైనా వదిలేస్తారా అంటే ఆ ప్రశ్నేలేదు. వాళ్ళు అంతటివాళ్లు కాగలిగారంటే చిన్న పామునైనా పెద్దకర్రతో కొట్టి చంపుతూ రావడం వల్లనే. కాబట్టి..." అంటూ ఆగాడు.

అప్పటికే మురళి అయోమయ పరిస్థితిలోకి వెళ్ళిపోయివున్నాడు.

చురుగ్గా ఆలోచించే అతని మనస్సు హిప్నటైజ్ అయినట్లుగా స్థబ్దతలోకి జారిపోతోంది.

స్పష్టంగా చెప్పాడు రాంపాదరెడ్డి, "నేను మిమ్మల్ని చంపేస్తున్నాను సార్"

నిస్సహాయంగా అటూఇటూ చూశాడు మురళి.

అప్పటికే రాంపాదరెడ్డి అనుచరులు మురళి చుట్టూ వలయాకారంలో నిలబడి వున్నారు. అందరి చేతుల్లోనూ కత్తులు కనిపిస్తున్నాయి. పారిపోయే అవకాశం లేదు. అయినా ఓ ప్రయత్నంచేస్తే...

"తప్పించుకు పోవాలనుకుంటున్నారా సార్?"

మురళి అతని కళ్ళలోకి చూశాడు దొరికిపోయినట్లుగా.

"నేను సినిమాలు ఎక్కువ చూస్తాను సార్. ఈ డైరెక్టర్లు ఎప్పుడూ నిజంగా జరగనివే చూపిస్తుంటారు ఎందుకో. ఏ విద్యలూ తెలియకపోయినా హీరో పది, ఇరవైమంది రౌడీలను చావగొట్టేస్తూ వుంటాడు. ఎన్ని తుపాకీ గుండ్లు కాల్చినా హీరోకి తగలవు. హీరో కాలిస్తే మాత్రం ప్రతి షాట్‌కూ ఒక్కొక్కరు చచ్చిపోతూ వుంటారు. ఇప్పటివరకు నేను పధ్నాలుగో, పదిహేనో హత్యలు చేసి వుంటాను. అదే

మిటో ఒక్కసారి కూడా ఒక్కరంటే ఒక్కరు కూడా తప్పించుకోలేకపోయారు. ఇప్పుడు మీరు కూడా..." అంటూ కళ్ళు మూసుకున్నాడు రాంపాదరెడ్డి.



నాలుగుకాళ్ళ మండపం

సమయం ఆరున్నర కావస్తోంది.

వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

నాగరాజు మేస్త్రీ అక్కడకు చేరుకునేసరికి కూలీ జనం ఓ షెడ్‌లో బెంచీలమీద కూర్చుని వున్నారు.

వాళ్ళందరూ ఉతికి శుభ్రంగా ఉన్న దుస్తులు వేసుకొని వున్నారు. అందరూ అప్పుడే స్నానం చేసివచ్చినట్లుగా ఫ్రెష్‌గా వున్నారు.

ఎవరి కళ్ళలోనూ నిరాశలేదు. లేటవుతుందేమోనన్న విసుగు తప్పించి ఎలాంటి అసహనమూ లేదు.

అందరూ క్యూలో నిల్చుని వున్నారు.

అవతల సుమారు ఇరవై, ఇరవై అయిదు ట్రాక్టర్లు, లారీలు వరుసగా నిలిపివున్నాయి.

నాగరాజు ట్రాక్టర్ దిగి, ట్రాక్టర్‌ని ఒకపక్కగా ఆపమని డ్రైవర్‌కు చెప్పి ముందుకుపోయాడు.

"చెప్పేది మీక్కాదూ... క్యూలో నిల్చోండి" అంటూ కాంట్రాక్టర్లను అదిలిస్తోంది నెల్లెమ్మ.

అక్కడున్న క్యూని చూసి నాగరాజు గుండె లబలబలాడింది. క్యూ మొత్తం పూర్తయ్యేసరికి గంటన్నర దాటేట్లుంది. అంటే ఎనిమిది దాటుతుంది. కూలీలను పికప్ చేసుకుని వెళ్ళేసరికి పదవుతుంది. వాళ్ళు పనిలోకి దిగేసరికి పదిన్నర దాటుతుంది. కూలీలు మధ్యాహ్నం ఓ గంట చేతులెత్తేసి, కాళ్ళారేసేస్తారు. ఇలా జరిగితే తన పని అయిపోయినట్లే! ఛ... ఛ... ఎంత తొందరగా బయలుదేరదామన్నా లేటయిపోయింది అని తనని తనే తిట్టుకుంటూ వెళ్ళి క్యూలో నిల్చున్నాడు.

క్యూ మొదట్లో ఒక ఆఫీసువుంది.

ఆఫీసు ద్వారంపైన వున్న బోర్డులో "మురళీ కన్సల్టెన్సీ" అనివుంది. దానికిందనే 'సంఘం శరణం గచ్ఛామీ' అని పెద్ద అక్షరాలతోనే రాసుంది.

ఆ ఆఫీసులోకి అడుగుపెట్టగానే అచ్చం బ్యాంకుల్లోలాగా కౌంటర్లున్నాయి.

మొదటి కౌంటర్లో ఓ మహిళ కూర్చొని వుంది.

నాగరాజు వంతు వచ్చింది.

చకచకా వెళ్ళి కౌంటర్ ముందు నిలుచున్నాడు. ఆమె ప్రశ్నిస్తుంటే ఒద్దికగా సమాధానాలు చెప్పసాగాడు.

"పేరు?"

"నాగరాజు"

"పని?"

"బిల్డింగ్‌వర్క్"

"ఎంతమంది కూలీలు కావాలి?"

"పదహారుమంది"

"ఆడవాళ్ళెంతమంది? మగవాళ్ళెంతమంది?"

"వీళ్ళెనిమిది, వాళ్ళెనిమిది"

"అడ్రస్?"

అతను చెబుతూ తలెత్తిచూశాడు.

అక్కడ పెద్ద ఫొటో ఫ్రేమ్ కట్టిపెట్టి వుంచారు. దానికి అప్పుడే వేసినట్లు మల్లెపూలమాల కళకళలాడుతోంది. ఆ ఫొటోలోని

వ్యక్తి చిరునవ్వులు చిందిస్తున్నాడు.

ఆ ఫొటోకిందగా 'మురళి' అని రాసుంది.

"మహానుభావుడు మా తల రాతల్ని మార్చేశాడు" అనుకున్నాడు నాగరాజు కసిగా.

అప్పుడు... ఆ క్షణంలో...

"ఆడముండలకు అధికారమిస్తే మనబతుకి ట్లాగే ఉంటది" అంటూ సణుగుతున్న ఓ కాంట్రాక్టర్ చెంప పేలిపోయింది.

కొట్టింది అక్కడ చెత్త ఊడ్చే స్త్రీ.

"మాటలు మర్యాదగా రానీ. నోటిలో మాటలు నోట్లోనే వుంచుకోకపోతే నాలుక కోసేయాల్సి వుంటుంది" అంది హెచ్చరిస్తున్న ట్లుగా.

అతను కుయ్...కయ్... మనలేదు.

నిశ్శబ్దంగా తలవంచుకున్నాడు.

అతనికి తెలుసు తను ఏంమాట్లాడి, గొడ వచేసినా తనకే నష్టమని.

సంఘాన్ని కాదని ఏఒక్క కూలీ కూడా పనికి రారు. రెండింతలు. కూలీ ఇస్తామన్నా ఒక్కడూ రాడు. పల్లెలనుండి తీసుకువద్దామా అంటే సంఘమోళ్ళు పట్టుకు తంతారు.

సంఘమోళ్ళతో పెట్టుకుంటే తను కాంట్రాక్టు తీసుకున్న పని పూర్తికాదు.

ఆపైన తను కాంట్రాక్టర్‌గా మనలేడు.

నాగరాజు ముందుకు జరిగి, పక్కనున్న కౌంటర్ దగ్గరకు వెళ్ళాడు. అక్కడున్న స్త్రీ 'ఎంతమంది' అని అడిగింది.

చెప్పాడు నాగరాజు.

ప్రభుత్వ లెక్కల ప్రకారం కనీస వేతనం లెక్కగట్టి, అదనంగా సంఘం కమీషన్, ఆఫీసు ఛార్జీల కింద పదిహేను రూపాయలు కలిపి అమౌంట్‌వేసి ఒక స్లిప్‌ను అతనికి చ్చింది.

దాన్ని తీసుకుని ముందుకు కదిలాడు.

అక్కడ మరో కౌంటర్ వుంది.

ఆ కౌంటర్‌లోవున్న స్త్రీ, ఒక ప్రింటెడ్ ఫార మ్‌ను అతని ముందుకు తోసింది. అందులో తను తీసుకువెళుతున్న కూలీల పేర్లు వున్నాయి. వారిలో ఎవరికి ఏ ప్రమాదం జరిగినా సకల వైద్య సదుపాయాలూ తామే భరిస్తామనీ, ప్రమాదవశాత్తు మరణిస్తే ఎక్స్ గ్రేషియా చెల్లిస్తామనీ, ఆడవాళ్లకు ఇతరుల వల్ల మాటలతోగానీ చేతలతోగానీ ఎటువంటి ఇబ్బంది కలిగించినా వారిపై ఎటువంటి అత్యాచారయత్నాలు జరిగినా దానికి పూర్తి బాధ్యత తమదేనని ఒప్పుకుంటున్నట్లు వుంది.

కింద కాంట్రాక్టర్ అని వున్న చోట సంతకం చేశాడు నాగరాజు.

ఆ ఫారమ్‌ను ఆమె వెనక్కి తీసుకుని ఫైల్ చేస్తుండగా నాగరాజు ముందుకు కదిలాడు.

అక్కడున్న చివరి కౌంటర్లోని స్త్రీ చేతికి, రెండో కౌంటర్‌లో ఇచ్చిన స్లిప్‌ను ఇచ్చి అందులో వేసివున్న అమౌంట్ చెల్లించాడు.

ఆ డబ్బు తీసుకుని స్లిప్‌పై పెయిడ్ అని ముద్రవేసింది అక్కడున్నామె. ఆ స్లిప్‌ను అత నికి తిరిగి ఇచ్చివేస్తూ దానికి తోడుగా మరో పేపర్‌ను అతనికిచ్చింది.

అందులో రకరకాల పనుల్లో ఆరితేరిన కూలీల పేర్లు ఏ సమయానికి వాళ్లు సిద్ధంగా వుంటారో వంటి వివరాలన్నీ పొందుపరచ బడి వున్నాయి.

ఆ షీట్ తీసుకుని హమ్మయ్య ఒక పని అయిపోయింది అనుకుంటూ బయటపడ్డాడు నాగరాజు.

తలొంచుకుని బయటకు వెళుతున్న నాగ రాజుమేస్త్రీని చూస్తూ వున్న చివరి కౌంటర్ లోని స్త్రీ పెదాలపై విజయదరహాసం వెలి సింది. ఆమె గంగావతి.

★ ★ ★

ప్రతి మగాడి విజయం వెనుకా ఒక స్త్రీ వుంటుంది.

ప్రతి మహిళాభ్యుదయ మజిలీ వెనుకా ఒక మగవాడుంటాడు.

ఇప్పుడు ఇక్కడ కూడా అలాంటివాడే వున్నాడు. కానీ ప్రాణాలతోకాదు.

అతను మురళీ.

ప్రతి సమస్యకూ పరిష్కారం వుంటుంది.




దాన్ని పట్టుకోగలిగే వాళ్లు కొంతమందే వుంటారు. కానీ ఆచరణలో పెట్టడం అందరికీ సాధ్యం కాదు.

"మురళీ తన మేధస్సునంతా ఉపయోగించి శీలాన్ని పెట్టుబడిగా పెట్టి కూలి సంపాదించుకోవాల్సిన దుస్థితినుంచి పేదకూలీలను బయటపడవేయడానికి ఈ పథకానికి రూపకల్పన వేశాడు, దాన్ని ఆచరణలోకి తేవాలని ఆరాటపడ్డాడు.

"అయితే మురళీ అనుకున్నంత సులువు కాదు దాన్ని ఆచరణలో పెట్టడం. అందుకు కారణం అతనికి అర్థబలం గానీ అధికార బలంగానీ ఏమీలేవు.

"మురళీ ఆయుధం ఒకటే. ఐకమత్యం. దాని బలం చాలా గొప్పదే. అయితే మనుషల్నందర్నీ ఒక్కటిగా వుంచడం, ముఖ్యంగా పేదలను ఒకే మాటపై నిలబెట్టి, ఒకే బాటలో నడపడం దుస్సాధ్యం.

"ఐకమత్యంగా వున్న పేదలను చీల్చడానికి పాలకులు, కాంట్రాక్టర్లు, ధనవంతులు, అధికారులూ అందరూ ప్రత్యక్షంగానూ, ఐక్యంగా పరోక్షంగానూ నడుం కడతారు.

"వాటన్నిటినీ తట్టుకుని మురళీ తన లక్ష్యాన్ని చేరుకునేవాడో లేదో? లక్ష్యాన్ని చేరకముందే బలైపోయాడు.

"కానీ మురళీ వ్యక్తిత్వం..అతని పథకాన్ని ఆచరణసాధ్యం చేసింది.

"విశిష్టమైన, విలక్షణమైన, పరులకోసం ప్రాణాలను సైతం ధారబోయగలిగే అతని వ్యక్తిత్వాన్ని చూసి మేమంతా దాన్ని ఆచరణలోకి తెచ్చాం" అంటోంది గంగావతి కొత్తగా వచ్చిన ఒక మహిళా కూలీతో. ★

**అంకితం**

స్వేచ్ఛ, నమ్మకం రెక్కలుగా ఇచ్చి
ఆకాశమంత ఎత్తు ఎదగాలని
తపించే అమ్మా, నాన్నలకు...

# 'ధైర్యం' పై సమీక్షలు

జూన్ 'చతుర' లో ప్రచురితమైన మునిపల్లె లక్ష్మీరమణకుమారి 'నవల' 'ధైర్యం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## ధైర్యానికే ధైర్యం...

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

జీవితంలో ధైర్యం అవసరమని చెప్పయత్నించిన నవల 'ధైర్యం'. రచయిత్రి కొన్ని పాత్రల్ని యింకా మెరుగులుదిద్ది ప్రస్తుతీకరించి ఉండాల్సింది.

పెద్దచెల్లి శిరీష పట్ల కుటుంబ సభ్యుల అజాగ్రత్త ఆమె చావుకి దారితీసినా చిన్నచెల్లి లలిత పట్లనైనా జాగ్రత్త పడలేదు విజయానంద్.



ఆనంద్‌గా పరిచయం చేసుకొని ప్రేమలో విఫలమై ఆత్మహత్యకి పాల్పడిన కమలినికి ఎవరి కథో వినిపించినట్లుగా తన పరిధిలో కలిగిన మృత్యువాతాగాథలు చెపుతాడు. వాటితో హడలిపోయి కమలిని మృత్యువే శరణ్యమనుకునే భ్రమ నుంచి బయటపడింది తప్ప ఆమెకు ధైర్యం గురించి చెప్పినట్లెలా అయింది.

పైగా శిరీష, లలిత, అమూల్య అన్నావదినలు, అమూల్యాల అసహజ ఆత్మహత్యలు- ధైర్యంగా ఎదుర్కొని జీవితాన్ని సాగించవచ్చన్న నిజానికి వ్యతిరేకంగా ఉన్నాయి.

డిప్రెషన్ నుండి కోలుకుంటున్న శిరీష భర్తని కానిపరిస్థితిలో చూచి అప్‌సెట్టై ఆత్మహత్య చేసుకొనే బదులు ఓ వగలాడితో వగలు బోతున్న భర్తని ధైర్యంగా ఎడాపెడా వాయించి వెనుదిరిగినట్లు చూపెడితే ధైర్యం గురించి చెప్పినట్లయ్యేది.

సాహసి, ధైర్యానికి మారుపేరుగా నవల మొదట్లో పరిచయమైన లలిత ఆత్మహత్య కథకి అతికినట్లుగాలేదు. గర్భవతియై ధైర్యంగా అబార్షన్‌కై వెళ్ళి డాక్టర్‌తో బేరం కుదరక సతమతమౌతున్న చెల్లిని ఆ స్థితిలో ఆదుకోక విజయ్ మరునాటికి వాయిదా వేస్తాడు. పర్యవసానంగా తండ్రి కోపానికి భయపడి అధైర్యంగా ఆత్మహత్య చేసుకుంటుంది లలిత. దానికి బదులు ధైర్యంగా నిలబడి తానే సమస్యా పరిష్కారం చేసుకుని ఉన్నట్లైతే రచయిత్రి ధైర్యం గురించి చెప్పినట్లయ్యేది.

అమూల్యాల అన్న వ్యాపారంలో మోసపోయి ఐ.పి.కి అప్లై చేయకుండా ధైర్యంగా ఆస్తిపాస్తుల నమ్మి ఋణముక్తుడౌతాడు. కాని ఆనక అధైర్యంగా భార్యతోసహా ఆత్మహత్య

చేసుకుంటాడు. మరి 'ధైర్యం' ఎక్కడ?

అమూల్య-విజయ్‌ల ప్రణయం కాస్తా పరిణయంగా మారుతున్న తరుణంలో అన్నావదినల మృత్యువుతో అమూల్య జీవితం తలకిందులయింది. సమాజం భీతితో తండ్రి విజయ్‌ని కాదని ఆమెకు వేరే వివాహం చేస్తాడు. అదీ విడాకులదాకా వెడుతుంది. ఆ స్థితిలో తండ్రి మరణం... విజయ్ సహకారం... అయినా అతనికి దూరంగా వెళ్ళి ఉద్యోగంతో బతుకు. అక్కడా పురుష పురుగుల ఆగడాలు. అయినా ధైర్యంగా ఎక్కడా ఆగకుండా జీవితయానం. అయితే చివర్లో విజయ్ తల్లి రంగమ్మ శాపనార్థాలకి వెరిచి విజయ్ జీవితానికి తానే అడ్డంకి అని తలచి అమూల్య అధైర్యంగా ఆత్మహత్య చేసుకుంటుంది. దానికి బదులుగా ధైర్యంగా అన్నిటా బాసటగా నిలిచిన విజయ్‌నే చేసుకుని వుంటే నవల నామధేయం 'ధైర్యం'కి సార్థకత ఏర్పడేది.

అసలు కమలిని పాత్రే నవలకి అనవసరం. పేజీలకి సరిపడా రాయాలనే తాపత్రయం పక్కనపెట్టి కమలిని పాత్ర లేకుండానే నేరుగా విజయానంద్ కథ సాగించి అమూల్యతో చివరి స్థితిలో కలిపి ఉంటే ధైర్యానికి అమూల్య విజయం ఆపాదించినట్లయ్యేది. 'ధైర్యం' గూర్చి చెప్పినట్లయ్యేది.

-ఎన్. నారాయణరావు

హైదరాబాద్ 500 074

## పాత సినిమా కథ

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

కథలో కొత్తదనం లేదు. కథ నడిపించిన తీరు కూడా ఏమంత గొప్పగా లేదు. నవల మొత్తం చదివిన తరువాత ఒక పాత సినిమాను మళ్ళీ గుర్తుతెచ్చుకున్నట్టుగా ఉంది. ప్రపంచంలోని కష్టాలన్నీ హీరో హీరోయిన్లకే వస్తాయి పాపం! ఒక నవల పూర్తి కావాలంటే ఓ పది పన్నెండు హత్యలు, ఆత్మహత్యలు ఉండాల్సిన అవసరం లేదనుకుంటాను.

ఇక ధైర్యం అనే పేరు చూస్తే హీరో, హీరోయిన్లు చూపిన ధైర్యం ఏమీ లేదు నవలలో. పోనీ ఆత్మహత్య చేసుకునేవారికి ధైర్యం చెప్పడం అని అర్థం చెప్పుకుంటే ఆత్మహత్య చేసుకునేవారిని రక్షించి ధైర్యం చెప్పిందీ లేదు. పేదవాళ్ళు సడన్‌గా కోటీశ్వర్లు కావడం, కోటీశ్వర్లు సడన్‌గా పేదవాళ్ళు కావడం సినిమాల్లోని జిమ్మిక్కులు. అదేవిధంగా అమూల్యా వాళ్ళు సడన్‌గా పేదవాళ్ళు కావడం, ఎంతో సంస్కారవంతులు, ధైర్యవంతులు అయిన ఆమె అన్నా వదినలు ఆత్మహత్య చేసుకోవడం కూడా వాస్తవానికి దూరంగా ఉంది. అదేవిధంగా విజయ్ సోదరి శిరీషను ఒంటరిగా, రాత్రిపూట భర్త దగ్గరకు పంపడం కూడా అవాస్తవంగా ఉంది. అసలు ఆడపిల్లను ఒంటరిగా కాపురానికి పంపరు. అందునా మానసికంగా అప్పుడప్పుడే కోలుకుంటున్న పిల్లను అసలు ఒంటరిగా పంపరుగదా!

చివర్లో విజయ్ తన పేరు మార్చుకొని ఆనంద్‌గా చెప్పుకొని తర్వాత తన పేరు విజయానంద్ అని చెప్పడం కూడా అనవసరం. అదేదో నవలలో సస్పెన్స్ అనుకొని ఉంటారు. మానసికంగా కృంగిపోయి ఆత్మహత్యకు పూనుకునేవారికి ఆ సమయంలో ఎవరయినా ధైర్యం చెబితే తిరిగి వారికి జీవితంమీద ఆశ కలుగుతుంది అనే విషం చెప్పాలనుకుని రచయిత్రి చాలా కష్టపడ్డారు.

-డి. హేమలత

విజయవాడ-9

## కంట తడిపెట్టిస్తుంది

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'ధైర్యం' నవలద్వారా రచయిత్రి నేటి సమాజంలో జరుగుతున్న, మనం వింటున్న, చూస్తున్న సంఘటనలకు యధార్థరూపాన్ని

కల్పించారు.

ప్రేమలోని వివిధ దశలని ఉదహరిస్తూ, ప్రేమ అనేది ఆకర్షణ నుండి మొదలై గుండె నిండా పరిపూర్ణంగా నిండుకొని, అది ప్రేమించిన వారికే కాక తనతోటివారికి, చుట్టూ ఉన్న ఎందరికో పంచగల విశ్వజనీనమైన ప్రేమగా అవతరిస్తుందనే భావాన్ని చాలా హృద్యంగా చిత్రీకరించారు.

డబ్బున్న అమ్మాయిని ప్రేమించగా ఏమాత్రం అడ్డు చెప్పని విజయ్ అమ్మ, నాన్న ఆ డబ్బు పోగానే నష్టజాతకురాలంటూ నింద వేసిన వైనాన్ని చూస్తే ప్రపంచంలో డబ్బుకున్న శక్తిని, అది ఆడించే ఆటని తెలుపుతుంది.

ఒక మంచి ప్రేమికుడుగా స్నేహితుడిగా ఇతరుల కష్టాలలో ఆదుకొనే వ్యక్తిత్వంగల యువకుడిగా విజయ్ పాత్ర చాలా బాగుంది.

అష్ట ఐశ్వర్యాలలో పుట్టి పెరిగినా ఏమాత్రం గర్వం, దర్పం, అహంకారం లేని అద్భుత సౌందర్య రాశి 'అమూల్య' చివరికి అన్నీ పోగొట్టుకొని అందరి ఛీత్కారాలను తట్టుకోలేక చివరికి తన ప్రియుడి సుఖంకోసం తాను సమిధ అయ్యే సంఘటన ఎటువంటి వారికైనా కంటతడి పెట్టించక మానదు.

'బ్రహ్మకైనా పుట్టు రిమ్మ తెగులు' అనే సామెతను నిజంచేస్తూ తాను తండ్రిలాంటివాడని నమ్మిన మామయ్యే తనను కోరుకోవడం సమాజంలో ఒంటరి ఆడదాని పరిస్థితికి అద్దంపడుతుంది. అమూల్య అత్తయ్య, రంగమ్మ పాత్రలు స్త్రీజాతికే అవమానం కలిగిస్తాయి.

ఒంటరి స్త్రీకి సమాజంలో రక్షణలేదు. ఆఫీసుల్లో కష్టపడి పనిచేసే స్త్రీలు ఏవిధంగా పైకి చెప్పుకోలేని, ఎవరికీ అనుమానమైనా రాని రీతిలో లైంగిక హింసకు తద్వారా మానసిక హింసకు బలి అవుతున్నారో రచయిత్రి చిత్రించిన వైనం వాస్తవ పరిస్థితులను ప్రతిబింబిస్తుంది. మానవ రూపంలో ఉన్న మృగాలు చేసే అకృత్యాలు, వాటికి బలిఅవుతున్న అమూల్యలాంటి అమాయకపు ఆడపిల్లలు ఎందరో.

చావు ఒక్కటే సమస్యకు పరిష్కారం కాదని చివరకు విజయ్ పాత్రద్వారా రచయిత్రి చక్కటి సందేశాన్ని ఇచ్చారు. ఇది పాఠకులను బాగా ఆలోచింపచేస్తూ సమాజంపట్ల తమ బాధ్యతను గుర్తించేలా చేస్తుంది.

–మాధవీలత మంత్రవాది
విజయవాడ

# అసమంజసం

*(నాలుగవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

ఒక అబద్ధం కప్పిపుచ్చుకోడానికి, మరికొన్ని అబద్ధాల అవసరం తప్పదని పెద్దల మాట. కానీ ఒక ఆత్మహత్య ఆపడంకోసం వరుస క్రమంలో ఆత్మహత్యలను వాడుకోవడం సమంజసం కాదు.

ప్రేమకథలు విషాదాంతం అయిన ఉదాహరణలు ఎన్ని ఉన్నా ప్రేమికుడో, ప్రేయసియో లేదా ఇద్దరూ ఆత్మహత్య చేసుకోవడం లేదా వారి ప్రేమను ఇష్టపడని పెద్దలచేత చంపబడటమో చరిత్రలో ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి. కానీ ఒక ప్రేమ కథ బ్యాక్‌గ్రౌండ్‌గా ఉన్న నవలలో సామూహిక ఆత్మహత్యలను పాఠకలోకానికి అందచేసి మునిపల్లె లక్ష్మీ రమణకుమారిగారు తన 'ధైర్యం' నిరూపించుకొన్నారు.

ఆత్మహత్యల పరంపరకూడా అసమంజసం అని రచయిత్రిగారే 'నా దృష్టిలో ఎవరిదీ సహేతుకమైన కారణం కాదు' అని కమలిని చేత అనిపించి అందుకు తగిన కారణాలు చెప్పించారు. అదేవిధంగా 'చాలా శాతం ఆత్మహత్యలు ఆవేశంలో తీసుకున్న నిర్ణయాలే అయి ఉంటాయి. కొంచెం ఆగి ఆలోచిస్తే వాళ్ళు ఆ పని చేయరు. కానీ వాళ్ళకు ఆ అవకాశం ఎక్కడుంటుంది? డిప్రెషన్‌లో ఉండి కృంగిపోయి ఎలా చచ్చిపోదామా అని చూసే

వాళ్ళకు తీరిగ్గా ఆలోచించాలని ఎలా తడు తుంది' అని విజయ్‌చేత అనిపించడం చూస్తుంటే ఆత్మహత్యలమీద సహేతుకమైన పరిశోధన రచయిత్రి చేసి వుండవచ్చునని అనిపించకపోదు.

ఒక విషయంలో రచయిత్రిగార్ని అభినం దించాలి. కథకు ఏమాత్రం సరిపోని బ్యాక్ గ్రౌండ్, అందులోని మలుపులు, ఆత్మహ త్యలు చోటుచేసుకొన్నా తనదైన శైలిలో కథా గమనానికి లోటు చేయలేదు.

–యస్. హరనాథబాబు
హైదరాబాద్- 500 044

## ఆత్మహత్యల నవల

*(అయిదవ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

**ము**నిపల్లె లక్ష్మీరమణకుమారి నవల 'ధైర్యం' పూర్తిగా ట్రాజెడీగా నడచినా చివర్న మాత్రం ఆత్మహత్య చేసుకోవడం ద్వారా కాక పరిస్థితు లను ధైర్యంగా ఎదుర్కోవాలనే సందేశంతో ముగిసింది.

ఇదొక సాధారణ ప్రేమకథలా మొదలై, ముప్ఫయ్ శాతం పూర్తయ్యాక, దిశ మారి ఆత్మహత్యల పరంపరగా రూపుదిద్దుకుంది. ఒక స్త్రీ పాత్ర పుట్టింట, ప్రేమికుని ఇంట వరుసగా ఆత్మహత్యలు కొనసాగి చివరికి ఆవిడ కూడా ఆత్మహత్య చేసుకోవడంతో కథ ముగిసింది. కథలో ఒకచోట ప్రస్తావన వచ్చి నట్టు ఇది ఓ 'నష్టజాతకురాలు' లేదా 'నష్టజా తకుని' కథేమో అనిపించేలా తయారైంది.

అకారణ భయాలతో ఒకరు, విచ్చలవిడిగా తిరిగి కడుపు తెచ్చుకుని ఒకరు, వ్యాపారంలో దివాళా తీశామని ఓ జంట, మంచి పరిణతి చెందిన మనస్కురాలుగా కనిపించినా, ఎక్కడా ధైర్యం చేయలేక, కేవలం కులం కార ణంగా ఒక అనారోగ్య తండ్రి మాటకు కట్టు బడి తెలివితక్కువగా ఓ మోసగాణ్ణి కట్టుకుని, తదనంతరం ఎదురైన కష్టాలవల్ల ఓ యువతీ... ఇలా అందరూ చావును వెదు క్కుంటూ పోవడమే కనిపిస్తుంది. వీటన్నిం టిని మూగవాడిలా చూస్తూ, క్రుంగిపోతూ చావాలా వద్దా అనుకుంటూనే చివరిదాకా బతికి, మరొకర్ని చావకుండా కాపాడింది కథానాయకుడొక్కడే.

సమకాలీన సమాజంలో బతుకుతూ చదువూ, విశాల దృక్పథాలూ, చాలినంత డబ్బు, తెలివీ, ఆలోచించగల సామర్థ్యం కలి గిన ఈ పాత్రలన్నీ... అతి చిన్న, అసంగ తంగా కనిపించే కారణాలకు వరుసగా మృత్యువును ఆశ్రయిస్తూ పోవడం చూస్తే, ఆత్మహత్యలు ఒక మాస్ హిస్టీరియా అని కొందరు మానసిక శాస్త్రజ్ఞులు చెబుతున్న అభిప్రాయం నిజమేమో అనిపిస్తుంది. పరిస్థి తులు విషమిస్తే, ధైర్యంగా పోరాడి బతకాలి, ఆవేశంగా నిర్ణయం తీసుకోకూడదు అని చెప్ప డానికి ఇంత నెగిటివ్ ఘటనలతో కూడిన కథ అల్లనవసరం లేదేమో! వివిధ స్వల్పకార ణాలతో ఆత్మహత్యలు ఎలా జరుగుతుంటా యని చెప్పదలిస్తే అవన్నీ ఒకే పాత్ర చుట్టూ జరిగాయని చిత్రీకరించడం అసంబద్ధంగానే అనిపిస్తుంది.

కథానాయకుడు విజయ్, అమూల్యలు ప్రేమించుకొని, పెళ్ళికి అందరూ అంగీకరిం చాక కూడా వృథాగా కాలయాపన చేస్తూ పెళ్ళిచేసుకోకుండా వున్నది... ఈ ఆత్మహత్య లన్నీ జరగడానికా అనిపిస్తుంది చివరికి.

–కె. నాగేశ్వరరావు
నెల్లూరు-524 002

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060 ; Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78






అసలైన రుచికి
సిసలైన జోడింపు
# ప్రియా మసాలాపేస్ట్!

అన్ని మసాలా దినుసుల అతి చక్కని మేళవింపుతో నోరూరించే రుచు
మీకందిస్తాయి ప్రియ మసాలా పేస్టులు. మీరువండే
వెజిటేరియన్, నాన్‌వెజిటేరియన్ కర్రీ అయినా, లే
బిరియాని అయినా - మీరు చేయవలసినద
ప్రియం నాణ్యతను జోడించడవే
ఆ తరువాత అసలైన రుచులు
అందరిని అలరిస్తాయి. మిమ్మ
అభినందనలు ముంచెత్తుతాం



priya
Masala Paste

• బిరియాని మసాలా పేస్ట్ • వెజ్ కర్రీ మసాలా పేస్ట్ • నాన్‌వెజ్ కర్రీ మసాలా పేస్ట్

Ushodaya Enterprises Limited (Priya Foods Division), Eenadu Complex, Somajiguda, Hyderabad - 500 082, (A.P.) I
Phone : +91-40-3323717, 3324727 Fax :+91-40-3393640 E-mail: priyaexp@hd1.vsnl.net.in www.priyafoods